ఆర్ష విజ్ఞాన గ్రంథమాలాప్రచురణము నెం. 2

# శ్రీ రా మ ప్ర భ

## ( బా ల కాం డ )

గ్రం థ క ర్త :


శ్రీమద్రామాయణార్ణవ మథన, ఆర్ష విజ్ఞాన పరిబోధక,
గీ తా ప్ర చా ర క.

నం దూ రు సు బ్ర హ్మ ణ్య శ ర్మ

సత్యనారాయణ పురం, బెజవాడ

Lecturer on
RAMAYANAM
BHARATAM
BHAGAVATAM
&
GITA & UPANISHADS.

తొలి ముద్రణ

వెల 2—0—0
1000 ప్రతులు

ఈ గ్రంధ ముద్రణకు ధనసహాయమొనర్చినవారు

—♦ రాజపోషకులు ♦—

| | |
|---|---|
| శ్రీ నండూరు వీరభద్రశర్మ పాకయాజిగారు, ల్యాండులార్డు, శ్రోత్రియందారు, బెజవాడ | 116—0—0 |

—♦ సహాయకులు ♦—

| | |
|---|---|
| నాళం జగ్గయ్యగారు, మర్చంటు, బెజవాడ | 25—0—0 |
| కుందేరు సత్యనారాయణగారు, బి.ఏ., బి యల్., వకీలు బెజవాడ | 25—0—0 |

వాసుదేవ ముద్రాక్షరశాల, హైదరాబాదులో ముద్రింపబడియె.

# తొలిపలుకు

శ్రీరాముడు సాక్షాన్నారాయణుడనియు లేక ఒకగొప్ప చక్రవర్తి అనియు దేవాంశసంభూతుడనియు అనేకు లనేకవిధములుగా భావించుచున్నారు. ఎవరెట్లు భావించినను ఆమహనీయుని జీవితచరిత్ర సర్వులకాదరణీయమై జీవితాదర్శమై యున్నది. అట్టి మహనీయుని జీవితమును వాల్మీకిమహర్షి యనెడి శిల్పి భారతదేశమునకు తాజ్ మహల్ వలె కడుసుందరముగా చిత్రించియున్నాడు. ఆమహల్ లోని శిల్పకళానైపుణ్యమును ఎవరెంత గ్రహింపగలరను విషయమున వారి వారి బుద్ధివైభవమును బట్టి ఎంతైనను గ్రహింపవచ్చును. బుద్ధివైభవమునకు అంతులేదుగదా! భోజభూపతి వచించినట్లు భగీరథునిచే తేబడిన గంగవలన సర్వులును తమ పితృదేవతలకు తర్పణములనొసంగి పితృదేవతల తృప్తిపరచుకొనునట్లు నేనువాల్మీకిగీత రఘుపుంగవకీర్తి లేశములను గానముచేసి కృతకృత్యుడనగుదుననియు,ఋషిహృదయమును విబుధజనులవలన విన్నంత కన్నంత సహృదయులకు తెలియచేయదలచి సులభశైలిలో యీ గద్య ప్రబంధమును రచించి నా ఇష్టదైవమగు శ్రీరామచంద్రున కర్పించితిని. ఇందలి అమూల్యములగు విషయములు పాఠకులు సాకల్యముగా పఠించి విషయముల గ్రహించి కవి హృదయమును ఆనందింప చేయుదురని నావిశ్వాసము.

ఆర్ష విజ్ఞానప్రబోధక,
నండూరు సుబ్రహ్మణ్యశర్మ.

# అభిప్రాయములు

శ్రీరామప్రభ, అను నీ గద్యప్రబంధమును శ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మ గారు రచించిరి, ఇందలి చరిత్రము నూతనముకాదు. సర్వజనాదరపాత్రమును జగద్విదితమునగు రామాయణమే. కాని గ్రంథకర్త రచనాకౌశలింబట్టి నవీనమేమో అనిపించును. ఒకటే పక్వాన్నము పాచకభేదముచే రుచిభేదమును కలిగించునుగదా! ఈ గ్రంథకర్తకు సంస్కృతాంధ్రసాహిత్యమేగాక సర్వస్మార్తకర్మములకును యాజకత్వమొనర్పదగు వైదికమంత్రములుగూడ నిర్దుష్టముగ వచ్చును. అక్కడక్కడ నీసందర్భము గ్రంథమందు గోచరించుచునేయుండును. శైలి మధురముగ నున్నది. భాష యెక్కడో వ్యావహారికపదము దొరలినను గ్రాంథికమే. కనుక విద్యాశాఖాధికార్లు యే. యస్. ఏ. కేని పాఠ్యగ్రంథముగానిర్ణయించి గ్రంథకర్తకు ప్రోత్సాహకులగుదురని నావిశ్వాసము. ఇది సూత్రప్రాయమగు నాఅభిప్రాయము.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి శతావధాని.
క్షీరసాగరం, బెజవాడ.కృ॥ డి॥
1—2—46

శ్రీ శ్రీ మిత్రులగు నండూరు సుబ్రహ్మణ్యశర్మగారిచే రచింపబడిన "శ్రీరామప్రభ" తన ప్రభలను ఆంధ్రదేశమునందన్నిదిక్కులను వ్యాపింపజేయ గలదనుటలో సందేహ మేమాత్రమూలేదు, ఈపద్ధతిపై శ్రీమద్రామాయణము గద్య ప్రబంధముగా రచించినవా రింతవఱకు లేరు, కథాభాగముకన్న విషయవిమర్శనకే ప్రాధాన్య మీయబడినది. కావున నీ గ్రంథము మఱింత శోభించగలదు. వీరు గ్రంథకర్తలేగాక, ఉపన్యాసకులుగూడ. వీరుపన్యాసములిచ్చిన తణుకు, భీమవరము, చీరాల, బెజవాడ, గుంటూరు మొదలైన పట్టణములలో వీరి యుపన్యాసములువిన్న ప్రజలు "మఱల నెప్పుడు విను భాగ్యముగల్గును!" అని కలవరించని వారు లేరు. వీరు కాలానుసారముగా హిందూస్థానీగూడ అభ్యసించి, ఇతర రాష్ట్రములయందుగూడ "నీ ప్రభ"ను ప్రకాశింపజేయుదురుగాక.

శ్రేయోభిలాషి
విన్నకోట వెంకటరత్నశర్మ
"గీతా - బైబిలు - ఖొరాను" గ్రంథకర్త.
గీతాప్రచురణాలయము - దుర్గాఅగ్రహారం, బెజవాడ.

# విషయసూచిక



సవరణ

| పుట | పంక్తి | |
|---|---|---|
| 14 | 15 | కనబడుట - కనబడకుండుటఅనియు |
| 165 | 9 | 'నేటివరకు' తరువాత మార్పులేనిది అనికలిపి చదువవలెను. |
| 176 | 20 | సకారంచ హాకారంచ |

శ్రీరామచంద్ర సహాయం.

అవిఘ్నమస్తు.

# శ్రీ రా మ ప్ర భ .

## బా ల కాం డ

---

### 1 ఉ ప దే శ ము

ఉ॥ చక్కనివాడు సర్వగుణ సంపదలుంగలవాడు భక్తిచే
చిక్కెడువాడు లోకముల చిక్కెడలించెడువాడు దీనులన్
మిక్కిలి ప్రోచువాడు కననేర్చిన గన్పడువాడు గానని
వక్కరపాటుతోడ మనసా! హరిపాదము లాశ్రయింపుమా.

అది ప్రశాంతమగు ఆశ్రమ ప్రదేశము. అతిమనోహర ములగు పుష్పఫలజాలముతోగూడిన వృక్షములు, వానిపై నివసించు నానావిధ శకుంతకుల కలకలారావములు, తొలి సంధ్యా నక్షత్రములవలె మినుకుమినుకుమని కన్పట్టు మునికుటీరములు, వానికి సమీపమున, మందాకినీనది రమ్యముగా ప్రవహించుచుండును. అచటిచిలుకలు, వేదార్థముల సైతము యుక్తియుక్తముగా వివాదములు చేయును. ఏనుగుల చెవులసీడను సింహములు సుఖము నిద్రించును. మూషక మార్జాలములు వైరములువీడి కలసిమెలసియుండును. మునీశ్వరులు నీవారాన్న పిండములను భూతములకు బలియొసంగుచుందురు. ఇట్లా మునిపల్లె కేవలము సత్వగుణ ప్రధానమైనది. అందొక కుటీరమున మునీశ్వరులలో మిన్నయై వాల్మీకి మునీంద్రుడు ప్రకాశించుచుండెను.

అట్లుండ నొకతరి * తపోనిష్ఠాగరిష్ఠుడును, సంతత వేదాధ్యయన సంపన్నుడును, బ్రహ్మనిష్ఠుడును అగు నారద మహర్షి వాల్మీకిఋషికడ కేతెంచెను. నియతాత్ముడగు వాల్మీకియు అతిహర్షమున నారదుని విధివిధానమున అర్ఘ్యపాద్యాది విధుల పూజించి ఉచితాసనాసీనునిజేసి ఇట్లు ప్రశ్నించెను. ఈ లోకమునందు శుభగుణ సంపన్నుడును, ధర్మరతుడును, చేసినమేలును మరువనివాడును, సత్యధురంధరుడును, వ్రతదీక్షాపరుండును, నిర్మలచరిత్రుడును, సర్వభూతహితుడును, సమర్థుడును పండితుడును, సర్వజన హృదయానందకరుడును, శమాది సంపన్నుడును, దివ్యమగు కాంతిగలవాడును, అసూయారహితుడును, కోపించినచో దేవదానవులకు సైతము భయంకరుడును అగు నుత్తమ పురుషు డెవడు ? మహర్షీ! ఇట్టి పురుషుని తెలిసికొననీవే సమర్థుడవు.

---

* శ్లో॥ తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాంవరం
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్॥
1 2
,, కోన్వస్మిన్సాంప్రతంలోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ ।
3 4 5 6
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥
7 8
,, చారిత్రేణచ కో యుక్త స్సర్వభూతేషు కోహితః ।
9 10 11
విద్వాన్ కః కస్సమర్థశ్చ కశ్చైక ప్రియ దర్శనః ।
12 13 14 15
,, ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః ॥
16
కస్యబిభ్యతి దేవాశ్చ జాత రోషస్యసంయుగే

,, ఏతత్ ........................................

మహర్షేత్వం సమర్థోసి జ్ఞాతుమేవం విధంనరం ॥

1. గుణవాన్ – అనేక సుగుణములు గలవాడు. ఆశ్రిత రక్షణము నిరాడంబరము మొదలుగాగల గుణములెన్నియో రామచరిత మందిమిడియున్నవి.

2. వీర్యవాన్:–తన బలమును కోల్పోక అనాయాసముగా శత్రువుల జయించువాడు. తాటక వధ మొదలు రావణసంహారము వరకును గల రాముని బాహుబల ప్రదర్శనము వీర్యవత్వమును సూచించుచున్నది.

3. ధర్మజ్ఞః– ధర్మజ్ఞుడు. రామునిచరిత్రయందు ప్రతిఘట్టమందును ధర్మము స్ఫురించు చుండును.

4. కృతజ్ఞః – చేసిన మేలునుమరువనివాడు, జటాయునంస్కారమున రామునియందు ప్రతీతమగును.

5. సత్యవాక్యః — సత్యరతుడు. అయోధ్య కాం. స. 19. 30 శ్లో. తద్బ్రూహి...........కరిష్యే ప్రతిజానేచ రామోద్విర్నాభి భాషతే॥ అనువచనమున సత్యనిష్ఠ రామునియందు విశదమగుచున్నది.

6. దృఢవ్రతః – నిశ్చల సంకల్పము కలవాడు. అయోధ్యకా. 112 స. పదార్థములు తమ స్వభావ ధర్మము వీడినను నాప్రతిజ్ఞను నేను వీడను. అన్న వాక్యముచే రామునియందలి వ్రతదీక్ష దృఢమగుచున్నది.

7. చారిత్రేణచ కోయుక్తః:–జీవితమందు దోషములేనివాడు. ఇది రాముని చరిత్ర మంద. తటను స్ఫురించును.

8 సర్వభూతేషు కోహితః—సమస్తభూతములందును ఉచితమగు హితమును కోరువాడు, తాటకవధ మొదలగునవి అన్నియు భూతహితము కొరకు కొనర్చినవే. సర్వభూతహితము. ఉచితరీతిని సర్వభూతములకు సుఖమును కల్గించుట.

9 విద్వాన్–పండితుడు, అయోధ్యాకాండమున రామునకును జాబాలికిని జరిగిన సంవాదమందు కానవగును.

10 సమర్థః–ఎట్టికార్యమైనను స్వయముగా నిర్వహింప సమర్థుడు. ఈ సమర్థత సముద్రుని ప్రత్యక్షము చేసుకొనుట యందు చూడనగును.

11 ప్రియదర్శనః, జగన్మోహనుడై సర్వులకు కానుపించువాడు. ఈ జగన్మోహనాకారము, అరణ్యకాండమున రాక్షసస్త్రీయగు శూర్పనఖను సైతము మోహింపజేసెను.

అన నారదుడు మందహాసముతో నీవడిగిన సర్వగుణ సంపన్నులగు పురుషులు లోకమున ప్రాయశః దుర్లభము. అయినను, చెప్పెదనని రామచరిత సర్వమును వాల్మీకి కుపదేశించెను. వాల్మీకియు గురువగు నారదుని వలన రామ తత్త్వోపదేశమును పొందెను. నారద మహాముని వాల్మీకిచే పూజితుడై బ్రహ్మలోకమున కరిగెను.

పాఠకులారా! మనము ఇంతదనుక పఠించిన కథయందలి సారమును గ్రహింతము. వాల్మీకి నారదుని ఉత్తమ గుణ సంపత్తి గల పురుషుని చెప్పుమని వేడెను. ప్రశ్నించినతోడనే నారదుడు రామచరితను ఉపదేశించెను. వాల్మీకియు పరమ కౌతూహలమున వినెను. కాని, వాల్మీకి రామచరిత చెప్పుమని యడుగలేదు. నారదుని ప్రశ్నించుతరి రామచరిత వ్రాయు నభిప్రాయమును వాల్మీకికిలేదు. నారదోపదేశమునకు పూర్వము రామచంద్రుని వాల్మీకి ఎరిగియె యున్నను మాంధాతాదులవలె

---

12 ఆత్మవాన్– తనకు స్వాధీనమైన మనస్సుకలవాడు. ఈ ఆత్మసత్త్వము రాజ్యభోగములందును అరణ్యక్లేశములందును సమానమగు నడవడియు, ఏకపత్నీవ్రతమును రాముని యందు సూచించుచున్నవి.

13 జితక్రోధః– సమర్థుడయ్యును క్రోధమును జయించినవాడు. కైకేయి అరణ్యమునకు బోవ అజ్ఞాపించు ఘట్టమున రామునియందు కానవగును.

14 ద్యుతిమాన్– ఆశ్చర్యకరమగు కాంతిగలవాడు. దీనిని అరణ్యకాండమున మునిసందర్శనమున చూడనగును.

15 అనసూయకః– ఇతరుల సుగుణములందు దోషములాపాదించకుండుట. యుద్ధకాండమున రావణుని ప్రతాపము వర్ణించుటయందు స్పష్టము.

16 కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే–కోపించినచో యుద్ధరంగమున దేవదానవులను సైతము భయపెట్టువాడు. ఇది రామ రావణయుద్ధమున కానవగును.

రామచంద్రుడును నరేంద్రుడనియె వాల్మీకి విశ్వాసము. కాని నారదోపదేశముచే నరేంద్రుడగు రామచంద్రుడు పరమాత్మ యని గ్రహించి విశ్వసించెను. పరిపూర్ణుడగు పరమాత్మయె కానిచో, ఆతనియందు సుగుణములన్నియు పరిపూర్ణముగ యేలమూర్తీభవించి యుండును ? అని ఆతడు వితర్కించుకొని తన యభిప్రాయమును దృఢపరచుకొనెను. ఇట్లే జిజ్ఞాసులగు వారు సద్గురువుల నాశ్రయించి, ప్రశ్నించి, విశ్వసించి జ్ఞానమును బడయుదురు. దీనినే శ్రీకృష్ణ భగవానుడిట్లు గీతాశాస్త్రమున చెప్పుచున్నాడు.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వ దర్శినః.

తా॥ పెద్దల సేవచేయుచు సందేహములుండిన మాటి మాటికి నడిగి తెలుసుకొనుచు అనుభవజ్ఞానులయొద్ద జ్ఞానమును పొందుము. అనుభవ జ్ఞానులే నీ సందేహముల తీర్చగలరుగాని, కేవల విద్వాంసులు నీకేమియు జ్ఞానమీయజాలరు.

## 2. కుశలవులు

సీ॥ తొలికోడి కూసెను తెలతెల్ల వారెను
అరుణకాంతులు తూర్పు నలవరించె
చల్లచల్లగ వీచె పిల్ల తెమ్మెరలిప్డె
అరవిచ్చు పుష్పాలి సురభిగూడి
మందార మకరంద మాధుర్యమున తేలు
మధుపాలు ఝుమ్మని మరలెచదల

అల్పకాంతులతోడి ఆకాశవేదిపై
తారాలి ప్రభమాసి తరుగుచుండె.

గీ॥ వేగుచుక్కకు భయపడి వెడలు చంద్రు
డరయ దినరాజు పంపుచేననగ దోచె
కూసె పక్షులు సొంపుగా గూళ్ళవీడి
కావు కావని కాకులు కదలె దివిని.

ఉషఃకాల శిశిర పవన తరంగములు మెల్లమెల్లగా వీచుచుండెను. నీలమగు నాకాశము దిక్కుల ప్రశాంతమును వెదజల్లుచుండెను. ప్రకృతి నిస్తబ్ధమై మెల్లమెల్లన మౌనవ్రతమును వీడదొడగెను. తారాగణంబులు అల్పకాంతితో మునీశ్వరుల పర్ణకుటీరములపై ప్రకాశించుచుండెను. ఈ ప్రశాంతమగు కాలము జీవులపాలిటి పెన్నిధి. ఆ కుటీరములనుండి నియతాత్ముడగు తపస్వి శిష్యసహితుడై పోదొడంగెను. అప్పుడే అరవిచ్చిన పుష్పసౌరభమువారి నానందింప జేయసాగెను. శుకపికాది శకుంతములు మనోహరముగా కూయదొడగెను. ప్రాగంగన ను ప్తజనాళిపై కినిసినదో యన అరుణకాంతిని వహించెను. నిజముగా నాటి ప్రకృతి శోభను అనుభవించువారి జీవితమే ధన్యతమము. అది యీ గురుశిష్యులకు లభించెను. వారి హృదయములు పవిత్రమైనవి. వారు నిత్యానంద స్వరూపులు. ఆ గురు శిష్యు లన్యోన్య ప్రేమ కొని యాడదగినది. వారావనమందలి రమణీయమగు విశేషములను చూచి అచ్చెరువందుచు అధికా కృష్టచిత్తులై పోవుచుండిరి. వారట్లు కొంతదూర మరిగిరి. కనుమేర దూరములో గంగకు

సమీపమందున్న తమసానది వారలకు కాన్పించుచుండెను. అందలి రమణీయోదకము సజ్జనుల హృదయమువలె చల్లనై ప్రసన్నముగా నుండెను. అందలి స్వచ్ఛమగు గాలి వారి శరీరముల కానందము గూర్చెను. అంత నా ఋషి శిష్యహస్తము నుండి వల్కలముగైకొనెను. కమండలమును చేపట్టి నదిని ప్రవేశించెను. ఋషి విశాలమగు నాకాననమున చూడ్కుల నలు దిశల బరపెను. వృక్షాగ్రములు, వానియందలి పక్షిరాజములు, కాననగుచుండెను. ఆ ఋషి చూడ్కులు మన్మథోద్రేకముతో మనోహరముగా కూయుచున్న క్రౌంచమిథునముపై బడెను. (క్రౌంచపక్షి) అది వాని యథార్థమగు దాంపత్యప్రేమ. పక్షులైనను వాని ప్రేమను భగవత్స్వరూపుడగు వాల్మీకి గ్రహింపగలిగెను. ఋషి ఆనందమునకు హద్దు లేకపోయెను. నిత్యవిధులనుకూడ మరచెను.

అతని సర్వేంద్రియముల పటిమ నేత్రములశక్తిలో లీనమయ్యెను. దృష్టి స్థిరత్వమును పొందెను పాపము! ఆ దంపతులలో బురుషపక్షిని పాపుడగు బోయవాడొకండు బాణముచే కొట్టెను. అది క్రిందపడి విలవిల కొట్టుకొనుచుండె. భర్త మరణవేదనను జూచి సహింప జాలక ఆడుపక్షి పలువిధముల విలపింపజొచ్చెను. కరుణాసముద్రుడగు నా ఋషి సత్తముని ఆనందము హఠాత్తుగ తారుమారాయెను. అతని కరుణకు మేర లేదు. క్షణములో ముని క్రోధపూరితు డాయెను. ముఖకమల మెఱ్ఱబారెను. శత్రువునందలి చూపు లధికమాయెను. వాక్పటుత్వము విజృంభించెను, ఋషి సర్వప్రపంచమును మరచెను.

అంత నాతని ముఖమునుండి పిడుగువంటి శాపవాక్యము లుద్భ
విల్లెను.

* శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాంత్వమగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితం.

ఓ బోయవాడా! నీవు మన్మధవిలాసముతో అతి మనో
హరముగా విహరించు క్రౌంచమిధునము నందొక మొగపిట్టను
గొట్టితివి. అందుచే నీవు అల్పాయుష్కుడ వగుదువుగాక.

ముని క్రోధ ముపశమించెను. శిష్యుడగు భరద్వాజునితో
వత్సా! నేను స్నానార్థమై వచ్చుచుంటిని; క్రౌంచమిధునము
నాకు కనుపించుచుండెను; పాపుడగు నాబోయ ఆ మిధునమునం
దొకదానిని కొట్టుటేమి? నేను దానినింగని కలుషించుటేమి?
ఈ ఘోరశాప మిడుటేమి? ఈ శోకము శ్లోకమగుటేమి.
నాలుగు పాదములతో—సనురూప వర్ణములతో—లయతో
వీణెపై మీటుట కనుకూలముగ నుండుటేమి! అని యా
ఋషివాకొనెను.

శిష్యుడు, ఏకసంధాగ్రాహియగు భరద్వాజు డాశ్లోక
మును పఠించెను. వాల్మీకి ఆనందముతో తమసా జలమున
మునిగి స్వధర్మానుష్ఠానము నిర్వర్తించెను.

---

* ఈ శ్లోకమందు రామాయణ కధ ధ్వనించియున్నది. ఓమానిషాదా!.... ఓ విష్ణుమూర్తీ! రావణ మండోదరులను దంపతులలో కామమోహితుడున, సీతాప హర్తయునగు రావణుడు చంపబడెను. కాన నీవు పెక్కు సంవత్సరముల యశస్సును పొందుదువుగాక. ఈ యర్థమువలన కావ్యాదియందు చేయదగిన మంగళము, ఆశీర్వాదము సూచింపబడియున్నవి.

పాఠకులారా! ఆతని వచనములు శ్లోకరూపమై రామాయణ మహాకావ్యమునకు మూలము గానర్థము శ్రావ్యము మనోహరమునై యున్నవి. చూడుడు.

ఆతడాశ్రమమున నడుగిడెను. కాని ఆతని మనస్సు తమసాతీరమును - ధనుర్ధరుడగు బోయను - తాడితమగు పక్షిని- దారుణా రావముతో విలపించుచున్న యాడుపక్షిని - తన శ్లోకమును మరువలేదు. అతని చిత్తము శ్లోకముపై, వాక్యలోకముపై. బ్రహ్మ అచటికేతెంచెను. * వాల్మీకి ఆసనాదులచే పూజించెను. కాని ఆతని మనస్సు బ్రహ్మపై లేదు. కిరాతుని దుష్కృత్యము, క్రౌంచీవిలాపము, క్రౌంచశరీరము, ఆ శ్లోకము, అతని మనస్సునందు పరివర్తించుచుండెను. కన్నుల నుండి బాష్పకణములు కాల్వలై ప్రవహించు చుండెను. లోక కర్తయగు బ్రహ్మ ఆతని అభిప్రాయమెరిగి మునిపుంగవా! సరస్వతి, నా అనుగ్రహము చేతనే నీ జిహ్వాగ్రమున నివసించి యున్నది, నీ ముఖమునుండి వెలువడిన శ్లోకము ఛందోబద్ధమై మృదు మధు రాక్షర సంపుటితో ఒప్పియున్నది. నీవు విచారింపకుము. ఋషిసత్తమా! నారద మహర్షిచే నీవు వినిన రామచరితము సర్వమును లిఖింపుము, రామచరిత సర్వమును జరిగినది జరిగినట్లు నీకు ప్రత్యక్షము కాగలదు. నీ కావ్యము రాబోవు కవుల కాధారమగును. ఇం దసత్యవాక్యములకు తావులేదు. రామనామ మెంతవరకు లోకమున నిలచి యుండునో అంత

---

* చదువరులారా! బ్రహ్మపరిత్యక్తమగుటను భోజభూపతి మనోహరముగా యిట్లు చిత్రించియున్నాడు. శ్లో॥ వాణీవిలాస మపరత్రకృతోప లంభ మంభోజ భూరసహమాన ఇవాపరాసీత్॥ తా॥ సరస్వతీ విలాసములన్నియు వాల్మీకి నాశ్రయించెను దానింగని సహింపక "యో" యన బ్రహ్మ వాల్మీకి కడకేతెంచెను. సరస్వతీ విలాసములు వాల్మీకిని స్వయముగా వరించిన వనుటచే కావ్యమందలి శృంగారాది రసములు, ధ్వనులు, మనము ఇదమిత్థమని వర్ణించుట కలవి కాని భావము,

దనుక నీ కావ్యము నిలిచియుండును. అని ఆజ్ఞాపించి బ్రహ్మ సత్యలోకమున కేగెను.

నిశ్చలచిత్తుడగు ఆముని కుశాసన మధిష్ఠించి పద్మాసనాసీనుడై కనుదమ్ములు మూసుకొని యోగదృష్టిచే తిలకింప జొచ్చెను.

ఆమహనీయుని అంతఃకరణమున దశరథుని సత్యవాక్పరిపాలనము- కైకేయి స్వార్థాభిలాష-శ్రీరాముని స్థితప్రజ్ఞత్వము-సీతపాతివ్రత్యము, భరతుని భ్రాతృప్రేమ, లక్ష్మణుని నిత్యకైంకర్యము, మారీచుని భీతి, రావణుని దుండగములు, రామచంద్రుని ధర్మపరిపాలన, సర్వము ఇట్లుజరిగినది, జరుగనున్నది, రహస్యమంతయు అతనికి జ్ఞాననేత్రమున గోచరించెను. ముని ఇట్లు యోగదృష్టిచే తిలకించి రామాయణ మహాకావ్య రచన కుద్యుక్తుడాయెను. * ఈ గ్రంధరాజము యిరువది నాలుగు వేల శ్లోకములతో అయిదునూర్ల సర్గలతో విరాజిల్లి యేడు కాండలతో నవరసభరితమై ప్రపంచమున ఆది కావ్యమై ధ్వని గర్భితమై భారతీయుల పుణ్యరాశియై అతి మనోహరముగ ముగిసెను. కొంతకాలము గడచెను. వాల్మీకి ఆశ్రమమున ఇద్దరు బాలురు విద్యార్థులై నిలచిరి. ఆ లే బాలురు, మనోహర మూర్తులు. వారి గాంభీర్యముగల ముఖకాంతి, ఆజానుబాహువులు, విశాల వక్షస్థలములు, రాజచిహ్నముల సూచించు

---

కుశీలవులు సంగీత పాటకులు

* రామాయణము రామచంద్రుడు పట్టాభిషేక పూర్వము వ్రాయబడియుండలేదు.
శ్లో॥ ప్రాప్తరాజ్యస్య రామస్యచకార భగవాన్ ఋషిః ॥ ఇందులకీ వాక్యము ప్రమాణము.

చున్నను, జడలవంటి పిల్లకూకటులు, నారబట్టలు, విభూతిరేఖలు, రుద్రాక్షమాలలు, మునివేషముల ప్రకటించుచుండెను వారు రాజపుత్రులు; శ్రీరామ పుత్రులు; సీతాపుత్రులు; కుశలవులు; కుశీలవులు. వాల్మీకిముని ఆశ్రమమందలి విద్యార్థులు. ఋషి వారి జేర దీసి అపార ముదంబున అశేషముగ సర్వశాస్త్రములును సర్వతంత్రములను సర్వ అస్త్రప్రయోగోప సంహారములును బోధించెను వేదార్థమును తెలుపుటకై అనుష్ఠానమును చూపించుటకై రామాయణకావ్యమును వారిని పఠింపజేసెను. వారును గురునితో సతీర్థులతో రాముని అశ్వమేధమునకు వచ్చిరి. గురుని యాజ్ఞచేతను సహజమగు నుత్సాహముచేతను అచట నచట రామచరితను గానము చేయుచుండిరి.

ఆ గానమాధుర్యమున కచ్చెరువడి అచ్చటి మునీశ్వరులు "ఆహా!ఏమి! గీతముల మాధుర్యము. ఈశ్లోకముల మధురిమ కథానాయకుని చరిత్రము చాల కాలము నాటిదైనను నేడు ప్రత్యక్షముగ కన్నుల ఎదుట కానుపించుచున్నది." అని వారన్యోన్యము కొనియాడుకొనుచు ఆనందమును పట్టజాలక బాష్పముల రాల్చిరి. బాలకులకు వారి కత్యంతావసరములగు కమండలములు జపమాలలనైతమొసంగిరి. మరి యెన్నెన్నియో ఆశీస్సుల నొసంగిరి. ఏమి! గీతముల మాధుర్యము! భగవానుని దివ్యలీలలు విరాగులగు మునీశ్వరులనైతము సరాగుల జేసె అట్లు కుశలవులు అయోధ్యా పురవీధులందున గానము చేయుచుండ రామచంద్రుడు సౌధోపరిభాగమునుండి ఆ బాలకుల గానము నాలకించెను. మునివేష ధరులగు బాలుర సౌకు

మార్యమునకు గానమాధుర్యమున కచ్చెరు వందెను. వారలను తన యాస్థానమునకు రావించెను. ఆ బాలకులును రామచంద్రుని యాజ్ఞానుసారము రామాయణ కథ నంతయును గానము చేయ సభాస్థలి నిలచిరి. చతుష్షష్టి కళాప్రవీణులు ఉచితాసనాసీనులై కథావిశేషముల నరయ వేచియుండిరి. ఆ సభా స్థలము నందలి పండితులు, ఉద్యోగస్థులు, కర్షకులు, కార్మికులు, గాన కళా విశారదులు, ఆ బాలుర గానామృతమును గ్రోలియు కథావిశేషముల నరసియు ఆనందాంబుధి నోలలాడిరి. ముని బాలుర గాన మాధుర్యము రామచంద్రుని సైతము మోహితుని జేసెను. తాను రాజనికూడ మరచెను. సింహాసనము డిగ్గి మెల్ల మెల్లగా బాలకుల సమీపించెను. * లక్ష్మణాదులను వినుమని ప్రోత్సహించెను. లక్ష్మణాదులును చెవులకింపుగా విని యానందించిరి.

ఆర్యులారా! ఆదినుండి యింతదనుక పఠించినకథయందు కొన్ని సంశయము లుదయించును. ఒకటి బోయవాడు తన జాతిధర్మ మగు వేటననుసరించెనుగదా! ధర్మాత్ముడగు వాల్మీకి అతని నేల శపించెను ? రెండు ఒక్కచో గూర్చున్న మునికి భూతభవిష్యత్కాల కథయు ఆయా ప్రదేశముల కరగిచూచిన గాని కానరాని భూగోళచిత్రములును కానవచ్చెనా! అట్లు చూచుట సాధ్యమా?

---

శ్లో॥ సచాపిరామః పరిషద్గతశ్శనై ర్బుభూషయాసక్త మనాబభూవహ,

పాఠకులారా! బాలుర గానమునకు రాముడు ముగ్ధుడయ్యెనని పఠించి యుంటిమి దీనరామాయణమందలి గానప్రాశస్త్యము సూచింపబడుచున్నది.

పాఠకులారా! ఈనాటి మనకుగల శక్తితో ఆనాటి మహర్షుల శక్తిని కొల్చిచూచిన ప్రయోజనములేదు. తీక్ష్ణ బుద్ధితో పరిశీలించి చూతము. మొదటిది ఋషిఅధర్మముగ శపించెననుట. ధర్మాత్ములగువారి అంతఃకరణములందు, అధర్మముదయించుట కవకాశమే లేదు. ధర్మాధర్మ విమర్శనములకు వారి అంతఃకరణమేగదా ప్రమాణము. దీనినే మహాకవియగు కాళిదాసిట్లు నుడివినాడు.

శ్లో॥ సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతః కరణ ప్రవృత్తయః.

తా॥ సత్పురుషులకుసందేహాస్పదమగువిషయముల యందు వారి అంతఃకరణము ప్రమాణమే గదా.

బోయలకు మృగముల వేటాడుట జాతిధర్మమయినను కామముచే విహరించు మృగముల వేటాడుట ధర్మముకాదు. కావుననే ధర్మాత్ముడగు ఋషి బోయను శపించెను. ఇట్లే భారతమునందు మృగరూపమును ధరించి కామోద్రేకమున మృగముతో విహరించు మునీశ్వరుని పాండుభూపతి వేటకై జని కొట్టెను. అంత నాఋషి యిట్లనెను.

శ్లో॥ సర్వభూత హితేకాలే సర్వభూతేప్సితే తథా
కోహివిద్వాన్మృగం హన్యాచ్చరంతంమైథునం వనే.

భా. ఆ. ప. 118-అ. 19-శ్లో.

తా॥ సమస్తజంతువులు ఆనందించునదియు కోరునదియు దాంపత్యసౌఖ్యమును అనుభవించుకాలమున జ్ఞానముకలవాడు వేటాడడు.

కాన ఋషి శాపము ధర్మమని తేలినది. ఇక రెండవదగు సందేహము ఋషి ఒకచో గూర్చుని సర్వప్రపంచమును చూడ గలిగెనా? యనునది. జ్ఞానోదయము రెండువిధములు. మొదటిది గ్రంథపరిచయము. పండితులు రచించిన గ్రంధముల పఠించి విజ్ఞానమును సంపాదించుట; ఈ జ్ఞానము సృష్టిలోని కడుస్వల్ప విషయములనే పరోక్షముగ తెలుసుకొనగలుగుచున్నది. రెండవది మనోనేత్రము. నేత్రేంద్రియముచే ఎదుర కానుపించు వస్తువుల చూచునట్లు యోగులు మనోనేత్రమును వికసింపజేసి సర్వవిషయములను వారిహృదయాకాశమునచూడగలుగుదురు. * ఇదియే యుత్తమ పద్ధతి.

పాతంజలి యోగసూత్రం 3. వి. పా. సూ. 16. 17.

సూ॥ పరిణామత్రయ సంయమా దతీతానాగతజ్ఞానమ్.

తా॥ చిత్తమునకు పరిదృష్ట అపరిదృష్టములను రెండు విధములగు ధర్మములు గలవు. పరిదృష్ట అపరిదృష్టము లనగా కనబడని యీ రెండుధర్మములను, ధారణ, ధ్యాన, సమాధులచే నియమము చేయవలెను. దానివలన భూత భవిష్య ద్వర్తమాన జ్ఞానముకలుగును.

సూ॥ భువన జ్ఞానం సూర్యసంయమాత్. 26. సూ.

సూర్యుని ధారణ ధ్యాన సమాధులచే నియమించినచో భూగోళమండలి రహస్యములన్నియు తెలియును.

శ్రీ వివేకానంద స్వాములవారుకూడ ఈ సాధనల నొనర్చి యుండెను.

---

* ఇది భారతీయులకు చిరపరిచితమై అనూచానముగా వచ్చుచున్నది. పాశ్చాత్యు లీ విషయమున ఇప్పుడిప్పుడే కన్నులు తెరచుచున్నారు.

# 3 అజసుతాశ్వమేధము

అది అయోధ్యాపురము అందుపురవీధు లతి విశాలములు. విమానా కారములుగా గట్టబడి నవరత్నములచే చెక్కబడి ప్రకాశించు భవనములు. అందలిచత్వరము లతిసుందరములు, మరియు నాపురము జూదము పీటవలె చూపరులకు అతిమనోహరముగా నుండెను. ఇది సాక్షాత్ మనువుచే నిర్మింపబడినది. ఇది పన్నెండు యోజనముల పొడవు, మూడుయోజనముల వెడల్పు, సర్వయంత్రాయుధములకును ఆటపట్టు. ఇందనేక శిల్పులు కలరు. విచిత్రములగు వధూనాటకశాలలు, సౌధోపరిభాగముల రాజ చిహ్నోపేతములగు త్రివర్ణపతాకములు గంభీరములగు దుర్గపరిఘములు వివిధదేశాంతర వ్యాపారమునకు కేంద్రస్థానమై సిద్ధులపాలిటి పెన్నిధియైన విమానమోయన ఆపురము కాన నగుచుండెను. అట్టి యాపురము అమరావతి యననొప్పు. ఆపట్టణము వెలుపల రెండు యోజనములు ప్రదేశమును విడిసియున్న యుద్ధభటులు అయోధ్య అను పదమును సార్థకపరుచుచుండిరి. అందలి ప్రజలు ధర్మస్వరూపులు. పిల్లల చావులు తండ్రులెరుగరు. అగ్నిభయములు పరదభయములు లేవు. మగలచావులు మగువ లెరుగరు. ఇంటింట ధనధాన్యములు విరాజిల్లును. గావున,చోర భిక్షుకభయములులేవు. వ్యాధులుకానరావు అందరు రూపసులే. అందరు భోగులైనను ఇంద్రియముల జయించినవారే. అందరూ వారి వారి వృత్తులను వారు వారు సక్రమముగా నిర్వర్తించువారే. అందరు నతిథి పూజాతత్పరులే.

పరిజలందరు దేవతానుగ్రహ పాత్రులుగ నుండిరి. అట్లు భాగ్యలక్ష్మితో తులదూగు దేశమునకు రాజు దశరథుడు. అతడు సత్యవ్రత పరాయణుడు. ఉదార హృదయుడు. ప్రజాహితుడు. ఈతని రాజ్యమందు శత్రువులు లేరు అతనికి, ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు సుమంత్రుడు అను ఎనమండ్రు మంత్రులు గలరు. (ఇప్పటి గవర్నర్ కౌంసలు సలహాదార్లవలె) వారు సుశిక్షితులు న్యాయపరులు. సంధివిగ్రహయానములను చక్కగా తెలిసినవారు, ఇంగితజ్ఞులు, నీతిశాస్త్రనిపుణులు, వీరులు, ప్రియవాదులైనను సత్యవాదులు విదేశవిజ్ఞానమును చక్కగా నెరిగిన బుద్ధికుశలులు. సుతులనైనను అధర్మపరులైనచో దండింతురు. గుణమున్న శత్రువునైనను పూజింతురు. ఇట్టి గుణసంపత్తులుగల మంత్రులతో దశరథుడు రాజ్యమును పరిపాలించెను. ఇట్టి మహదైశ్వర్యములతో దులదూగుచున్న నా రాజునకు కౌసల్య సుమిత్ర కైకేయీలను ముగ్గురుభార్యలు గలరు. రాజు వీరలతో పెద్దకాలము విషయభోగముల ననుభవించెను. కాని యామహారాజునకు వంశోద్ధారకులగు కుమారులు లేమి భాగ్యభోగములు నిస్సారము లయ్యెను. పరసౌఖ్యములును దూరములాయెను.

చ॥ తగిన సుపుత్రులంబడసి ధర్మువు తప్పక తమ్మునుత్తముల్
పొగడగ మన్మహాతులు పొందుగతుల్ కడుఘోరనిష్ఠతో
దగిలి తపంబుసేసియును దక్షిణలిమ్ముగ నిచ్చి యజ్ఞముల్
నెగడగజేసియుం బడయనేర రపుత్రుకులైన దుర్మతుల్.

నిక్కమె. మానవునకు మూడుఋణములుండుటవలన జన్మవచ్చును. పుత్రవంతుడై దేవపూజకుడై విద్వాంసుడు కాని వాడు ఆ ఋణముల నెట్లు తీర్చును?

కాన రాజపుత్రులలేమిచే చింతింపజొచ్చెను. అత్తరి, ఇంగితజ్ఞుడగు సుమంత్రుడను, మంత్రిసత్తముడు బ్రహ్మసభయందు తాను విన్నవృత్తాంతమును రాజునకు తెలిపి పుత్రకామేష్టి సలుపుమని ప్రేరేపించెను. ఈజన్నమునకు విభాండకుని పుత్రుడగు ఋష్యశృంగుడే అధ్వర్యము వహించవలెననెను.

విభాండకుడను ఒక ఋషిగలడు. ఒకతరి యీతడు సరస్సునందు జలక్రీడ నొనర్చుచున్న ఊర్వశినిచూచి మోహింపగా, రేతస్ఖలనమై సరస్సునందు పడెను. దాని నొకలేడి త్రాగ అది గర్భమును ధరించెను. దానియందు శృంగముగల పురుషుడు జన్మించెను, ఈతడే ఋష్యశృంగుడు. వేదవేదాంగముల నభ్యసించినవాడు. నిత్యాగ్ని వ్రతముచే అగ్నిహోత్రుని వంటి తేజస్సు కలవాడు. పత్తనవింతలుగాని, స్త్రీలనుగాని, వినియైన నెరుగడు. అట్టివాడగుటచేతనే విషయసుఖములకు దూరుడాయెను. అధ్యయనము లేని కాలమునందైనను ఇటునటుబోక గురుశుశ్రూషచే కాలము గడపువాడు. అతడొకనాడు దైవయోగముచే అరణ్యమున తిరుగుచుండగా చిత్రవేషధారిణులగు జవరాండ్రాతని సమీపించిరి. వారివస్త్రములు నూతనములును, అతి మనోహరములునై యున్నవి. శరీరచ్ఛాయ బంగారము

---

శ్లో॥ ధృష్టిర్జయంతో విజయ స్సిద్ధార్థో హ్యర్థసాధకః
అశోకో మంత్రపాలశ్చ సుమంత్రశ్చాష్టమోభవత్.

ముఖపద్మముల సౌరభము వెదజల్లుచుండెను. విచిత్రములగు నాభరణములతో నొప్పియుండిరి. వారు మధురస్వరముతో గానముచేయుచు ఆతని చెంత నిలిచిరి. ఋషియు వారివిలాసములన్ని ఋషుల చిహ్నములని మనస్సులో నిట్లు భావింప జొచ్చెను. నీలవేణులగు వారి కేశపాశములు మునీశ్వరులజడలు. వారిదుకూలములు నారచీరెలు. వారిగబ్బిగుబ్బలు శృంగములు అని భావించెను. అట్లు భావించి భక్తిపూర్వకముగ పూజింప తన యాశ్రమమునకు తోడ్కొనిపోయెను. వారల దర్భాసనముల నాసీనులంజేసి వన్యఫలముల నతిథిసత్కారముల నొనర్చెను. ఆ జవ్వనులును విభాండక మహాముని వచ్చునను భయముచే గమనోన్ముఖులయ్యును తాము దెచ్చిన మధురాహారములను సుగంధ ద్రవ్యములను మునినాస్వాదింప జేసిరి. అంతియగాక చిరునగవుచే మునిని కౌగిట జేర్చిరి. ఋషియు వారి స్పర్శసుఖమునకు మధురాహారమునకు మిక్కిలి వ్యామోహితుడయ్యెను. ఆతని జీవితమందెన్నడును యిట్టి స్పర్శసుఖమును గాని మధురాహార రసాస్వాదనముగాని వనచరుడగుటచే అనుభవించి యెరుగడు. ఆతని హృదయమం దస్వస్థత యేర్పడెను. వారల వెన్నంటెను, వారాతని రోమపాదునిచే పాలింపబడు అంగరాజ్యమునకు గొంపోయిరి. వర్షములేక బాధపడు నారాజ్యమందు మహాత్ముడగు ఋషి ఉజ్జ్వల ప్రభావముచే నాతని తోడనే వర్షమును ప్రవేశించెను. ఋషిప్రభావమునకు రాజు సంతసించి యథార్హముగ పూజించెను, తన కుమార్తెయగు శాంతనిచ్చి వివాహము జేసెను. శాంతస్వభావయగు నా శాం

తతో గూడి శాంతియుక్తుడగు నా ఋషి సుఖ మనుభ వించెను.

సంయములు వేదపారగులగు వశిష్ఠాదిమహార్షులును, అశ్వమేధము చేయవలెననియు, ఋష్యశృంగుడు అధ్వర్యము వహించవలెనని నుడివిరి.

దశరథుడు పుత్రకాంక్షచే ఋష్యశృంగుని గొనివచ్చి వసంత ప్రారంభమున చైత్రమాసమున అశ్వమేధమును ప్రారంభించెను వశిష్ఠాది ఋషులు ఋత్విక్కులైరి. ఇందుప్రధానుడు ఋష్యశృంగుడు యజ్ఞవేది సరయూనది ఉత్తరభాగమున నుండెను. యజ్ఞశాల లతివిశాలములు. అలంకృతములగుయూపస్తంభములు సప్తఋషిమండలమువలె ప్రకాశించుచుండెను. మూడు నూర్లు యజ్ఞీయ పశుగణంబులు విరాజిల్లుచుండెను. ఋషిగణ వేదాధ్యయన మృదు మధుర భణుతులు, సుగంధయుతమగు హోమధూమము, హవ్యకవ్యములకై నాహ్వానింపబడు ప్రేష ధ్వనులు, సమభావములతో గూడిన చాతుర్వర్ణ్యసత్కారములు, సత్కారయుతమగు అన్నదానములతో, యజ్ఞశాల విరాజిల్లెను. భుజించినవారి పరితృప్తివాక్యముల రాజుపరోక్షముగ వినుచుండెను. ఋత్విక్కులకు, నలుదిక్కుల దక్షిణ లొసంగెను. వారును భూమిని మరల రాజున కొసంగి రత్నముల గోగణంబుల గొనిరి అశ్వమేధము సమాప్తియయ్యెను.

పాఠకులారా! ఇంతవరకు పఠించిన కథ యందలి విశేషముల నరయుదము. ఒకటి, అయోధ్యాపురవర్ణనము. ఆవర్ణనమున ఆర్యనాగరికతయు, కళలకుగల ప్రాముఖ్యము, ప్రాచీనుల

రాజ్యపాలనా, ధర్మమును ప్రజల రాజభక్తియు, వర్ణాశ్రమ విభాగము లుండియు ప్రజలయందలి ఐక్యభావమును, ఆనాటి కవులకుగల లౌకికవిజ్ఞానము, మొదలుగాగల విశేషము లెన్నియో తెలుసుకొంటిమి.

రెండు ఋష్యశృంగుని చరిత్రము—

ఋష్యశృంగుని చరిత్రను పఠించినప్పుడు ఋష్యశృంగుడు వేశ్యాంగన లందు కామాతురుడై సంచరింప, ఆతడు అంగదేశమున ప్రవేశింపగనే వర్షములు ఎట్లు కురిసెను? అను సందేహము తోచక మానదు.

ఋష్యశృంగుడు వేశ్యాంగనలయందు, మోహమున కామాతురుడుగా లేదు. ఏలయన విదేశమునుండి వచ్చిన జనులను మనము వింతపడి యెట్లు చూతుమో, యెట్టి మనోవికారము కలవారలమయ్యెదమో, వారి మాటల వినవలెనను నాసక్తి కలవారమెట్లయ్యెదమో, అట్లువిదేశమునుంచివచ్చిన వింతస్త్రీలను, వారి ఆకార విలాసములను, గానమాధుర్యమును, తానెన్నడును వినని వాడగుటచే, సామాన్యముగా విదేశ జనుల చూడవలెనను భ్రాంతిచే వెళ్ళెనేగాని, స్త్రీలంపటుడై వెళ్ళియుండలేదు. స్త్రీలంపటుడై యీ మహాత్ముడు వెళ్ళి యుండలేదు అనుటకు "వర్షేణై వాగతం విప్రం" ఈతనితోడనే వర్షముగూడ ప్రవేశించెను. అని తెలియబడుటచే యీతనియందలి మాహాత్మ్యము వేశ్యాంగనలచే చెరుపబడలేదని తెలియుచున్నది.

ఇంతియేగాక యీతని చరితమందు స్త్రీల నెన్నడు చూచిన వాడు కాడని వారి యాకారములను యెరుగడని యున్నది.

వేదశాస్త్రముల పఠించిన ఋష్యశృంగునకు స్త్రీల విషయముగాని, ఆకారవిషయమైగాని, యెట్లు తెలియకుండును ?

అన, తానెన్నఁడు కని విని యెరుగని వస్తువునందు మనము యే ప్రకారము వికారమునొందదో అట్లే యీ మహాత్ముడు బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడై స్త్రీల విషయమున మనస్సు నట్లుంచెను. బ్రహ్మచర్యమునం దిట్లె ఉండవలయును. ఇట్టి స్థితి ఋష్యశృంగునకు సంప్రాప్తమయ్యెను. కావుననే "వర్షేణై వాగతం విప్రం" వర్షముతోగూడ ఋష్యశృంగుడు అంగదేశమున ప్రవేశింప గలిగెను.

## 4 పుత్రకామేష్టి

అశ్వమేధము ముగిసెను. దశరథుడు పుత్రార్థియై ఋష్యశృంగుని వేడెను. కరుణాహృదయుడగు ఆ ఋష్యశృంగ మహాముని అథర్వణవేద ప్రయుక్తములగు మంత్రముల చేత పుత్రకామేష్టి చేయదొడగెను. అందు బ్రహ్మాది దేవతలు స్వస్వరూపముల తమ తమ భాగముల గ్రహించిరి. జగత్పతియగు విష్ణువు శంఖ చక్ర గదా పాణియై పీతాంబరముల ధరించి మహాద్యుతితో యజ్ఞవాటికయందు ప్రత్యక్షమాయెను. * దేవాదు

* ఒక్కొక్క మంత్రమునకు ఒక్కొక్క అధిష్ఠాన దేవత కలదనియు మంత్రములను చక్కగా మననము చేసినపుడు ఆ దేవతలు దివ్యశరీరములతో

లాతని అనేక విధముల సన్నుతులొనర్చి తమ కష్టముల నిట్లు విన్నవింపజొచ్చిరి. దేవా! లోక భీకరుడగు రావణుని భీతిచే తాళ జాలకున్నాము. వాయువు రావణు సమీపమున సంచరించుటకు భయపడు చున్నాడు లోకబాంధవుడు చంద్రునివలె చల్లదనము వహించినాడు. గ్రహములు వాటి ఉచ్ఛస్థితిని వదలి రావణు భీతిచే దాసులై ఎదుట నిలచినవి. గంభీరుడగు సముద్రుడు తరంగములకోల్పోయి కదల మెదలక నిలచి యున్నాడు. ఈ క్రూరుడు మానవులచేతనే వినాశ మొందును. కాన మర్త్యావతారమున లోక కంటకుడగు రావణు వధించి లోక కల్యాణము గూర్పుము. అని బ్రహ్మాది దేవతలు విష్ణుదేవుని కర్తవ్యమును గూర్చి ప్రేరేపించిరి.

శ్లో॥ త్వాం నియోక్ష్యామహే విష్ణో లోకానాంహితకామ్యయా
రాజ్ఞో దశరథస్యత్వ మయోధ్యాధి పతేః ప్రభోః
తస్యభార్యాసు తిసృషు హ్రీ శ్రీ కీర్త్యుపమాసుచ
విష్ణో పుత్రత్వ మాగ త్య కృత్వాత్మానం చతుర్విధం,
తత్రత్వం మానుషో భూత్వా ప్రవృద్ధం లోక కంటకం,
అవధ్యం దైవతై ర్విష్ణో సమరె జహిరావణం.

తా॥ ఓప్రభో! లోకముల క్షేమముకొఱకు మిమ్ముల మేము కోరుచున్నాము. మా ప్రార్థనల నంగీకరింపుడు. అయోధ్యాధి పతికి దక్షురాండ్రగు కౌసల్య సుమిత్ర కైకేయి అను ముగ్గురు

---

సాక్షాత్కరింతురనియు, ప్రీతి రాగము ఆలాపన చేయబడినపుడు ఆ రాగ మొక రూపమున ఎదుట నిలబడుననియు పాశ్చాత్య ప్రకృతి శాస్త్రవేత్తలు కూడా అంగీకరించిన విషయమే. దాస్యాంధకారమున మునుగుటచే మన విషయమే మనము మరచి యున్నాము,

భార్యల యందు నీ తేజస్సును, చతుర్విధముగ ప్రవేశపెట్టుము. అట్టి మానుష రూపములతో లోక కంటకుడును, దేవాదుల కజేయుడును అగు రావణుని యుద్ధమందు వధింపుము. అనుడు లాలకించి కరుణాసముద్రుడగు నావిష్ణుమూర్తి లోకహితమును గోరినవాడై శరణాగతులగు దేవతలకు అభయహస్తమిచ్చెను.

శ్లో॥ భయం త్యజత భద్రంవో హితార్థం యుధిరావణం
స పుత్ర పౌత్రం సా మాత్యం సమిత్ర జ్ఞాతి బాంధవం.
హత్వాక్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహం
దశవర్ష సహస్రాణి దశవర్షశతానిచ
వత్స్యా మి మానుషే లోకేపాలయన్ పృథివీమిమామ్

తా॥ దేవతలారా! భయమును వీడుడు. మీమేలు కొరకు యుద్ధమందు క్రూరుడును, దేవర్షులకు భయమును గలుగజేయు రావణుని సపుత్రపౌత్ర మంత్రి మిత్ర జ్ఞాతి బాంధవ సహితముగ వధించి పదకొండు వేల సంవత్సరములు మనుష్య రూపముతో భూమియందు రాజ్యమేలెదను, దేవతలు విష్ణుని అభయమునకు చాల సంతసించిరి. విష్ణురాకకై నిరీక్షింప జొచ్చిరి. పిమ్మట విష్ణుమూర్తియు.

శ్లో॥ తతః పద్మపలాశాక్షః * కృత్వాత్మానం చతుర్విధం
పితరం రోచయామాస తదా దశరథం నృపం.

* "కృత్వాత్మానం చతుర్విధం" అన్నచోట మహేశ్వర తీర్థుడు. "సోపకరణం ఆత్మానం" అని వ్రాసిరి. అనగా శంఖచక్రాది సాధనములతో అవతరింతునని అభిప్రాయము. ఈ అభిప్రాయమె పద్మపురాణమందు కలదు, శ్లో॥ అన్యేద్యుఃసా

తా॥ తన తేజస్సును నాలుగు భాగములుగ జేసి దశరథుని పుత్రులగుటకు జన్మభూమిని నిశ్చయించుకొనెను.

పిమ్మట మహావిష్ణువు బ్రహ్మాదులను తనకు సహాయార్థము భూమియం దవతరించుట కాజ్ఞాపించెను. అందు బ్రహ్మయంశమున జాంబవంతుడు, సూర్యునియంశమున సుగ్రీవుడును, ఇంద్రుని యంశమున వాలియు, వాయునంశమున ఆంజనేయుడును. భూమియం దవతరించిరి. ఇట్లే తక్కుంగల దేవతలందరు తమతమ తేజస్సులను భూమియం దవతరింపజేసిరి. వీరి పూర్వజన్మ చరిత్రలు ఉత్తరకాండయం దరయుదము.

అంతనా దశరథుడు యజ్ఞశాలయందు అగ్నిహోత్రునకభిముఖుడై ఋత్విక్కగు ఋష్యశృంగునితోగూడ హోమము వేల్చుచుండ అగ్నిహోత్రమునుండి రక్తవస్త్రమును దాల్చి అగ్నిహోత్రునివంటి తేజస్సుతో శుభలక్షణములుగలిగి దివ్యాభరణభూషితుడై ముఖపద్మమున చిఱునవ్వొలక బంగారమువంటి తనుకాంతితో మహాద్భుత వీర్యసంపన్నుడగు నా యజ్ఞపురుషుడు సూర్యప్రభతోడ అగ్నిశిఖలవలె ప్రకాశించుచు పత్నివలె ప్రియమైన దివ్యపాయస సంపూర్ణమగు పాత్రను విపులమగు హస్తపుటమునం దిడుకొని ప్రజ్వలించుచున్న వేది మధ్యమునుండి వెలువడెను. అంత నా ప్రాజాపత్య పురుషుడు గంభీరమగు స్వరమున దశరథ మహారాజుతో నిట్లనెను.

---

జన్యాత్మా కైకేయ్యాంభరతో భవత్. తదన్యేద్యుస్సుమిత్రాయా మనంతాత్మాచ లక్ష్మణః. సుదర్శనాత్మాశత్రుఘ్నో ద్వౌజాతౌ యుగపత్ప్రియే. భరతుడు పాంచజన్యము. లక్ష్మణుడు శేషుడు. శత్రుఘ్నుడు సుదర్శనము. "ఆత్మానం" అని మూలమున వాడుటచే తన ఉపకరణములు కూడా తనస్వరూపమేనని భావము.

ఓ రాజా! నేను యజ్ఞపురుషుడను. ఇది దేవనిర్మిత మగు పాయసము. దీని పుత్రాభివృద్ధియు నారోగ్యమును గలుగును. దీనిని అనురూపులగు నీ ముగ్గురు భార్యలకు నిమ్ము. వారు సంతానమును బడయగలరు. అని అదృశ్యుడాయెను. రాజావాక్యములు విని పెన్నిధిగన్న పేదచందమున హర్షపులకితగాత్రుడై పాయసమును గ్రహించి తన సంతోషకిరణములు భవనమున దారిచూప అంతఃపురమును ప్రవేశించి పత్నుల కీవిధమున పాయసము విభాగించి యిచ్చెను.

*శ్లో॥ కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా
అర్ధాదర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమం.

తా॥ దశరథుడు పాయసములో సగభాగము కౌసల్యకిచ్చెను. మిగిలిన సగభాగములో సగము సుమిత్ర కిచ్చెను. మిగిలిన అర్ధభాగములో సగము కైకేయికిచ్చి మరల విచారించి మిగిలిన ఎనిమిదవ భాగమును సుమిత్ర కిచ్చెను. అనగా ఒక చక్కెర ముక్క కలదను కొందము. అది యెనిమిది కణువులు

* దశరథుడు పాయసమును గైకొని భార్యలందరిలో కౌసల్య పట్టమహిషి కావున ఆమెకు సగభాగమిచ్చెను. రెండవ భార్య సుమిత్ర, మూడవ భార్య కైక కావున క్రమముగా భార్యల గౌరవములను గ్రహించి సుమిత్రకు తిరిగి పాయసము నిచ్చెను. దీనిచే రాజునకు భార్యలయందు సమానమగు ప్రేమకలదని సూచితమగుచున్నది. ఒకవేళ రాజునకు చిన్నభార్యయందు ప్రేమయున్నను అది కేవలము భోగవిషయమందే కాని, ధర్మవిషయమందు కాదు. కాని యిచ్చట పాఠకులకు ఒక సందేహముతోచును. కథనుబట్టి చూడ రామలక్ష్మణభరతశత్రుఘ్నులలో భరతుడు రాముని తరువాతవాడని తెలియుచున్నది. పాయసవిభాగమునుబట్టి చూడ కౌస

గలది. అందు నాలుగు కణుపులు పెద్దభార్య యగు కౌసల్యకిచ్చెను. మిగిలిన నాలుగు కణుపులలో రెండు కణుపులు రెండవ భార్యయగు సుమిత్రకిచ్చెను. మిగిలిన రెండు కణుపులలో ఒక కణుపు మూడవ భార్యయగు కైకకిచ్చెను. అందొక భాగము మిగిలి యున్నది. దీనిని తిరిగి విచారించి సుమిత్ర

---

ల్యకు అర్ధభాగము, సుమిత్రకు నాల్గవభాగము, కైకేయికి యెనిమిదవ భాగము వచ్చినట్లు తేలుచున్నది. నాల్గవ భాగమువలన జన్మించిన లక్ష్మణుడు భరతునికంటె పెద్దవాడై యుండవలెను. చిన్నవాడగుటకు వీలులేదుకదా ?

భరతలక్ష్మణుల జ్యేష్ఠకనిష్ఠత్వములు, పాయసభాగములను బట్టి నిర్ణయించరాదు.

సుమిత్రయొక్క పాయసభాగము పెద్దదైనను కైకేయి భాగము చిన్నదైనను రాజు పత్నుల కిచ్చుటలో సుమిత్రకే ముందైయున్నను భాగముల పట్టియే నిర్ణయింపక వా రా పాయసమును పుచ్చుకొనినకాలమునుబట్టియు, జననకాలమును బట్టియు, మనము నిర్ణయింపవలెను. కాన, పాయసమును వారు పుచ్చుకొన్న సమయమును విచారింతము. మొదట దశరథుడు కౌసల్యకివ్వగా నామె పుచ్చుకొనెను. అందు జ్యేష్ఠుడగు రాముడు జన్మించెను. మిగిలినదానిలో సగభాగము సుమిత్రకీయగా కైకకంటె ఈమె అధికపాయసమును గ్రహించుట కధికారము గలదగుటచే ఆమె పుచ్చుకొన లేదు. అందుచే రాజీయభిప్రాయమును గ్రహించి కైకకివ్వగా మిగిలిన యెనిమిదవ భాగమును సుమిత్రకు తిరిగి యిచ్చెను. కైకేయి తన భాగము తనకు వచ్చెగదాయని పాయసమును వెంటనే పుచ్చుకొనెను, సుమిత్ర న్యాయముగా తనకు రావలసిన భాగము తనకు వచ్చిన అనంతరము సంతసించి రెండు భాగములను వేరు వేరుగ పుచ్చుకొనెను. యీకారణముచే భరతుడు రెండవవాడుగను లక్ష్మణుడు తరువాతి వాడుగను తెలుసుకొనవలసి యున్నది. జననకాలమును బట్టిచూడగా, రాముని నక్షత్రము పునర్వసుకాగా భరతుని నక్షత్రము పుష్యమి, లక్ష్మణ శత్రుఘ్నుల నక్షత్రము ఆశ్రేష అయియున్నది, ఇక ఇతర గ్రంథములయందు పాయస విభాగమును గూర్చి మరొక విధమున చెప్పబడి యున్నది. అదెట్లన రాజు పాయసమును సమభాగములుగ కౌసల్యాకైకేయీలకు పంచియిచ్చినట్లును, వారిద్దరు తమభాగముల చెరిసగము సుమిత్ర కిచ్చినట్లును కలదు. ఇట్లైనచో ప్రాజాపత్యపురుషుని ‘‘రాజా నీ అనురూపులగు ముగ్గురు భార్యలకు నీ పాయసము నిమ్ము" అను వాక్యము వ్యర్థమగును.’’

కిచ్చెను. యజ్ఞదీక్ష పూర్తియాయెను. దశరథ మహారాజు ఋత్విగ్బ్రాహ్మణ పురోహితులతోగూడ అయోధ్యకు జేరెను. ఋష్యశృంగుడు మొదలగువారలను సత్కార పురస్సరముగ వీడ్కొల్పెను. ఇట కౌసల్య సుమిత్ర కైకేయిాలు గర్భముల ధరించిరి. శుక్లపక్ష చంద్రునివలె గర్భములు దిన దిన ప్రవర్ధమానములగుచుండెను. గర్భస్థుడగు పరమాత్మను పంచభూతములిట్లు సేవించెను.

సీ॥ సలిల మా యెలనాగజఠరార్భకుని గాన
జనినకై వడి ఘర్మసలిల మొప్పె
నాగితేజ మాయింతి యుదరడింభకుగొల్వ
గదిసిన క్రియ దేహకాంతి మెరసె
పవనుడా కొమ్మ గర్భస్థుని సేవింప నొలసె
నా మిక్కిలి యూర్పు లమరె
గుంభిని యాలేమ కుక్షిగు నర్చింప జొచ్చు
భంగిని మంటిచౌరవ దనరె.

ఆ॥ గగనమిందువదన కడుపులో బాలుసే
వలకు రూపుమెరసి వచ్చినట్లు
బయలువంటి నడుము బహుళమయ్యె పంచ
భూతమయుడు లోన బొదల సతికి.

భాగవ. ద. 73 పద్యం.

ధీమంతులారా! పుత్రకామేష్టియనెడి యజ్ఞకర్మను గూర్చి కొంత తెలిసికొనవలసియున్నది.

భగవంతుని దర్శించుటకు ధర్మము ప్రధానము. ఇట్టి ధర్మము యజ్ఞములద్వారా లభించును. ఇట్టి యజ్ఞములు భగవానుని గీతానుసారముగా బహువిధములుగా నున్నవి. ఇందు ప్రధానమైనవి క్రింద లిఖించుచున్నాను.

శ్లో॥ "ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశిత వ్రతాః."

శ్లో॥ "దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే"

1. ద్రవ్య యజ్ఞము
2. తపోయజ్ఞము
3. యోగయజ్ఞము
4. స్వాధ్యాయ యజ్ఞము
5. జ్ఞానయజ్ఞము
6. దైవయజ్ఞము

మొదటిది ద్రవ్యయజ్ఞము. అనగా మంచిచెడ్డలు విమర్శించి, పాత్రాపాత్రములగు రెరిగి ద్రవ్యమును వినియోగించుట. గొప్పగొప్ప సంస్థల స్థాపించుట, సత్రముల గట్టించుట, చెరువుల త్రవ్వించుట, దేవాలయముల నిర్మించుట, బీదసాదల పోషించుట, తన దేశోద్ధారణకై ద్రవ్యమును వినియోగించుట, విజ్ఞానమునకై సారస్వతగ్రంథముల ముద్రింపించుట మొదలుగా గలవన్నియు ద్రవ్యయజ్ఞములోనివే

2వది తపోయజ్ఞము. తపస్సుచేత భగవంతుని నారాధించుట. తపస్సు నెన్నివిధములుగా వేదమాత ఉపదేశించి యున్నదో చూతము:—

శ్లో॥ "ఋతంతపస్సత్యం తపశ్శ్రుతం తపశ్శాన్తం తపోదమ స్త
పశ్శమ స్తపో దానం తపోయజ్ఞంతపో భూర్భువస్సువర్బ్రహ్మైతదుపాస్యైత త్తపః"

ఋతము తపస్సు. ఋతమనగా మనస్సుచేత యథార్థచింతనము. సత్యము తపస్సు. సత్యమనగా వాక్కుచేత యథార్థము పలుకుట.

ఆ॥ వేయుంగ నశ్వమేధంబులు వేయును
నొక్కసత్యమును నిరుగడలం,
దులనిడి తూంపగ సత్యమువలనన
ములు నూపు గౌరవంబున వేర్మికా.

తే. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద సమ
ధిగమము సత్యంబుతో సరియు గావు
మెరుగు మెల్లధర్మంబుల కెందు బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు.

భార. ఆది.

శ్రుతము తపము, శ్రుతమనగా వేదవిషయక సంశయము తొలగించెడి పూర్వోత్తరమీమాంసాశాస్త్రాధ్యయనము. ఎల్లప్పుడుభాగవతాది భక్తిగ్రంథముల పఠించుటయును అధ్యయనమే.

శాంతము తపస్సు. శాంతమనగా, బాహ్యేంద్రియముల నిగ్రహము, ఇంద్రియ నిగ్రహమనగా, ఇంద్రియార్థములగు శబ్దస్పర్శరూపరసగంధాదుల మితిమీరి వ్యసనముగా ననుభవింపక, ధర్మబద్ధముగ ననుభవించుట. దమము తపస్సు. దమమనగా శాస్త్రీయములగు ఉపవాసాది నియమములచేత

దేహమును కృశింపజేయుట. దీనివలన చక్కని ఆరోగ్యముకుదిరి ధ్యానము కుదురును. శమము తపస్సు. శమమన శత్రువునందైనను క్రోధములేకయుండుట. దానముతపస్సు. యోగ్యమగు వారికి సాత్వికత్యాగముచేయుట. యజ్ఞము తపస్సు. భూర్భువస్సువరాత్మక విరాడ్రూపధారి యగు బ్రహ్మోపాసన తపస్సు. ఈ తపస్సులన్నియు యజ్ఞములే. ఈ యజ్ఞములనే ప్రస్తుత విషయమునతపోయజ్ఞమని వాడియున్నారు.

మూడు యోగయజ్ఞము. ప్రాణాయామ మొనర్చి వాయువును నిరోధించుట మొదలగు సాధనములు.

నాలుగు స్వాధ్యాయయజ్ఞము. వేదము నభ్యసించుట, రామాయణము భారత భాగవతములు గీత మొదలగునవి నిత్యమును పఠించుట. ఇందుచే పై గ్రంథములలోని విషయము బోధమైనను కాకపోయినను నిత్యము పారాయణ చేయుటచే అధిష్ఠాన దేవతపై దృష్టినిల్పి ఉత్తమస్థితిని పొందుదురు.

జ్ఞానయజ్ఞము. తాను శాస్త్రానుభవముల తెలుసుకొన్న విజ్ఞానమును పరుల కుపదేశించుట.

దైవయజ్ఞము. "దైవమేవ దేవా ఇజ్యంతే యేన యజ్ఞేనాసౌ దైవో యజ్ఞః యోగినః కర్మిణః పర్యుపాసతే కుర్వంతీత్యర్థః" (శం. భా) ఏయజ్ఞము దేవతలఁగూర్చి చేయబడుచున్నదో అది దైవయజ్ఞము. యోగులు అనగా కర్మయోగులు దీనిని ఆచరింతురు. పై పేర్కొన బడిన ఉత్కృష్టమగు యజ్ఞములలో ఒకటగు యీ దైవయజ్ఞమును దశరథుడు కామ్యబుద్ధిచే ఆచరించి పుత్రుల బడసెను.

## శ్రీరామజననము

అహో ! ఏమి భారత భాగ్యోదయము. ధర్మోద్ధరణకై మాటిమాటికి భగవానుడవతరించుచు తన పాదధూళిచే భారత దేశమును పవిత్రము చేయుచున్నాడు. జ్ఞానశూన్యులై అజ్ఞానాంధకారమున మునిగి దాస్యజీవులై బాధపడు భారతీయులకు ధైర్యము పురిగొల్పి స్వైరవిహారధీరుల జేయుశక్తి పరాత్పరునకు గాక మరెవ్వరికి గలదు? దేశమును ఆధ్యాత్మికముగాగాని, రాజకీయముగాగాని, పుణ్యోదయముగాగాని చేయు నధికారము ఆ పరాత్పరునకు తక్క మరెవ్వరికి గలదు? ఆ దేవ దేవుని కటాక్షవీక్షణములకు లోనుగాక జీవించువాడెవడు ? ఆ మహాత్ముని దివ్యలీలలు కడువిచిత్ర విచిత్రములు గదా! పుట్టుకలేని పరమాత్మ తాను పుట్టుక యనునది కల్పించుకొని లోక క్షేమమునకై లోకముతోపాటు కలసి మెలసి తిరుగుటకంటె వేరొకటి గలదా ? అట్టి దివ్య పురుషావతారములచేతనే గదా మన భరతమాత ఉత్తమ సాధ్వియై, వీరమాతయై విరాజిల్లెను. ఇట్టి పరమ సాధ్వియగు భరతమాత మన శ్రీరామచంద్రుని గనుట కెట్టి సుకృతముసలిపి యున్నదో! రాముని దివ్యలీలల గన భారతీయు లెంత సుకృత మొనర్చిరో గదా !

శ్లో॥ తతశ్చ ద్వాదశే మాసే చైత్రేనావమికే తిథౌ,
నక్షత్రే ఒదితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు,
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతావిందునా సహా
ప్రోచ్యమానే జగన్నాథం, సర్వలోకనమస్కృతం,

కౌసల్యా౽జనయద్రామం సర్వలక్షణసంయుతం
విష్ణోరర్ధం మహాభాగం పుత్రమైక్ష్వాకువర్ధనం,
కౌసల్యా శుశుభే తేన పుత్రేణామితతేజసా
యథా వరేణ దేవానామదితిర్వజ్రపాణినా

పన్నెండు మాసములు గడువగా, చైత్రశుద్ధ నవమీ పునర్వసు నక్షత్రమైన కర్కాటక లగ్నమందు, చంద్రునిగూడి బృహస్పతియు, మేషమున సూర్యుడును, తులరాశి యందు శనియు, మకరమందు కుజుడును, మీనమందు శుక్రుడును, యీ యైదు గ్రహము లుచ్చస్థితియందుండగా, సర్వలోకారాధ్యుడగు జగన్నాథుడు సర్వలక్షణ సంపన్నుడై విష్ణువు యొక్క అర్ధభాగమును వహించి. ఉజ్వల తేజఃప్రభావముతో కౌసల్యా గర్భమునం దుద్భవించెను.

## శ్రీరామచంద్రమూర్తి జాతకచక్రము

అశ్వనీ 3 చరణే మేషరాశౌ ఉచ్ఛక్షేత్రే రవిః
పునర్వసు ౪ చరణే కర్కటరాశౌ ఉచ్ఛగురు సంయుతే
స్వక్షేత్రే చంద్రః
శ్రవణ 3 చరణే మకరరాశౌ ఉచ్ఛక్షేత్రే కుజః.
ఉత్తరాభాద్ర 3 చరణే మీనరాశౌ ఉచ్ఛభృగు సంయుతే
నీచక్షేత్రేబుధః.
పుష్య ప్రథమచరణే కర్కాటకరాశౌ స్వక్షేత్ర చంద్ర
యుతే ఉచ్ఛక్షేత్రే గురుః.

రేవతీ ౪ చరణే మీనరాశౌ నీచస్థ బుధ సంయుతే ఉచ్ఛక్షేత్రే శుక్రః.
స్వాతి ౪ చరణే తులారాశౌ ఉచ్ఛక్షేత్రే శనిః.
పూర్వఫల్గునీ ౪ చరణే సింహరాశౌ రాహుః,
పూర్వాభాద్రా ౨ చరణే కుంభరాశౌ కేతుః.

| | | | |
|---|---|---|---|
| శబు | | | |
| కే | | | ల చగు |
| కు | రాశిచక్రము | | రా |
| | | శ | |

| | | | |
|---|---|---|---|
| కుశ | | కే | రబు |
| | అంశ చక్రము | | చ |
| | | | గు |
| | రా | కు | ల |

శ్రీరామచంద్ర జననకాలము, పునర్వసు ౪ చరణము.
గురుమహాదశాకాలః జన్మగర్భ భుక్తి వర్షాః ౧౨.
ఏష్యవర్షాః ౪. అనంతరం శని మహాదశాకాలః.

శ్లో॥ ప్రోచ్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతం,
కౌసల్యా జనయద్రామం సర్వలక్షణ సంయుతం.

శ్లో॥ భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః,
సాక్షాద్విష్ణోశ్చతుర్భాగ స్సర్వస్సముదితో గుణైః
అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాజనయత్సుతౌ
వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణోరర్థసమన్వితౌ.

పుష్యే జాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః
సార్పే జాతౌ తు సౌమిత్రీ కుళీరేభ్యుదితే రవౌ.
రాజ్ఞః పుత్రో మహాత్మానశ్చత్వారో జజ్ఞిరే పృథక్.

సత్యసంధుడగు భరతుని కైకేయి గనెను. పుష్యమి నక్షత్రమీనలగ్నమందు భరతు డుద్భవించెను. ఆశ్లేష నక్షత్ర కర్కట లగ్నమందు లక్ష్మణ శత్రుఘ్ను లుద్భవించిరి.

దేవలోకమున దేవదుందుభులు మ్రోగెను. పుష్పవృష్టి గురిసెను. గంధర్వులు గానము జేసిరి. అచ్చరలు నాట్య మాడిరి. అయోధ్యాంబుధి ఆనందతరంగముల నోలలాడెను. రాజవీధుల నటనర్తకులు నాట్యమాడిరి. గాయకులు పాడిరి. వందిమాగధులు స్తోత్రము జేసిరి. దశరథుడానందాంబుధి దేలి యాడెను. ఇట్టి మహాపురుషు లుద్భవించి నప్పుడు ముల్లోక వాసులు సంతసించుట మన ఆర్యావర్తమున నూతనవిష యము గాదు. దశరథుడు వశిష్ఠాది బ్రాహ్మణోత్తములకు బీదసాదలకు వేలకొలది గోగణంబులను పర్వతోపములగు ధన రాసులను పంచియిచ్చెను. ఆవల పదిదినములు గడచెను. పదునొకొండవ దినమందు రాజు శాస్త్రీయముగా వశిష్ఠునిచే జాతకర్మ నామకర్మల నెడి సంస్కారముల గావించెను. భగ వానుడగు వశిష్ఠుడు కౌసల్యాపుత్రునకు * రాముడను నామ మిడెను. మరియు కైకేయీ పుత్రునకు భరతుడనియు సుమిత్రా సుతులకు లక్ష్మణ శత్రుఘ్నులనియు నామమిడెను.

---

* రామశబ్దవ్యుత్పత్తి - రామశబ్దమునకు వ్యుత్పత్తులు అనేక విధములుగా ఆయామతస్థులు తమతమ బుద్ధివైభవముచే నిర్ణయించియున్నారు. రామశబ్దము తత్త్వమసి అను మహావాక్యార్థమును సూచించుచున్నదని అద్వైతులును, సగుణము

ఆర్యులారా !

శ్రీరామావతారమును గూర్చియు, సంస్కారముల గూర్చియు విచారింతము.

రాము డన పరాత్పరమగు పరబ్రహ్మ స్వరూపము. ఆతడు స్వమాయచే నీ ప్రపంచమును సృజించి అందు జీవుల

---

అర్థమని - విశిష్టాద్వైతులును నిరూపించియున్నారు. అది కేవలము బుద్ధివైభవము. రామశబ్దమును, మార్చుటచే మారశబ్దమగును. అట్లే మారశబ్దమును మార్చిన రామశబ్దమగును. మారుని మార్చె రాముడు(మారుడన మనస్సులో పుట్టి మనస్సును మధించు కోరిక.) అట్టి కామమును స్వేచ్ఛగా ప్రవర్తింపనీక శాస్త్రీయముగా నియమించుటయే ధర్మము. ఈ ధర్మమునే వశిష్ఠాది మహర్షులు రామశబ్దముచే వ్యక్తీకరించిరి.

వాల్మీకియు "రామోవిగ్రహవాన్ ధర్మః" అని వ్రాసియున్నాడు. కావున కామము నియతవిషయమగుట ధర్మమనియు, ఆధర్మమే శ్రీరాముడనియు మనము గ్రహింపవచ్చును.

మరియు రామతాపన్యుపనిషత్తు రామశబ్దము నిట్లు నిర్వచించి యున్నది.

"రమంతేయోగినోఽనంతేనిత్యానందే చిదాత్మని
ఇతిరామపదేనాసౌ పరం బ్రహ్మాభిధీయతే॥

తా॥ నిత్యానందుడును స్వప్రకాశుడును అగు యీతనియందు యోగులు ఆనందింతురు. గాన, రామః అని నిర్వచించెను.

రామతాపన్యుపనిషత్తు.
౧ ఖండము.

"భావికాలరాజ్య భరణాత్, భరతః" రాము డరణ్యము కేగుతరి దశరధుడు మృతినొంద తాను రాజ్యభారమును వహింపవలసియున్నది. గాన కైకేయీ పుత్రునకు భరతుడను నామమనియు, "రామకైంకర్య లక్షణసంపద్యుక్తత్వా ల్లక్ష్మణః, రామసేవార్హములగు చిహ్నము లీతనియందుండుటచే లక్ష్మణుడను నామమును, శత్రూన్ఘ్నంతీతి శత్రుఘ్నః లవణాసురుడు మొదలగు శత్రువులను చంపుటకు యోగ్యమగు శరీరము కలవాడగుటచే యీతనికి శత్రుఘ్నుడు అనిపేరు. అంతేగాక అంతశ్శత్రువులగు, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులగూడ జయించువాడని యీనామము ధ్వనించుచున్నది.

యొక్క * యోగక్షేమములను విచారించి యెవరెట్టి మార్గ
ముల నవలంబించిన అశుభములు తొలగి శుభములు చేకూ
రునో అట్టి మార్గములను నిర్ణయించి యోగ్యులగు ఆధికారిక
పురుషులద్వారా ఆ మార్గములను లోకమునందు విస్తరింప
చేసెను. ఈ మార్గములే ధర్మములనియు ఇందుకు విరుద్ధము
లధర్మములనియు చెప్పబడుచుండును. యీ మార్గములకు
యే కాలమునందు మార్పుకలుగునో (అనగా ధర్మములు క్షీణిం
చుట అధర్మములు ప్రబలుట) అప్పుడు పరమేశ్వరుడు తన సం
కల్ప మాత్రముచే సమయానుకూలమగు శరీరమును ధరించి
(అనగా లోకమం దవతరించి) ఆ ధర్మములతా ననుష్ఠించియు
యోగ్యులగు వారల కుపదేశించియు అనుష్ఠింప జేసియు—

అప్పుడప్పుడు ధర్మవ్యవస్థాపన జేయుచుండును.

ఇందుకు క్రింది శ్లోకములు ప్రమాణము.

శ్లో॥ యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥

తా॥ ఎప్పుడు ధర్మహాని కలుగునో అప్పుడు నే నవత
రింతును

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

తా॥ సాధువుల రక్షించుటకు దుష్టులను శిక్షించుటకు
ధర్మసంస్థాపనకు ప్రతియుగమందు నే నవతరింతును.

---

* యోగము - అనగా లేనిదాని సంపాదించుట. క్షేమము - ఉన్నదానిని సంరక్షించుట.

కాని సర్వసముడును కరుణాసముద్రుడు నగు భగవంతునికి ధార్మికుల రక్షించుట అధార్మికుల శిక్షించుట తగునా? తన సర్వసమత్వమునకు భంగము రాదా? సమభావము లేక భగవంతు డెట్లగును?

అను ప్రశ్నలు పాఠకులను కలత పెట్టవచ్చును. ఒకనికి యిరువురు పుత్రులు కలరనుకొండు. అందొకనికి జ్వరబాధ. రెండవవానికి ఆకలియు నుండును. అట్టి స్థితిలో తండ్రి మొదటి వానికి ఆహార మివ్వక బాధకరమైనను కటు తిక్తకషాయాదుల నిచ్చి లంఘనముకూడ చేయించును. రెండవాని కాహారము నిచ్చును. మధురాహారముగూడ నిచ్చునుగదా! ఇయ్యది ఉభయుల యందలి ప్రేమ యనదగునుగాని పక్షపాత మనదగునా? అట్లే దుర్మార్గులను ఔషధప్రాయమగు శిక్షణచేతను సాధువులను మధురాహార ప్రాయమగు రక్షణచేతను పరిశుద్ధుల నొనర్చి అందరికిని సుఖరూపమగు మోక్షమునే ప్రసాదించును. కాని ప్రస్తుత రామావతారమందును అధర్మరూపులగు రావణాదుల శిక్షించి; ధర్మరూపులగు విభీషణాదుల రక్షించి అంతమున అందరికి మోక్షమిచ్చి యున్నాడు. మరియు అధర్మస్వరూపుడగు రావణుని ధర్మస్వరూపుడగు రాము డెదుర్కొనెను. ధర్మాధర్మములకు యుద్ధము సంభవించెను. ధర్మములు విజయపీఠిక నలంకరించెను. ఒక్కొక్క అవతారమునకు ముఖ్యకారణమొక్కటియైనను అనేక ప్రయోజనము లుండును. ఒక్కొక్కచో అవతారపురుషుడు గురువై లోకప్రబోధ గరపును. అది శ్రీకృష్ణావతారము. ఈ అవతారమున కృష్ణపరమాత్మ

అర్జునుని నిమిత్తముగానుంచి; గీతామృతమును లోకమునకు పంచి యిచ్చెను. ఒక్కొక్క అవతారము సకల సంపన్నిధితో ఒప్పి కర్మాచరణను వెదజల్లును. ఇది ప్రస్తుత రామావతారము ననుసరించును.

ఇది వంటరిగా నుండు సన్యాసులకు యోగులకు అంతగా దృష్టాంతముగాదు గాని, గృహస్థులై తరింపదలచు వారలకు మాత్రము కల్పవృక్షమైయున్నది. ఇట్టి రామావతారము ననుసరించుటచే మనతల్లులు పిల్లలు బంధువులు పత్నులు స్నేహితులు మొదలగు వారందరు మంచిమార్గములో దరించుట కవకాశము కలదు. రామచంద్రుడు అవతారమూర్తియయ్యెను; బాహు బలపరాక్రమమందారితేరి సాంఘిక రాజకీయ గృహవిషయములందు మెప్పులబడసి విరాజిల్లెను.

దాంపత్యప్రేమయందును; పౌరజానపదులందును సుహృదు లందును సామంతరాజుల యందుకూడ ఐకమత్యముతో ప్రకాశించెను. భారతదేశమందవతరించి వన్నెకాంచిన రాజవీరులలో రామునిమించిన కర్మయోగిగాని పితృవాక్య పరిపాలనాధురంధరుడు గాని లౌకిక ప్రజ్ఞానిపుణుడు గాని రాముని మీరజాలడు. ప్రపంచమునందే అవతారము రామావతారముతో సరి కాజాలదని సూచించిన అవతారము శ్రీ రామావతారమే.

శ్రీ చిదానంద స్వరూపంబును అఖండమును అగు బ్రహ్మమును బడయుటకు పరిశుద్ధజ్ఞాన మవసరము. ఇది సం

స్కారములచే గాని లభింపదు, శ్రీ భగవద్గీతా శాస్త్ర ప్రకారము, "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" అనునట్లు లోకమునందలి ప్రాణుల జ్ఞానమంతయు అజ్ఞానముచే నావరింపబడియున్నది. ఇందుచే జీవులు సంసారాంబుధియందు మునిగి తేలుచున్నారు. అనేక జన్మలయందార్జించిన పాపఫలములన్నియు వాసనారూపముగ జీవులను చుట్టియున్నవి. యీ మలినవాసనలనుండి విముక్తి పొందుటకు సంస్కారము లావశ్యకములు మురికిగుడ్డను చవిటినీళ్ళలో ముంచి ఉడకబెట్టి యుతికినంగాని మురికిపోనట్లు అనేకజన్మార్జిత పాపవాసనలచే మలినుడగు జీవుడు సంస్కారములచేగాని మాలిన్య రహితుడుకాజాలడు. ఇది ఒక జీవునకేగాదు. లోకములో నే వస్తువునకైనను పరిశుద్ధికావలెనన్నచో సంస్కారముచేయ తగియున్నది. సానబెట్టని మణి రత్నపుగనిలోనున్నను ప్రకాశించునా? తరుగుల్మలతాదులుసైతము తగిన సంస్కారములులేక అభివృద్ధిపొందజాలవు. సున్నము గొట్టనిదే యిల్లు శోభించునా? తీగెలుగాని చెట్లుగాని దోహదము లొనర్పనిచో పుష్పించి ఫలించవు. పొలమునందు చవిటిమట్టినిదీసి మంచి యెరువువేసినంగాని చక్కగ ఫలింపదు. ఇట్లే చరాచర సృష్టిలో యే పదార్థము తిలకించి విమర్శించినను సంస్కారమువలననే అభివృద్ధిజెంది ప్రకాశించుచున్నట్లు తోచకమానదు. అచేతనములే సంస్కారములచే ప్రకాశించుచుండ ఇక చేతన విషయముల చెప్పనేల. సంస్కారము లేశమాత్రమైనను లేక పుట్టిన ...రు పుట్టినట్లు పెరుగు ప్రాకృతులకును విహితసంస్కారములచే

సుగుణములపొంది పరీక్షించువారికినికల భేదము యెల్లరకు స్పష్టముగా తెలిసిన విషయమే. మన మొ బట్టకు రంగు వేయ దలచితిమేని పరిశుద్ధముగనుతికి చలువజేసి రంగువేయుననట్లు జీవునికిగల మలినవాసనలను సంస్కారములచే నిర్మాలమొనర్చి సద్గుణములను పొందవలెను.

సంస్క్రియతే — జ్ఞానయోగ్యతా మాపద్యతే పురుష స్యచిత్తమనేనేతి సంస్కారః అనగా పురుషుని చిత్తము బ్రహ్మ విషయజ్ఞాన ప్రాప్తికై తగినటుల పరిశుద్ధి యొనర్చును. కాన దీనిని సంస్కారమనిరి. ఈ సంస్కారముల వలన చిత్తశుద్ధియను ఫలము సంప్రాప్తమగును. ఈ సంస్కారములను ఆపస్తంబులు 16 విధములుగ విభజించియున్నారు.

1 గర్భాధానము 2 సీమంతము 3 పుంసవనము 4 జాతకర్మ 5 నామకరణము 6 అన్నప్రాశనము 7 చౌలము 8 ఉపనయనము. 9 ఆగ్నేయవ్రతము 10 ప్రాజాపత్యవ్రతము 11 సౌమ్యవ్రతము 12 వైశ్యదేవవ్రతము 13 గోదానవ్రతము 14 స్నాతకము 15 వివాహము 16 పితృమేధము. పైనుదహరింపబడిన ఉపనయనము వరకు గల 8 సంస్కారములు బీజదోష నివారణకును గర్భశుద్ధికొరకును ఏర్పరుపబడినవి. ఈ విషయమునే

శ్లో॥ గార్భై ర్హోమై ర్జాతకర్మ చౌలమౌంజీనిబంధనైః
బైజికం గార్భికం చైనో ద్విజానామపమృజ్యతే.

మను స్మృతి. 2-అధ్యా

అని మనువు నుడివియున్నాడు. ఇంతేగాక జాతకర్మ సంస్కారమునందు శిశుమారకగ్రహబాధలనుండి విముక్తి

చెందుటకు కొన్ని హోమములు గలవు. ఆమంత్రముల కొన్ని క్రింద నుదహరించు చున్నాను.

“అయజ్ఞ్య లిం పతయ న్గ్ శ్వానమి వోద్వ ఋద్ధం. అజాం వాసి తా మివ మరుతః పర్యాధ్వగ్ స్వాహా.”

తా॥ కలియను భూత మొకటి గలదు అది పురిటిపాపలను దినుటకు ఉత్సాహముతో కుక్క వలె పరుగులిడుచు వచ్చెను. అట్టి కలిభూతమును “ఓమరుద్దేవతా నీవుదాని నిచ్చటికి రాకుండ తరిమివేయుము.”

“కేశినీ శ్వలోమినీః ఖజా పోజోపకాశినీః
అపేత * నశ్యతాదిత స్వాహా.”

తా॥ కేశినులను పిశాచములు; కుక్క రోమములవంటి రోమములు గల పిశాచములు; కామరూప ధారిణులగు పిశాచములు; మేకలవలె ప్రకాశించు రూపమును ధరించు పిశాచములు; యీ మొదలుగాగల ఘోరపిశాచములన్నిటిని ఓ మరుద్దేవతా నీవు దూరముగ తొలగింపుము., ఇట్లే జాత కర్మయందు యింకను హోమములు గలవు. ఇవన్నియు శిశు మారక గ్రహనివారణ కొరకు యేర్పరుబడినవే. పై మంత్ర విశేషములబట్టి చూడ మన భారతీయుల అహింసా వ్రతదీక్ష రూఢి యగుచున్నది. అది యెద్దియన, పై పిశాచములు తమ శిశు హత్యకై యేతెంచినను అట్టి క్రూర పిశాచములందు సైతము మన భారతీయులు దైవప్రార్థనలందుకూడా తొలగిపొమ్మని

* నశ్యతాత్ అనుచోట విద్యారణ్యులు “ఇతః ప్రదేశాదప సర్పత” అనిరి.

ప్రార్థించుచున్నారే గాని వినాశమును గోరుటలేదు. ఔరా! ఏమి! భారతీయుల అహింసా వ్రతదీక్ష.

## శైశవము

మ॥ శయువ్రేల్ చేయుతరిన్ విధాతకరణిం జెన్నొందు
సంతోషదృ
ష్టియుతుండై నగుచున్ జనార్దనుని మాటిక్కింబొల్చు
రోషించియు
న్నయెడఁ రుద్రనిభంగి నొప్పును సుఖానందంబునం
బొందిత
న్మయుడై బ్రహ్మము భాతి బాలుడమరుఁ బాహ్య
బాల్యంబునన్.

సీ॥ తలలెత్తి మెల్లన తడవి యాడెడు వేళఁ
బన్నగాధీశుల పగిదిదాల్తు
రంగసమ్మృష్ట పంకాంగరాగంబుల
నేనుఁగుగున్నల యెత్తువత్తు
రసమంబులైన జవాతిరేకమ్ముల
సింగంపుఁ గొదమల సిరివహింతు
రాననంబుల గాంతు లంతంతకెక్కంగ
బాలార్కచంద్రుల పగిదిదోతు,

తే॥ రెలమితల్లుల చన్నుబాలెల్లఁ ద్రావి
పరమ యోగోద్భవామృత పానలీల
పోలియెఱుఁగని యోగుల సొంపుగందు,
రాకుమారులు జనమనోహారులగుచు (భా. స్కం. 10.)

కం॥ కాఫ్రుమని గజము మొరలిడ
గావగ దక్షుండు తానొకండే జగతిం
గాఫ్రుట పరువిడు వేలుపు
కొమ్మపరసుతుడగుచు కావ్రుకావని గోడ్చెన్.

ఉ. నాయన నిద్రవోర; రఘునందన నిద్దురవోర యోలరా
పాయని యాటలం దవిలి బంగరుకొండ మొగడ్పవక్షులక్
మాయురె! యిట్టులైనను శ్రమంబగు రాయని యెన్న డేగనుల్
మూయని యాదిదేవుగని ముగ్ధలుజోలలు వాడిరయ్యెడన్
వా. సు.

ఈవిధముగా శైశవ క్రీడల రాకుమారులు ముంగాళ్ళ పాకులాడ జొచ్చిరి. శ్రీరాము డన్నమిడుతరి కౌసల్య కందక పరుగులిడుచుండును. తల్లి యాతని పట్టబోవును. యోగిజన మనస్సులకైనను పట్టుబడని యా రామచంద్రుడు తల్లి తన్ను పట్టరాగా, ఆమె అజ్ఞానమును చూచి పరిహసించుచున్నాడో యన, ముఖమునందు చిరునవ్వు మొలకలెత్తును. అంతలో నామె భక్తికి మెచ్చి పట్టుబడుచుండును.

ఇట్లా శ్రీరామచంద్రుడు * శైశవమున తల్లిదండ్రులకు గారాబు బిడ్డయై హృదయానంద కరుడాయెను. రామ

* శ్లో॥ బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః
రామస్యలోక రామస్య భ్రాతుర్జ్యేష్ఠస్య నిత్యశః॥
సర్వప్రియకరస్తస్యరామస్యాపి శరీరతః
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః
నచతేనవినా నిద్రాం లభతే పురుషోత్తమః
మృష్టమన్నముపానీతమశ్నాతినచతంవినా"

లక్ష్మణుల హృదయములు రెండును ఒకచోనుండవలెను. లక్ష్మణుడు రాముని ముఖపద్మమును చూచి యానందించుచు నిద్రపోవును. చిన్నతనమునుండి లక్ష్మీసంపన్నుడగు లక్ష్మణుడు శ్రీరాముని తన ప్రాణములకంటె అధికముగ ప్రేమించుచుండెను. శ్రీరాముడును లక్ష్మణునొదలి నిద్రించువాడుకాడు. మధురాన్నమును సువర్ణపాత్రయందిడుకొని కౌసల్యరాగా, రాముడు లక్ష్మణునొదలి భుజించువాడుకాడు. ఔరా! ఏమి! ఆ సోదరప్రేమ. భక్తవాత్సల్యము. రామలక్ష్మణులవలె భరత శత్రుఘ్నులును పరస్పర మైత్రితో మెలగుచుండిరి. జ్యేష్ఠులపై కనిష్ఠులకు భక్తి. జ్యేష్ఠులకు కనిష్ఠులపై వాత్సల్యము సహజ ధర్మము; సంసార ధర్మము గదా! భారతీయులారా! భారతమాతయందే సోదరులమగు మనకెన్నడో ఆ మైత్రి!

పాఠకులారా! రాముని శైశవమును పఠించుతరి కౌసల్యా దశరథుల వాత్సల్య భక్తి స్ఫురింపక మానదు. ప్రథమమున భక్తి యననేమో విచారింతము. మధుసూదనసరస్వతి భక్తి నిట్లు నిర్వచించుచున్నాడు.

శ్లో॥ ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహిక తాంగతా
సర్వేశే మనసోవృత్తిర్భక్తి రిత్యభిధీయతే.

నిరంతర భగవదారాధనచే పరమేశ్వరునియందు మనస్సు ఏకత్వమును పొందుట భక్తి యనబడును. భగవంతుని సన్నిహితుని జేసుకొనుటకు ముఖ్యములగు నాలుగు విధముల భక్తులు గలవు. (1) వాత్సల్యభక్తి. (2) మధురభక్తి.

(3) సఖ్యభక్తి. (4) దాస్యభక్తి. ఇందేమార్గమువల్లనైనను తరింపవచ్చును. "ఎట్లైన సద్ధామధ్యాన గరిష్ఠుడైన హరి చెందక వచ్చు ధాత్రిశ్వా" వాత్సల్యభక్తి యన తల్లిదండ్రులకు పుత్రునిపై గల ప్రేమయె ! ఈ వాత్సల్యభక్తియందు ప్రేమయే ప్రధానము. ఇందు భక్తులు భగవంతుని పుత్రునిగా బడసి తమ సుఖముకన్న నిరంతరము భగవంతుని సుఖమునకే పాటు బడుచుందురు. ఎన్ని కష్టములు వచ్చినను లెక్క చేయరు. వానినొక్క పనికైనను నియోగింపరు. బిడ్డలడుగు లిడునపుడు పాదపద్మములు ఎచ్చట కందునో యని విచారింతురు. సరియగు వేళకాహారము లేమి సొమ్మసిలునని సొక్కుదురు. కన్నుల రెప్పవేయక కాచియుందురు. ఆ సుందర విగ్రహమును చూచి ఆనందింతురు. రూపు రేఖా విలాసముల కొనియాడుచుందురు. మనోహరముగ నాతని ముందిడుకొని గానము చేయుచుందురు భోజనమునకు మధురాహారములనే గాక తమ రక్తజన్యములగు స్తన్యములసైతము నాతని నారగింప సేతురు. ఆహా ! ఏమి వాత్సల్యభక్తి గరిమ ! ఇట్టిసేవ రామునియందు కౌసల్యా దశరథులకు సంభవించెను. పూర్వ జన్మముల వారేమి తపమొనర్చిరో ? భక్తావతంసుడగు త్యాగయ్య రామ మాతయగు కౌసల్యను ఇట్లు స్తుతించి యున్నాడు.

పల్లవి॥ శ్రీరామ జయరామ శృంగార రామ యని చింతింపరాదె ఓ మనసా.

చ॥ తళుకు చెక్కుల ముద్దుపెట్టగా కౌసల్య తపమేమి జేసెనో తెలియు శ్రీరామా జయరామా. ౧

దశరథుడు శ్రీరామా రా రామ యని పిలుచుటకు తపమేమి జేసెనో దశరథుడు మును తపమేమిజేసెనో తెలియ శ్రీరామా. ౨

ఇట్టి వాత్సల్య భక్తి రామునియందు దశరథ కౌసల్యలకు వలె కృష్ణునిపై యశోదానందులకును, శ్రీకృష్ణ చైతన్యునిపై శచీదేవికిని లభించెను. మనము మన బిడ్డలను భగవత్స్వరూపులుగ భావించి, వారి సేవయే రాముని సేవగా నెంచి ముక్తిగాంచ వచ్చును. ఇట్లు భగవత్సేవచే గాక సంసార సముద్రమును మరెట్లు తరింతుము!

సీ॥ సంసారజీమూతసంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్నులారునే
విష్ణు సేవామృత వృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాసులింకునే
హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే
పద్మాక్షు నుతిరవి ప్రభలు లేక

తే॥ నిరుపమాపునరావృత్తి నిష్కలంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింత నాంజనము లేక
తామరస గర్భునకునైన దానవేంద్రా!

భా-స్కం.7

# విద్యాభ్యాసము

రాకుమారుల వయస్సున కనుగుణ్యముగా దశరథ మహారాజు వశిష్ఠాధిపత్యమున చౌలోపనయన సంస్కారములగావించెను. ఆ రాకుమారులందరు తల్లిదండ్రుల సేవించుటయందును పెద్దల గౌరవించుటయందును ప్రసిద్ధి కెక్కిరి. ఆ బాలకు లందరిలో రాముడు మిన్నయై నేర్పరియై మేలుబంతియై ఉజ్జ్వల ధ్వజమో యన ప్రకాశించుచుండెను. గురువులకడ వేదవేదాంగముల నభ్యసింప జొచ్చిరి. "ప్రవేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అనునట్లు విద్యలు పూర్వజన్మ సంస్కారముచే వారల నాశ్రయింప దొడగెను. ధనుర్విద్య యందును అశ్వారోహణమందును గజారోహణమందును రథసారథ్యమందును బాహుబల ప్రదర్శనమందును నిపుణులైరి శ్రీరామచంద్రుడు అశ్వారూఢుడై మృగముల వేటాడుటకు బయలుదేరుతరి లక్ష్మణుడును తురగారూఢుడై ఆతని * వెన్నంటును. ఇట్లే భరత శత్రుఘ్నులును కలసిమెలసి యుండిరి. అందరు వేదవిదులు, శూరులు, ప్రజాహితులు, జ్ఞాననిధులు, అందు రాముడు సత్యపరాక్రముడును నిర్మల శశాంకుని వలెకాననయ్యెను. ఇట్టి సుపుత్రులబడసి కౌసల్యా దశరథులు అమందానందకందళిత హృదయారవిందులైరి. ఇట్లా రాకుమారులు విద్యాభ్యాస బలంబున పెద్దపెరిగి ఉక్కుమీరి దేశమునకు మేలుచేయ గలిగిరి. నాటి యీ విద్యాభ్యాసంబును గమ

---

* "యదాహి హయమారూఢో మృగయాం యాతిరాఘవః తదైనం పృష్ఠతోన్వేతిసధనుః పరిపాలయన్."

నించితిమేని అక్కాలమున మన భారతదేశమున ఎట్టి విద్యలు లోకయాత్ర కనుకూలములో మనము గ్రహింప గలము ఆ నాడా విద్యనేర్చిన నరేంద్రకుమారులు గృహస్థాశ్రమము స్వీకరించి జగన్నాటకమును ధర్మబద్ధముగ నడుపగల సమర్థులు. వారా విద్యల నభ్యసించి అన్నిటికంటెముందు సదాచార ధర్మములనే బోధించుట ముఖ్యకర్తవ్యమని విశ్వసించిరి. ఎల్లప్పుడును అతిభక్తితో, కడు మెలకువతో పరులకు మేలు చేయుట ముఖ్యముగా తెలుసుకొనియుండిరి. వివిధకళల యందును సుశిక్షుతులై పేరువడసిరి.

లోకములో విద్యార్జనమునకు ఫలము నాల్గువిధములై యున్నది. 1 పారమార్థికజ్ఞానము, 2 సదాచారానువర్తనము, 3 బుద్ధిసూక్ష్మత, 4 శరీరదార్ఢ్యము, రాకుమారులీ నాల్గు ప్రయోజనముల గడించి సర్వజన మనోభిరాములై నిండు జవ్వనమున ఉత్తమపురుషులై విరాజిల్లిరి. ఇదిగదా ఉత్తమ విద్యాభ్యాసమునకు ఫలము! నేడట్టి సంపూర్ణ విద్యావిధానము కొరతవడియున్నది. అందుచే శరీరదార్ఢ్య సంపాదనము పారమార్థికజ్ఞానమును పూర్తిగ మరుగుపడియున్నవి. భారతీయులీ విషయమున శ్రద్ధవహింతురుగాక!

ఇక ఉపనయన సంస్కారమునుగూర్చి విమర్శింతము. ఇయ్యది సంస్కారములలో ఉత్తమమైనది. మానవునకు తలిదండ్రులచే ప్రాప్తించు శరీరలాభముగాక యీ సంస్కారమున జ్ఞానరూపమగు వేరొక జన్మ ప్రసాదింపబడుచున్నది. అది గురు సన్నిధిచే లభించును. కావున యీ సంస్కారమును తెనుగులో

"గురువు నొద్దకు పంపుట" అనియే పిలువ వచ్చును. సంస్కృత ములో దీనికి ఉపనయనము అను నామము సుప్రసిద్ధమై యున్నది. అనగా ఉప=సమీపమునకు, నయనం= పంపించుట అనగా గురువునొద్దకు (విద్యాభ్యాసము కొరకు) పంపించు టయే యీ సంస్కారమందలి ముఖ్యోద్దేశము.

విద్యార్జనమునకు వలయు సాధనములన్నియు వటువు నకు ఉపనయన సంస్కారమువలన లభించుచున్నవి. అందుకు ముఖ్యముగా 1 ఆయుర్దాయము 2 దేహపుష్టి 3 మేధా శక్తి అనునవి ప్రధాన సాధనములు ఇవి దేవతారాధన వలన గాని లభింపవు. ఆర్యమత సిద్ధాంతమునను సరించి మనకు ప్రత్యక్షదైవములు 1 అగ్ని 2 సూర్యుడు, కావున నే కర్మారంభ మున ఆచార్యుడు వటువున కాయుర్దాయము ననుగ్రహింపు మని అగ్నిదేవుని ప్రార్థించును.

"ఆయుర్దా దేవజరసం గృణానో ఘృతప్రతీకో ఘృత పృష్ఠో అగ్నే, ఘృతం పిబ న్నమృతం చారుగవ్యం పితేవపుత్రం జరసేనయేమం"

(ఉపనయన మంత్రము)

తా॥ ఓ అగ్నిదేవా! నీ రూపము తేజోవంతము. *ఆయుర్దాయ హేతువగు ఘృతమే నీయాహారము కర్మకాండ యందు అమృత స్వరూపమగు ఘృతమును హవ్యరూపముగా గ్రోలు మందువు

* ఆయుర్దాయ హేతువగు ఘృతము - డాల్డా - గేదనెయ్యి - కావు గోఘృతము

అట్టి నీవు యీ బ్రహ్మచారిని పుత్రప్రేమతో జూడుము. ఆయుష్యాభివృద్ధి నొసంగి తండ్రివలె కాపాడుము.

పై విధముగ ఆచార్యుడు శిష్యుని ఆయుర్వృద్ధి కోర కగ్నిహోత్రుని ప్రార్థించి అతనిపోషణ భారమును దేవతలపై నిడుచు నీక్రింది మంత్రముల నుచ్చరించును.

"అగ్నిష్టే హస్తమగ్రభీత్ సవితాతే హస్తమగ్రభీత్, సర్వస్వతీతే హస్త మగ్రభీత్ ..."

(ఉపనయన మంత్రము)

"కుమారా! ఆయుర్దాయ కర్తయగు అగ్నిదేవుడు, పుష్టి సంధాయకుడగు సూర్యభగవానుడు, విద్యాదాయిని యగు సరస్వతీ దేవియు, నిదే నీ హస్తమును గ్రహించుచున్నారు." అనుచు ఆయా దేవతల ధ్యానించుచు వారికి ప్రతినిధిగా ఆచార్యుడు శిష్య హస్తమును గ్రహించును.

పిమ్మట ఉపనయన సంస్కారమందలి ప్రధానాంగమగు బ్రహ్మోపదేశము గావింప బడును. (ఇది యేసుముహూర్తము)

## బ్రహ్మోపదేశము

బ్రహ్మయన వేదము. దాని నుపదేశించుటయే బ్రహ్మోపదేశము. ఈ ఉపదేశము వలన వటువునకు వేదాధ్యయనాధికారము ప్రాప్తించును. వేదాధ్యయన మొనర్చి వేదవిహిత కర్మల ననుష్ఠించి తేజస్వులరగు పుత్రులను శిష్యులను ఉత్పత్తి జేయుమని బ్రహ్మోపదేశ మంత్రము హెచ్చరించుచున్నది.

"సుప్రజాః ప్రజయా భూయాస్సువీరో వీరైస్సువర్చ్వావర్చసా సుపోషః పోషైః" (బ్రహ్మోపదేశ మంత్రము.)

తా॥ కుమారా! నీవు వేదాధ్యయన మొనర్చి కర్మానుష్ఠాన మహిమచే సుపుత్రుల బడయుము. అంతియే కాదు. నీ యనుష్ఠానబలము పుత్రులతో సాగుకొనక, మనుమలందును ప్రవేశించి వారిని వీర్యవంతుల నొనర్చుగాక. ఒక్క నీవంశమే కాదు; నీపుత్రులవలె — పౌత్రులవలె - శిష్యులును - ప్రశిష్యులును ప్రభావ సంపన్నులై నీ యశస్సును వృద్ధిపరచి వేదమహిమను దేశమున వెల్లడింతురుగాక.

బ్రహ్మోపదేశము ముగిసిన పిదప బ్రహ్మచారికి శరీరపుష్టి - బుద్ధిబలము చేకూరుటకై కొన్ని హోమములు గావింపబడును. వీనిని ప్రధాన హోమములందురు.

## — ♦ ప్రధానహోమములు ♦ —

"అగ్నిష్ట ఆయుః ప్రతరాందధా త్వగ్నిష్టేపుష్టిం ప్రతరాం కృణోతు..............................."

తా॥ కుమారా! అగ్నిదేవుడు నీకు శరీరబలమును ప్రసాదించుగాక !

"మేధాంమహ్యా మంగిరసో మేధాగ్ం సప్తఋషయో దదుః
మేధాంమహ్యాం ప్రజాపతిర్మేధా మగ్నిర్దదాతు."

"అంగిరసుడు-సప్తమహర్షులు - బ్రహ్మదేవుడు - అగ్నిదేవుడు ప్రసన్నులై బుద్ధిబలమును ప్రసాదింతురుగాక". ఇట్లే మరికొన్ని హోమము లొనర్పబడును. పై హోమముల వలన

బ్రహ్మచారికి బుద్ధిబలము దేహబలము ప్రాప్తించును. పిమ్మట, నిఖిలవేద సారభూతమై సగుణోపాసనతో ప్రారంభించి నిర్గుణ ధ్యానమువరకు గొంపోయి జీవుని తరింపజేయు గాయత్రీ మహా మంత్రముపదేశింపబడును. అటుపై బ్రహ్మచారి పాటింపవలసిన కొన్ని నియమముల నుపదేశించుచు ఉపనయన సంస్కారము ముగియును.

అనంతరము బ్రహ్మచర్య నియమములను బోధింతురు.

"ఆచార్యాధీనోభవ" గురువునకు శుశ్రూష యొనర్చుచు వారు చెప్పుదానిని విశ్వసించుము. నిత్యమును గుర్వభివాదన చేయుము.

శ్లో॥ అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః
చత్వార తస్య వర్ధంతే ఆయుర్విద్యా యశోబలమ్.

తా॥ పెద్దల నిత్యము సేవించువానికి ఆయుర్దాయము, విద్య, యశస్సు అభివద్ధిచెందును.

మనుస్మృతి. అ 2-12 — శ్లో.

"మాసుషుప్తాః పగలు నిద్రింపకుము.

పగలు నిద్రించుటవలన విద్యాభంగము కలుగును. సోమరితనము హెచ్చును. బుద్ధిబలము తగ్గును.

## — విశ్వామిత్రుని రాక —

కొంతకాలము గడచెను. శ్రీరామచంద్రుడు లోకోప కారము చేయు కాలమాసన్నమాయెను. దశరథుడు మంత్రి పురోహితులతో రాముని కల్యాణమును గూర్చి ముచ్చటింప

జొచ్చెను. ఇట్టి సమయమున ద్వారపాలకుడు అతిభక్తి విన యములతో విశ్వామిత్ర మహాముని రాక నెరింగించెను. దశరథుడును సంభ్రమంబున సింహాసనము డిగ్గి ఇంద్రుడు బ్రహ్మ నెదుర్కొనునట్లు ఎదురేగి విధి విధానమున పూజించి తన సదనమున ఉచితాసనమున కూర్చుండబెట్టి ప్రీతితో నిట్లు పలికెను. "మునీంద్రా! మీరాక అమృత సుఖమును కలుగజేసెను. నీరు లేని బావియందు వర్షమునిచ్చి జలచరాదులకు సంతోషమును కలుగజేయు మేఘమో యన మీ దర్శనము మా కానందమును గూర్చెను. ఓ మహామునీ! నీకు స్వాగతము.

తే॥ మౌనినాథ! కుటుంబ జంబాల పటల
మగ్నమాదృశ గృహమేధి మండలంబు
నుద్ధరింపంగ నౌషధ మొండుగలదె?
యుష్మదంఘ్రి రజోలేశ మొకటి దక్క. (మనుచరిత్ర)

అన్నటుల మీ రాకవలన ధన్యుడను. మునీశ్వరా! మీరు వచ్చిన పనిగూర్చి సంశయింపవలదు మీ అభిప్రాయమును తప్పక నెరవేర్తును." ఆ వాక్యములు విని, ఋషి ముఖమున చిరునవ్వు మొలకలెత్తెను. జననము రఘువంశమున; గురువు వశిష్ఠుడు. నీవిట్లు పలుకుట యందాశ్చర్యమేమి! ఆడిన నుడువుల నెన్నడు తప్పవుగాక! రాజేంద్రా! నేనొక యజ్ఞమును చేయ నిశ్చయించితిని. నే దాని నారంభించినప్పుడెల్ల భీకరులగు నిద్దరు రాక్షసులు యజ్ఞకుండములందు అపవిత్రములగు రక్త మాంసములను పడ వేయుచు గగనమార్గమున అదృశ్యాకారులై నా యజ్ఞమును సమాప్తి కానీయక

బాధ పెట్టుచున్నారు. వ్రతదీక్షితులగువారు మౌనమును వీడిన వ్రతభంగమగునని శపింపకుంటిని. గాన, నో రాజా నా యీ యజ్ఞ సంరక్షణార్థము బాలుడైనను సత్య పరాక్రముడగు రామచంద్రుని నా కొసంగుము. రక్కసుల బాలుడెట్లు జయించు ననవలదు. నా దివ్యతేజో మహిమచే నీ కుమారుడు రాక్షసుల ద్రుంపగలడు. నాతో నీ రాముని బంపితివేని, అతని కెన్నియో శుభముల చేకూర్చెదను పాపాత్ములగు రాక్షసులు ధర్మహీనులగుటచే పరాక్రమ వంతులయ్యును. అవశ్యము వినాశ మొందెదరు. కాన రాజా నీ వాలోచింప బనిలేదు. లోక కంటకుల వధించి లోక క్షేమదాయకుడగు నీ రాముడు అవ తార పురుషుడని తెలిసికొనుము. సందేహింపక రాము నా వెంటబంపుము. రాజశార్దూలా ?

శ్లో॥ అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం
వశిష్ఠోఽపి మహాతేజా యేచేమే తపసి స్థితాః.

తా॥ రాముడు సత్యస్వరూపుడనియు, సత పరాక్రము డనియు, నేనెరుగుదును. తేజోవంతుడగు వశిష్ఠుడున్ను యెరు గును. తపశ్శీలురగు నీ ఋషులును ఎరుంగుదురు.

"అహం" అను శబ్దము, విశ్వామిత్రుని గొప్పదనమును, ఆతడు బ్రహ్మర్షి యగుటకు పడిన కష్టమును సూచించుచున్నది. ఆతడు నలుదిక్కుల నలుబది వేలయేండ్లు తపస్సొనర్చినట్లు చరిత్రలో సుప్రసిద్ధమైయున్నది ఇంతకష్టపడి త్యాగియై ఆయన పొందిన మహాఫలమేమనగా మహాత్ముడగు రాముని గ్రహిం చుటయే. ఈతనివలెనే వశిష్ఠాదులుకూడ కష్టపడినవారు

కావుననే వారందరుకూడ రామతత్వమును గ్రహించిరని విశ్వామిత్రుడనెను. దశరథుం డజ్ఞానంబున మన్నులోనున్న రత్నము విలువ మంటికి తెలియనట్లు రాముని కుమారుండని భావించెనే గాని, మహర్షులందరును ప్రకృతి కవ్వల వెలుగు పరంజ్యోతి యనియే రాముని తెలుసుకొనిరి. ధీరులగువారే గదా ? రామ తత్వమును గ్రహింప సమర్థులు. "తస్యధీరాః పరిజానంతి యోనిం", రామాయణమును చక్కగా మథించి తత్సారం బెరింగిన యేసాధకుండైనను రాముని నిజ తత్వమందే లీన మగును. "వశిష్ఠోఽపి" ఇచటి అపి శబ్దముచే వశిష్ఠుడు కూడా అని అర్థము. ఇందలి గొప్ప భావమేమన, నా విరోధియగు వశిష్ఠుడని భావము. విరోధియగు వశిష్ఠుడు తనకు వ్యతిరేకముగా చెప్పునని విశ్వామిత్రుడు సందేహింపలేదు

విశ్వామిత్రుడు చేయు ప్రతికార్యమునకు వశిష్ఠుడు ప్రతికూలుడైనను యీ కార్యమునకు మాత్రము (ఇది స్వకార్యము కాదు గనుక) తన భావముతో తప్పక ఏకీభవించునని విశ్వామిత్రుని మనోదార్ఢ్యము. మహర్షులు వారి స్వకార్యముల యందు ఒకప్పుడు విరోధించుకున్నను లోక శ్రేయస్సు ప్రధానమైనపుడు అందరు నొకటగుదురనుటకు యిది నిదర్శనము *

విశ్వామిత్రుని పై వాక్యములు విని దశరథుని గుండె జల్లు మనెను. కొంతసేపు నిశ్చేష్టుడై మాటలాడజాలక యూరకుండి యిట్లనెను. మునీంద్రా! శత్రువులెవ్వరు? ఎట్టి వారలు. మరియు మాయా

* వారిలో వారికి ఎగవులున్నను బానిస దేశముల "స్వరాజ్య" పోరాటన వచ్చినప్పుడు తెల్లవారందరు ఒక్కటియే గదా ?

వులు. బాలకుడా? శిరీషకుసుమ పేశలగాత్రుడు ముక్కుపచ్చలా రని పసిబాలుడు యుద్ధమా? భీకరశత్రువీరులతో కూడినది. రాక్షసులా? వీరరసావేశులుగాని కరుణారస పూరితులుగారు. *పదునారు వత్సరములైనను లేని రాముని పంపుదు నే? హా! నా రాముడు—లేక లేక అరువదివేల వత్సరములకు పుట్టిన గారాబు ముద్దుపట్టి. తొలికూన ఎలప్రాయంపుబిడ్డ. ఇది కారానిపని. అని గద్గదస్వరముతో మునిని సమీక్షించి ఓ మునిచంద్రమా! పసిబాలునివలన పనులగునే? ఇదే నేను నీ వెంట అరుగుదెంచు చున్నాను. నా సర్వసైన్యము నీయాజ్ఞ రక్షకై వినియోగింతును. నీ యజ్ఞధ్వంసకులగు రాక్షసులెవరు? వారి నామము లెవ్వి? అని ధరణీనాథునకు మునినాథుం డిట్లనియె.

"పౌలస్త్యవంశ సంభూతుండును విశ్రవసుని పుత్రుడును అగు రావణుడను రాక్షస రాజొకడుండె. అతడు బ్రహ్మను తన నిజతపః ప్రభావమున మెప్పించి ముల్లోకముల జయించెను. ఆతని పంపుచే మహాబలులగు మారీచ సుబాహులను రక్కసులు నాయజ్ఞమును ధ్వంసమొనర్చుచున్నారు."

ఆ వాక్యములు విని రాజు "అబ్బా! వారల నెదుర్కొనిపోర దేవేంద్రాదులకైనను బలము చాలదు ఆలోక విద్రావణుని పది తలలు చూచిన ఎవడు బ్రతుకనోపు? కరుణాసింధే! ఆరాక్షసుల నెదిర్చి నేనును పోరనోప. ఆ రాక్షసుల బలమును నా సైన్యముకూడ నెదుర్కొనజాలదు. దేవగంధర్వులకు నసాగను

---

* శ్లో॥ ఊన షోడశ వర్షోమే రామో రాజీవలోచనః,
నయుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహరాక్షసైః

కాదు. పరాక్రమసంపన్నుడయ్యును పసికూన. *అస్త్రబలములు లేవు. సంయమీంద్ర! నాపుత్రువిడిచి ఒక్క ముహూర్త కాలమైనను బ్రతుకనోప. ♦ అల్పభాగ్యుడ నగు నాకు మీరే దైవము. కృపామయా! నన్నురక్షించి నాపుత్రకు ననుగ్రహింపుడు," ఆ మాటలు ప్రజ్వలించుచున్న అగ్నియందలి ఆజ్యమువలె మునిని రోషావేశుగా నొనర్చెను. కఠినముగా మాటలాడ జొచ్చెను. "ఆడినమాట తప్పుట అనుచితము. దీన రఘువంశమున కంతకు చేటు వాటిల్లును. చేసిన బాస త్రెంచుట తగదు. మనుజపాలా! నీవసత్యమాడి నీపుత్ర మిత్రులతో బంధువులతో భార్యలతో సుఖంబుండుము." అనిమండిపడ జొచ్చెను. అట్టిక్రోధ పూరితుడగు ఆ విశ్వామిత్రుని జూచి పౌరులు పరుగులిడిరి. దశరథాదులు బెదరిరి. లోకములు కదలబారెను. క్రోధతామ్రాక్షుడైన విశ్వామిత్రునింగాంచి ప్రళయం బుద్భవిల్లెనోయన కుడ్యంబులదరె......సభాస్తంభంబులు సైతము దద్దరిల్లె. దేవతలదరిపడిరి.

అంత వశిష్ఠుడు రాజుతో నిట్లనెను.

శ్లో॥ సంశ్రుత్యైవం కరిష్యామీత్యకుర్వాణస్య రాఘవ
ఇష్టాపూర్త వధో భూయాత్తస్మాద్రామం విసర్జయ.
వషోఽస్త్రాన్ వివిధాన్ వేత్తి త్రైలోక్యే సచరాచరే
నైవమన్యః పుమాన్ వేత్తి న చ వేత్స్యన్తి కేచన.

---

* శ్లో॥ బాలో హ్యకృతవిద్యశ్చ నచవేత్తి బలాబలం
నచాస్త్రబలసంయుక్తో నచ యుద్ధవిశారదః

♦ శ్లో॥ విప్రయుక్తో హి రామేణ ముహూర్త మపి నోత్సహే
జీవితుం మునిశార్దూల నరామం నేతుమర్హసి.

కృతాస్త్రమకృతాస్త్రం వా నైనం శక్ష్యంతి రాక్షసాః
గుప్తం కుశికపుత్రేణ జ్వలనేనామృతం యథా.''

తా॥ రాజేంద్రా! రఘువంశమున బుట్టిన నీకు ఆడిన మాట దప్పుట పాడిగాదు. దాన ఘోరమగు నరకములు సంప్రాప్తమగు. * ఇష్టాపూర్తములు ధ్వంస మొనర్చిన ఎట్టి పాపము సంభవించునో అసత్యమాడిననట్టి పాపము సంభవించును. విశ్వామిత్రుడు రాజర్షి; దివ్యాస్త్రవిద్యాసంపన్నుడు. లోకములో నెవ్వరు పొందని అస్త్రశస్త్రముల నీతడెన్నియో సంపాదించి యున్నాడు. భృశాశ్వుని పుత్రులు అస్త్రశస్త్ర రూపముల ధరించి ఈతని ఆశ్రయించిరి. కాన ఓ రాజా! ఈతని సామాన్య పురుషునిగా తలపకుము. అమృత భాండము అగ్నిజ్వాలలచే రక్షింపబడినట్లు శత్రువుల కజేయుడగు నీ పుత్రుడు విశ్వామిత్రునిచే సురక్షితుడై జన్నమును కాపాడ గలడు. నీ పుత్రుని హితము కోరియే నిన్ను యాచించు చున్నాడు. మహాత్ములు లోకోద్ధరణకై పాటుబడుదురుగాని స్వలాభమునకై ఏపనిని జేయరు. అని యిట్లూరడిలం బలికిన గురువగు వశిష్ఠుని వాక్యములకు రాజు సంతసించెను. రామలక్ష్మణులు తల్లుల మంగళాశీస్సులగొని నూతనవస్త్రాలంకృతులై కోదండ తూణీరముల ధరించి తండ్రికి, గోత్రనామములతో అభివాదన మొనర్చి ఎదుట నిలచిరి. రాజు పుత్రుల

* ఇష్టాపూర్తములు, ఇష్టము = యాగములు, దేవతారాధనము,
పూర్తము = బావులు త్రవ్వించుట, తోటలు వేయించుట, ఆలయప్రతిష్ఠలు, అన్నప్రదానము, చెఱువులు త్రవ్వించుట.

తొడపై నిడుకొని శిరము మూర్కొని చుబుకముల పుణికి, నిద్దంపు చెక్కిళ్ళు ముద్దిడి, సంతుష్టమగు మనస్సుతో రామలక్ష్మ ణులను విశ్వామిత్రున కొసంగెను. ఆ సమయమున శ్రీరామ చంద్రుడు రాక్షససంహారమునకు బయలు వెడలుచుండెనని దేవతలు సంతసించిరి. పుష్పవృష్టి కురిసెను దేవదుందుభులు మ్రోగెను. చల్లని గాలివీచెను. అంత విశ్వామిత్రుడు రామ లక్ష్మణుల వెంటనిడుకొని అయోధ్యాపురమునుండి పయన మయ్యెను. ముందు విశ్వామిత్రుడు, ఆ మునిచంద్రునివెనుక రామ లక్ష్మణులు వెన్నంటిరి. ఆ రాకుమారులు ఇరుభుజ ములయందు రెండంబుల పొదుల ధరింప ఉన్నతమగు శిర స్సుతో త్రిశీర్ష పన్నగముల వలె ప్రకాశించుచు కోదండముల ధరించి పిల్ల తెమ్మెరల ముఖమందలి ముంగురులు సంచలింప అయోధ్యాపురవీధుల పోవుచుండిరి. ముద్దుగులుకు సొమ్ములు శోభ గూర్చుచుండెను. అంత వారశ్వనీ దేవతలవలె ప్రకాశిం చుచుండిరి. తను భూషణముల కాంతి దిక్కుల ప్రకాశింప జేయుచుండెను. జగన్మోహనులగు నా బాలుర పురస్త్రీలు దృష్టుల నేకాగ్రముజేసి వీక్షించుచుండిరి. కొందరంగనలు కుసు మాంజలు లర్పించిరి. ఇట్లు వారు పురవీధు లతిక్రమించి ఒకటి న్నర యామడ దూరముజనిరి. సరయూనది దక్షిణ భాగమున విడిసిరి. అంత విశ్వామిత్రుడు రాముని కాంచి "రామా! రాజీవ లోచనా!" యని మధురోక్తుల సంబోధించెను.

శ్లో॥ గృహాణవత్స సలిలం మా భూత్కాలస్య పర్యయః
మంత్రగ్రామం గృహాణత్వం బలామతిబలాం తథా,

తా॥ రామచంద్రా! కాలవిళంబనమేల? సంధ్యాస్తమయము కానున్నది. శుచివై యాచమింపుము! మంత్రరాజములగు బలాతిబల విద్యల గ్రహింపుము. వీనిని పఠించితివేని శ్రమ, జ్వరము నవ్వుడు బడలిక కలుగదు. బలము నభివృద్ధి జేయును. శరీరము తేజోవంతమగును. బుద్ధిబలము హెచ్చును. ఆకలి దప్పులుండవు. విద్యాబలమును నిశ్చయబుద్ధిని అభివృద్ధి చేయును. నీవు ప్రమత్తుడవై నిద్రించు తరియైన శత్రువులు నిన్ను జయింపలేరు. ఈ మంత్రములు బ్రహ్మదేవునిచే సృజింపబడినవి. ఈ మంత్రము లుపదేశించుటకు తగిన బ్రహ్మచర్యాది సుగుణములన్నియు నీ యందు కానవచ్చుచున్నవి. జాగు చేయకుము. నేను నీకీ దానమిచ్చుటచే పాత్రుడగు వానికిచ్చిన ఫలము పొందగలను. ఋషివాక్యము లాలకించి రామచంద్రుడు ముదమున శుచియై బలాతిబలవిద్యల గ్రహించెను. విద్యల గ్రహించిన రాముని తేజము మరింత యధికమాయెను. అంతలో లోకబాంధవు డస్తాద్రి జేరెను. రామలక్ష్మణులు సంధ్యాగ్నిహోత్రముల నిర్వర్తించి గురుశుశ్రూష సలిపి విశ్వామిత్రుని మృదుమధుర వచోలాలితులై దర్భశయనముల శయనింప సుఖముగా రాత్రి గడచెను.

పాఠకులారా! ఇంతదనుక విశ్వామిత్రునిచే వెలువరింపబడిన రాముని పరతత్త్వమును గ్రహించితిమి. లోకకల్యాణమునకై ఆ పరాత్పరుడు చూపు విద్యార్థిధర్మముల గ్రహింతము.

రామలక్ష్మణులు తండ్రియాజ్ఞను పరిపాలించిరి ఘోరారణ్యముల నడువవలసివచ్చినను క్రూరులగు రాక్షసులతో యుద్ధము చేయవలసి వచ్చినను వారు వెనుదీయలేను. రాజ్యసుఖములవదలిరి. విద్యార్థులగువారు సుఖములను కాంక్షింతురా? "విద్యాతురాణాం నసుఖంననిద్రా" బాలురైనను అతిధైర్యముతో ముందుకునడచిరి. ఇందువలన సత్కృష్టమగు విద్యల పొందగలిగిరి. విద్య నభ్యసింపగోరువారికి గురుశుశ్రూషయే శరణ్యము గదా?

"యథా ఖనన్ ఖనిత్రేణ నరోవార్యధి గచ్ఛతి
తథా గురుగతాం విద్యాం శుశ్రూషు రధిగచ్ఛతి" (మను)

తా॥ మానవుడు భూమి త్రవ్వుచు జలము నందుకొను రీతి గురుశుశ్రూష గావించు విద్యార్థి గురువునందలి విద్యను గ్రహింప గల్గును.

రామలక్ష్మణులవలె దేశభాగ్యోదయముకొరకు విద్యల నభ్యసించుటకు దేశాంతరములకేగుటకైనను సమర్థులమై యుండవలెను. విద్యార్జనకు బాల్యమే యుక్తసమయము. ఆకాలము వ్యర్థముజేసినవారు అనంతరమున దుఃఖింతురు. విద్యార్థులకు దైవభక్తికూడ ఉండవలెను దీనిచే శరీరబలము-బుద్ధిబలము-విద్యాబలము-ను అభివృద్ధి కాగలదు. ఇట్టి దైవోపాసనను పూర్వులు మంత్రరూపమున నొసర్చియున్నారు. రామునకు విశ్వామిత్రునిచే నివ్వబడిన బలాతి బల విద్యలును ఇట్టివే. బలాతి బల విద్యల మంత్రధ్యానము నిందు పొందుపరచుచున్నాను.

—: ధ్యానమ్ :—

"అమృత కర తలార్ద్రా సర్వసంజీవ నాఢ్యా
వఘహరణ సుదక్షా వేదసారే మయూఖే
ప్రణవమయ వికారా భాస్కరాకార దేహా
సతతమనుభ వేహం త్వా బలాతి బలేశా.

దీని నిత్యము పారాయణచేసినచో ఐహికాధ్యాత్మిక శక్తులు అభివృద్ధి యగును. విద్యాభివృద్ధియు కలుగును.

—• తాటక వధ •—

దండనాధునివలె వేగుచుక్క తూర్పుదిక్కున లేచి నిలచెను. తెల తెల వారజొచ్చెను. అరుణకాంతులు తూర్పు నావరించెను. శుక పికాదుల అవ్యక్త మధురధ్వనులు వీనులకు సొంపుగూర్చుచుండెను దొరను జూచి దొంగమోము వెల వెలబారెనోయనరే రాజరుగుచుండెను. పుష్పగుచ్ఛములు ఘుమ ఘుమన్మని నెత్తావిని వెదజల్లుచుండెను. ఝుమ్మని రొదచేయుచు మధుమక్షికములు పువ్వులపై కెగయుచుండెను. బాలభానుడు అరుణకాంతులతో ప్రాగ్దిశ నుదయించుచుండెను. ఇంకను రామలక్ష్మణులు నిద్రించుచునే యుండిరి. అంత గురువగు విశ్వామిత్రుడు నిత్యవిధుల నిర్వర్తింప కాలమతిక్రమింపనున్నదని రామచంద్రు నిట్లు ప్రబోధించెను.

శ్లో॥ కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యాప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం.

తా॥ రామచంద్రా! ఉషఃకాలమైనది. సూర్యుడుదయింప నున్నాడు. దేవకార్యములును నిర్వర్తింపదగి యున్నవి. పురుష శ్రేష్ఠా! లెమ్ము. కర్తవ్యమును నెరవేర్పుము.

పాఠకులారా! విశ్వామిత్రుడు రాముని మేల్కొల్పు చున్నాడనగా ఆసమయము యొక్క ప్రాముఖ్యత జీవులు గమ నింప వలసియున్నది.

ఆకాలము అనేకమంది మహర్షులు శుద్ధ చిత్తమున తపస్సు చేయు కాలమగుటచే అప్పటి వాయువు ఆధ్యాత్మికాణు వులచే నిండియుండును. అప్పుడు నిద్రలేచి ధ్యానముచేయు సాధకునకు ఆ వాతావరణ మెంతయు సహాయము చేయును. నియమ బద్ధమగు జీవితము గలవాడే ఆసమయమున మేల్కొని సక్రమముగ ఉపయోగించు కొనగలడు. ఆ సమయ ముపయో గించు కొనుటలో మహాత్ముడు గొప్పవాడని వేరే చెప్పవల యునా?

ఇక "కౌసల్యా సుప్రజా" శ్లోకమందలి వాల్మీకి కోకిల ధ్వనుల గ్రహింతము-రాముని ప్రబోధించుటకు వెళ్ళి ప్రథమ మున కౌసల్యను పేర్కొనెను-ఏలయన విశ్వామిత్రుడు రాముని నిద్రా కాలిక సౌభాగ్యసంపత్తిని చూచి తాను వచ్చిన కార్యము మరచెను ఆశ్చర్య చకితుడాయెను. అంత నాతని యానంద ము మనస్సు నుద్బోధించి కౌ ల్యా దేవి యేమి తపముజేసెనో గదా యని స్మరింపజేసెను. సర్వజన మనోభిరాముడగు రాముని గనిన కౌసల్య ధన్యురాలని తలచి సంబోధించెను.

విశ్వామిత్రుడు దాశరథియని పిలువక "రామా" యని పిలచెను. రామా యను పదము రాముని రమణీయతను సూచించుచున్నది "రామా" సర్వదుష్టసంహారకుడ వగు నిన్ను కౌసల్య యెట్లు కనెనో అట్లే ప్రాగ్దిశయు తమస్సంహారకరుడగు సూర్యుని కన నున్నది. తెమ్ము— భవద్దర్శనమున, అజ్ఞానాంధకారము నివృత్తియగును. లోకబాంధవుని దర్శనమున నంధకారము నివృత్తియగును. నీ తల్లియగు కౌసల్యవలె పూర్వసంధ్యయు గౌరవింపదగినది. కాన రామా లెమ్ము రామా! నీ నిద్రాకాలిక దివ్యముఖారవిందసౌందర్య లక్ష్మిని సేవించితిని, నీవు మేల్కొను నప్పటి సౌందర్యలక్ష్మిని చూచి యానందింప కోరికగలదు. నీ సంపూర్ణ సేవచేయవలెనని గదా! వెంటగొని వచ్చితి, గాన రామా! లెమ్ము మఱియొకవిశేషము-ఋషి-"కౌసల్యా సుప్రజా" అనుటచే స్త్రీలకు సత్సంతానము కలుగుట యే ముఖ్యగౌరవ మని తెలియు చున్నది. కావుననే ఋషి "కౌసల్యాసుప్రజా" అని నుడివినాడు. మహర్షి కౌసల్యను పేర్కొనుటకు మరియొక కారణముగలదు. రాముని తనవెంట బంపునపుడు దశరథుడు పుత్రమోహముచే వ్యాకులత బడెను. కాని వీరపత్ని— వీరమాతయగు కౌసల్య కాసంతయైనను వెనుదీయలేదు. రాముని అలంకృతునజేసి ఆశీర్వచనమిడి పంపెను.

ఇంకను యీశ్లోకమువలన ప్రాచీనులగుపురుషులు స్త్రీలకెట్టి గౌరవమునిచ్చిరో తేటపడుచున్నది. నేటి యీ భారత దేశమున ప్రాచీనులందరును స్త్రీలకు గౌరవస్థానముల నివ్వ

లేదనియు, వారిని కడునీచముగా చూచిరనియు చెప్పుచున్నారు. నిజముగా పరిశీలించినచో స్త్రీలకే ప్రాముఖ్యమివ్వబడి యున్నది. చూడుడు. ఋషి సకల దేశాధీశుడగు దశరథుని కంటెను కౌసల్యకే ఉత్కృష్టమగు స్థానము నిచ్చియున్నాడు. శ్రుతిసైత మిట్లు వర్ణించినది.

"సమ్రాజ్ఞీ శ్వశురేభవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాంభవ
ననాందరి సమ్రాజ్ఞీభవ సమ్రాజ్ఞీ అధిదేవృషు"
"స్నుషాణాగ్ శ్వశురాణాం ప్రజాయాశ్చధనస్యచ
పతీనాంచ దేవౄణాంచ సజాతానాం విరాడ్భవ"॥

(వివాహమంత్రము)

ఓ కన్యా! నీవు, శ్వశురే=మామగారియందు, సమ్రాజ్ఞీ= ప్రధానురాలవు, భవ=కమ్ము, శ్వశ్ర్వాం = అత్తగారియందు, సమ్రాజ్ఞీ=ప్రధానురాలవు, భవ=కమ్ము. ననాన్దరి=పెనిమిటితోడ బుట్టినదానియందు, సమ్రాజ్ఞీ = ప్రధానురాలవు, భవ=కమ్ము. దేవృషు=బావమరదులందు, సమ్రాజ్ఞీ=ప్రధానురాలవు భవ= కమ్ము. మంత్రప్రశ్న 6—5.

స్నుషాణామ్=కోడండ్రకును, శ్వశురాణాం = మామ గారికిని, ప్రజాయాశ్చ=సీసంతానమునకును, ధనస్యచ=సకల ద్రవ్యములకును, పతీనాంచ = పెనిమిటియైననాకును—(దేవ రాద్యపేక్షయాంబహువచనమ్) నాస్నేహితులకును, దేవౄ ణాంచ = మరుదులకును, సజాతానాం = నాసహోదరులకును, విరాట్=అధీశ్వరురాలవుకమ్ము.

మంత్రప్రశ్న 6-7

ఆర్యులారా! మనపూర్వులు పూర్వమున స్త్రీని గృహ సామ్రాజ్యమున కధీశ్వరినిగా చేసినారు. అనంతరమున వీరమాతలై లోకమున కధీశ్వరత్వమును పొందునట్లు నిరూపించియున్నారు. భారతీయులారా! ప్రస్తుత దాస్యాంధకారమున మునిగి పాశ్చాత్య సన్నిదోషమున వేదమాతనధిక్షేపించు మనకు మతరహస్యము లెట్లు బోధపడును? మేల్కొనుడు! మేల్కొనుడు!! మాతృసేవాదీక్షితులుకండు!! ఆర్ష విజ్ఞాన విదులు కండు!!!

అంత నా రాకొమరులు ఋషిచే ప్రబోధితులై విధి విధానమున సంధ్యాదికృత్యములు నిర్వర్తించి సిద్ధాశ్రమమునకు పయనమైరి. ఇంతలో వారికి గంగా సరయూ సంగమము కానవచ్చెను. శ్రీరామచంద్రుడు కనుమేర దూరములో ఒక ఆశ్రమమును చూచి యీయాశ్రమ మెవ్వారిదని విశ్వామిత్రుని ప్రశ్నింప ఋషి యిట్లనెను. కౌసల్యానందనా! పూర్వము ఈశ్వరుడిందు తప మాచరించుచుండెను ఈతని తపోభంగమునకై మన్మథుడు యాత్నింపవోడగెను అత్తరి ముక్కంటి తన మూడవనేత్రమున పూవిల్తు వీక్షింప భస్మరాశియైపడెను. మన్మథుడు అప్పటినుండియు అనంగుడాయెను, మన్మథుడిచ్చట అంగముల (శరీరమును) వదలిన కారణముచే అప్పటి నుండి యీదేశ మంగదేశ మని ప్రఖ్యాతిగాంచెను.

మన్మథు డిచ్చట శరీరమును వదలుటచే ఈ యాశ్రమమునకు కామాశ్రమమనియు, రుద్రుడిచ్చట తపస్సు చేయుటచే

రుద్రాశ్రమమనియు పేర్లు. మిమ్మట వారు గంగాసరయూ సంగమమున స్నానమాడి పవిత్రులై నిత్యాహ్నికముల దీర్చి ఆయాశ్రమవాసులగు సంయముల సందర్శించిరి అదినమచ్చట గడచెను మరునాడు కృతాహ్నికులై పయనమైరి. అచ్చటి మునీశ్వరులు నావసంసిద్ధము చేసిరి. శిష్యులతోగూడ ఋషి నావనధిరోహించెను. గంగానది తరంగముల పెల్లుమీరెను. నావ నదీమధ్యమును జేరెను. అంతలో నతిసంరంభముతో గూడిన ధ్వని యొకటి వినవచ్చెను ఆ సంకులధ్వని విని రామచంద్రుడు మునిచంద్రుని, ధ్వనినిగూర్చి ప్రశ్నించెను. మునిచంద్రుని ముఖమున చిరునవ్వు మొలకలెత్త మందహాసముతో రామచంద్రా! రఘువరా! బ్రహ్మ తన సంకల్ప బలముచే కైలాసమున నం దొక తటాకమును నిర్మించెను. అది మనస్సుచే సృష్టింపబడిన దగుటవలన దానికి మానస సరస్సని పేరువచ్చెను. ఆ సరస్సు అయోధ్యను పడమటనుండి ఉత్తరముగా తూర్పుభాగమునకు మాలవలె చుట్టి అంగదేశమున ప్రవహించుచున్న గంగలో పడుచున్నది. ఎత్తగు ప్రదేశమునుండి పడుటచే యీధ్వని యేర్పడినది. రామలక్ష్మణులానదికి నమస్కరించి మిక్కిలి సంతసించిరి. వారు ముగ్గురు నావ దిగి, కాలి నడకతో గంగానది దక్షిణతీరమందలి అరణ్యమును ప్రవేశించిరి. సంయమీంద్రా! సింహశార్దూలాది క్రూరమృగసేవితమగు నీ యడవి అతిభయావహమై ధైర్యవంతుల హృదయమునుసైతము భేదించుచున్నది. ఈవనమిట్లు నిర్జనమై యుండుటకు కారణమేమి? పూర్వమెవ్వరైన నిందు నివసించిరా యని ప్రశ్నింప కౌశికుడిట్లనెను.

పూర్వము వృత్రాసురుని వధించుటచే ఇంద్రునకు బ్రహ్మహత్య ప్రాప్తించెను. ఆపాపముచే దేవరాజగు ఇంద్రునకు ఆకలి మలమునిండుట- అను మనుష్యధర్మములు సంప్రాప్తించెను. బ్రహ్మహత్యను తొలగించి ఈరెండు దోషముల పోగొట్టుటకై దేవతలీప్రదేశమున ఇంద్రుని * దివ్యతీర్థస్నానముల చేయించిరి. అందుచే బ్రహ్మహత్య తొలగి ఇంద్రుడు పవిత్రుడాయెను. అందుకు ఇంద్రుడు సంతసించి తాను పవిత్రత పొందిన ప్రదేశములకు మలద - కరూశములని పేర్లిడెను. ఈ ప్రదేశము ఇంద్రుని అనుగ్రహమున కొంతకాలము ధనధాన్యాభివృద్ధి కలదై యుండెను. కొంతకాలమునకు నూరు యేనుగుల బలముగల తాటక యను ఒక యక్షస్త్రీ యీదేశముల నాశము జేసెను. రాముడావాక్యముల విని యక్షులల్ప బలముకలవారుగదా! యక్షస్త్రీకి వేయియేనుగుల బలమెట్లు కలిగెనని మునిని ప్రశ్నించెను. అంతనాముని పూర్వము సుకేతుడను యక్షుడు గలడు, అతడు బ్రహ్మనుగూర్చి సంతానముకొరకు చాలకాలము తపస్సుచేసెను. బ్రహ్మ అతని తపస్సునకు మెచ్చి వేయి యేనుగుల బలముగల తాటకయను కన్యారత్నము నొసగెను. తండ్రియగు సుకేతుడామెను సుందుడనువానికిచ్చి వివాహము జేసెను. సుందుని వలన తాటక

---

* దివ్యతీర్థస్నానము శరీరారోగ్యమును మానసిక శక్తివిఅభివృద్ధి నొందించును.

ఇతర నదీజలములకన్న గంగానదీ జలములందు ఆరోగ్యవర్ధకములైన యణువులున్నవని పరిశోధనలమీద పాశ్చాత్య ప్రకృతి తత్వవేత్తలు సిద్ధాంతమొనర్చిరి. శంకున బోసినగాని తీర్థము కానట్లు ఈనాటి భారతీయులకు మన తీర్థ్యముల మహిమ తెల్పవలసినవారు పాశ్చాత్యులేగదా!

యందు మారీచుడనుపుత్రుడు కలిగెను. కొంతకాలమునకు అగస్త్యశాపముచే సుందుడు మృతినొందెను. భర్తను జంపెనను క్రోధముచే తాటకామారీచులిద్దరు అగస్త్య ఋషిని బాధింప బొచ్చిరి. అగస్త్యుడు వారిని రాక్షసులగునట్లు శపించెను. వారును సుందరములగు యక్షరూపముల వదలి వికృతమగు రాక్షస రూపముల పొందిరి.

ఆ తాటకామారీచులచే మలద కరూశ దేశములు రెండును జనరహితమై పాడుబడియున్నవి. తాటకి నివసించు వనవిూ దేశమునకు కొలది దూరమున గలదు దుష్ట స్త్రీ యగు నీమె తాపసుల హింసించుచు సాధుల బాధించుచున్నది. రఘువీరా! యీమానుషాశని వధింపుము ముల్లోకములు దీన సంతసించును.

గుర్వాజ్ఞ ననుసరించి రఘువీరుడు తన పిడికిటిచే కోదండ మధ్యభాగము పట్టుకొని వింటిత్రాటిని మ్రోగించెను ఆ ప్రచండ ధ్వని భూనభోంతరాళముల వ్యాపించెను. దశదిశలు పిక్కటిల్లెను. రక్కసి నాహ్వానించెను. తాటకికి భయ క్రోధముల నుత్పాదించెను. అంత నా మానుషాదని భైరవస్వనము తోపరుగు లిడుకొండయో యన రాకుమారుల కభిముఖయై వచ్చుచుండెను. ఆ నిశాచరిని గని రాముడు లక్ష్మణా! ఏమి! ఈ భీకరాకారము! అని మందహాసమొనర్చుచు సంభాషించు చుండగనే ఆ నిశాచరి వారల సమీపించెను. అంతలో నా బ్రహ్మర్షి, "స్వస్తిరాఘవయోరస్తు" అనుచు జయధ్వాన ములతో ధైర్యము పురిగొల్పుచుండెను. ముహూర్తకాలము

యుద్ధము జరిగెను. రామలక్ష్మణులు రక్కసి మాయాబల మంతయు నాశ మొనర్చి కాలు సేతులు ఖండించిరి. స్త్రీయను దయచే తాబోలు చంపక శిక్షించుచుండెను. అంతలో గాధి నందనుడు, దాశరథీ! జాలి గొనెదవేల? దుష్టచారిణి యగు తాటకను సంధ్యాకాలము గాక పూర్వము వధింపుమని ఆజ్ఞా పించెను. శ్రీరామచంద్రుడు తాటకను వధించెను. దేవతలు సంతసించిరి. పుష్పవర్షములు గురిసెను. దేవదుందుభులు మ్రోగెను అచ్చరులు నాట్యమాడిరి. రాముని శ్రమబాపు టకో యన చల్లని పిల్ల తెమ్మెరలు మెలమెల్లన వీచెను.

తాటకవధకు దేవతలు సంతసించిరి. విశ్వామిత్రునితో నిట్లనిరి. మునీంద్రా! నీవు అస్త్రశస్త్రములను చక్కగా నెరిగిన వాడవు. భృశాశ్వనందనులు అస్త్రశస్త్రములై నిన్నాశ్ర యించి యున్నారు. లోకసంరక్షణార్థము రామమూరులు చేయ వలసిన కర్తవ్యము లెన్నియో గలవు శరీరబలము కలవా రయ్యు మంత్రమానస బలములు లేనిచో శత్రువుల జయింప జాలరు. ఈతనికి ఆ నస్త్రముల నుపదేశించుటకు పాత్రుడు వేరొకడు లేడు. కాన, దివ్యాస్త్రముల నుపదేశింపుము. అని చెప్పగా విశ్వామిత్రుడు సంతసము రామచంద్రుని కౌగలించు కొని మూర్ధాఘ్రాణము చేసెను ఆరాత్రి వారచ్చట నే కౌశికుని మృదుమధుర వాక్కులచే లాలితులై గడపిరి. ఆ వనము వన లక్ష్మీనివాసమై విరాజిల్లెను.

మరునాటి ప్రభాతమున ముని చే బోధితులై సంధ్యా హ్నికముల నిర్వర్తించిరి. విశ్వామిత్రుని ముందు నిలచిరి.

ముని చిరునవ్వుతో రామచంద్రా! నీ బలపరాక్రమమునకు సంతసించితిని. నీకు దేవదానవ రాక్షస కిన్నర గంధర్వులను సైతము జయించెడి దివ్యాస్త్రముల నొసంగెదనుగైకొమ్ము.

"బ్రూయుస్స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్యమప్యుత"
(భాగవతము)

వినయ ప్రజ్ఞావంతులగు శిష్యులకు గురువులెట్టి రహస్యమైనను చెప్పుదురుగదా! శ్రీరామచంద్రుడు విశ్వామిత్రుడొసంగిన దివ్యాస్త్రముల పొంది గురూత్తమా! మీ కృపచే ఈ దివ్యాస్త్రముల పొందగలిగితిని వీని ఉపసంహారముల కూడ నుపదేశింపుమని ప్రార్థించెను. ముని ఉపదేశించెను. రామునకు దివ్యాస్త్ర దేవతలు ప్రత్యక్షమై ఎదుట నిలచిరి. అంజలులఘటించి మమ్ములనాజ్ఞాపింపుమనిరి. ఆ వీరుడు, నే తలచినప్పుడు ప్రత్యక్షమగుమని యాజ్ఞాపించెను. అనంతరము అస్త్రములన్నియు రాముడు లక్ష్మణునకుపదేశించెను.

మహానుభావులారా? ఇక కథయందలి విశేషము గమనింతము తాటకవధ పఠించినపుడు ధర్మాత్ముడగు రాముడు ప్రథమమున స్త్రీవధ గావించెను గదా! అతడెట్లు ధర్మాత్ముడయ్యెనను ప్రశ్న పాఠకుల హృదయమును కలతపెట్టకమానదు కాని, దోషమెట్లుపుట్టునో? రాముడెవ్వడో? అతనికర్తవ్యమెద్దియో? విచారించుచో సందేహములంతరించును. ఒక వర్ణ మవలంబించ వలసిన ధర్మమును వేరొక వర్ణ మవలంబించినను,తనకు విధింపబడిన ధర్మము తా నాచరింపకపోయినను దోషము పుట్టుచున్నది. ఇక రాముడు రాజవంశమునందు

దుద్భవించిన క్షత్రియ పుంగవుడు. క్షత్రియునకు ప్రజా పాలనము-దుష్టశిక్షణము-విధించబడిన దర్మములు.

శ్లో॥ సంగ్రామేష్వనివర్తిత్వం ప్రజానాం చైవపాలనం.
శుశ్రూషా బ్రాహ్మణానాంచ రాజ్ఞాం శ్రేయస్కరంపరమ్
మనుస్మృతి. 7-అ

కావుననే స్త్రీవధ పాతకము గాదా ? యని విచారించు చున్న రామునకు విశ్వామిత్రు డిట్లు జ్ఞాపించెను.

శ్లో॥ నహితే స్త్రీవధకృతే ఘృణాకార్యా నరోత్తమ
చాతుర్వర్ణ్య హితార్థాయ కర్తవ్యం రాజసూనునా.
రామా - బాలకాండ - స. 6 శ్లో 19

రామచంద్రా! స్త్రీయని శంకించవలదు. చాతుర్వర్ణ్యముల పరిపాలింపవలసిన క్షత్రియు డిట్టి దుష్టస్త్రీల వధించుటే ధర్మము.

రాముడు:- ఎట్టిస్త్రీనైనను వధించుట పాపమేగదా?

విశ్వామిత్రుడు:- పశేషధర్మమునను సరించి పాపము కాదు. ఒకవేళ పాపమైనను క్షత్రియుడు వధించవలసినదే.

శ్లో॥ నృశంస మనృశంసంవా ప్రజారక్షణ కారణాత్
పాతకంవా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా.
రాజ్యభారనియుక్తానా మేషధర్మస్సనాతనః
అధర్మ్యాంజహి కాకుత్స్థ ధర్మోహ్యస్యానవిద్యతే.

రాజ్యభారము నిర్వహించు ప్రభువులు ఒకవేళ పాపము వచ్చినను, ఎవరునింందించినను, నరకము వచ్చినను ప్రజాహితము కొరకు తన ధర్మమగు దుష్టశిక్షణ చేయుటయే సనాతధర్మము,

కావున, ఆర్యులారా! రాముడు తన కర్తవ్యవిధి పుణ్యమిచ్చినను - పాపమిచ్చినను - పుణ్యపాపముల కర్తవ్యము తనయందిడు కొనక - తండ్రియాజ్ఞను, వేదవిదుడగు విశ్వామిత్రునాజ్ఞను శిరసావహించి, తాటకను వధించెను. ఆవిషయమే శ్రీరామ చంద్రుడు తాటకను వధించు సమయమున విశ్వామిత్రునితో నిటు పలికియున్నాడు.

శ్లో॥ అను శిష్టోఽ స్మ్యయోధ్యా యాంగురు మధ్యే మహాత్మనా
పిత్రా దశరథే నాహం నావజ్ఞేయం హి తద్వచః
సోఽహం పితుర్వచశ్శృత్వా శాసనా ద్బ్రహ్మవాదినః
కరిష్యామి నసందే హాస్తాటకావధ ముత్తమం.

తా॥ "వశిష్ఠుడు మొదలగు మహర్షుల సన్నిధానమున నా తండ్రి విశ్వామిత్రుని ఆజ్ఞను పాలింపుమని ఆజ్ఞాపించి యున్నాడు. గాన అతని వాక్యముల వ్యర్థము చేయను. బ్రహ్మవాది యగు విశ్వామిత్రుని ఆజ్ఞ ప్రకారము నిస్సందేహముగా ఈ తాటకను వధించుచున్నాను." అనెను.

పాఠకులారా! ఇందువలన రాజేంద్రుడగు రామచంద్రుడు విధి కర్మఫలములగు పుణ్యపాపముల బాధ్యతను తనయందిడు కొనక తనకు విధించినధర్మమును తాను నెరవేర్పవలయు నని ఆచరణ పూర్వకముగ లోకమున కుపదేశించి యున్నాడు.

దీనినే నిష్కామ కర్మయోగమందురు.

ఇట్లు రామావతారమున ఆచరించిన దానినే కృష్ణావతారమున దుష్టస్త్రీయగు పూతనను వధించి, మోహావృతుడై

తన ధర్మమును వీడి పరధర్మమగు భిక్షాజీవనమునకు పాల్పడిన అర్జునునకు కూడ బోధించియున్నాడు.

శ్లో॥ స్వధర్మ మపిచావేక్ష్య నవికంపితు మర్హసి
ధర్మాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్యనవిద్యతే.
గీత, అ-2-31

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మోభయావహః
గీత, అ 3-35

స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధింలభతే నరః.
గీత, అ 18-45

"స్వభావ నియతంకర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం
సహజం కర్మకౌన్తేయ సదోషమపి నత్యజేత్.
గీత, అ 18.47, 48

అర్జునా! నీస్వధర్మ మాలోచించి యైనను నీవుక్షత్రియ ధర్మమునుండి చలింపరాదు. ధర్మయుద్ధమునకంటె, క్షత్రియునకు శ్రేయస్కరమైనది వేఱొండులభింపదు. పరధర్మమునకంటె విరుద్ధగుణము గలదైనను, స్వధర్మమే మేలు. స్వధర్మమనుష్ఠించుటయందు, చచ్చినను మేలే! పరధర్మము భయకారణము. వాని వాని స్వధర్మములననుష్ఠించుటచేతనే మనుష్యుడు మోక్షమును పొందును. ఇంతియేగాక, విష్ణుపురాణమున పృథు చక్రవర్తి భూదేవిని చంపబూనినపుడు, ఆమె స్త్రీవధ పాపము గదా ? నన్ను చంపుటకు నీవేల ప్రబల ప్రయత్నము చేయుచున్నావన, చక్రవర్తి యిట్లనెను.

శ్లో॥ ఏకస్మిన్ యత్రనిధనం ప్రాపితే దుష్టకారిణీ
బహూనాం భవతిక్షేమః తస్య పుణ్యప్రదోవధః
విష్ణుపురాణం, 1-13-74.

తా॥ చెడునడవడిగలదానా! ఒక్కరిని చంపుటచే పెక్కులకు క్షేమము కలదేని, అట్టి వధవలన పుణ్యము వచ్చును.

ఆ ర్యు లా రా !

ఇట్టి విశేష ప్రమాణము లుండుటచే శ్రీరామచంద్రమూర్తి తాటకను వధించుట దోషముకాదు.

## —♦ యాగరక్షణ ♦—

లోకబాంధవు డుదయించెను. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో పయనమైరి. మార్గమధ్యమున కనుమేర దూరములో మనోహరమగు ఆశ్రమప్రదేశము కాననయ్యెను. ఆ రమణీయ ప్రదేశమునుచూచి రామచంద్రుడు మునిచంద్రు నిట్లు ప్రశ్నించెను. ఈ ప్రదేశము కడుపుణ్య ప్రదమైయున్నది. ఈ పవిత్రమగు వనమందు నివసించు ఋషులెవ్వరు? మీరు యజ్ఞముచేయు ప్రదేశ మిచ్చటి కెంతదూరము? మీ యజ్ఞమును ధ్వంసమొనర్చు అక్కసు లెవరు? మీ యజ్ఞ సంరక్షణ నేనెట్లు చేయువలసియుండును? అన విశ్వామిత్రునకు పూర్వపుత్రివిక్రమావతారము స్మరణకువచ్చినది గాబోలు రామునిజూచి మందహాసము నొనర్చుచు గాధేయు డిట్లనెను. ఇది మహాత్ముడగు వామనుని ఆశ్రమము. పూర్వము విరోచనుని కుమారుడగు బలిచక్రవర్తి ఇంద్రాదుల జయించినవాడై ధర్మ

మార్గమున విష్టంభ కుడై రాజ్యము చేయుచుండెను ఒకప్పుడు బలిచక్రవర్తి దేవేంద్రాదులందరు సేవకులై కొలుచుచుండ లోకములో తన్నెవ్వరు జయింపకుండుటకై యజ్ఞమును ప్రారంభించెను. ఈ వార్త విని దేవతలందరు భయపడి అగ్నిహోత్రుని ముందిడుకొని విష్ణువుతో దీనులై బలిచక్రవర్తి ప్రయత్నమును తెలిపి దేవా! ఆతని యుద్ధమందు జయించుట శక్యముకాదు. ఆ బలి యజ్ఞమునందు దాతయని ప్రసిద్ధినొందెను. నీవు, వామనరూపమున, బలిని యాచించి దేవతలకు కళ్యాణము గూర్పుము" అని ప్రార్థింప శ్రీ మహావిష్ణువు కశ్యపునకు పుత్రుడగుటకు నిశ్చయించెను కశ్యపుడను ప్రజాపతి అదితియను తన భార్యతో గూడి అనేక దివ్యసంవత్సరములు తపంబొనర్చెను ఆయన తపస్సునకు నారాయణుడు మెచ్చి యాతని కోరిక ననుసరించి కశ్యపప్రజాపతికి అదితి గర్భమున పుత్రుడై జన్మించి దేవతల కోర్కె నెరవేర్చెను. ఆ వామనుడు ఇయ్యాశ్రమమున అనేక దివ్యసవత్సరములు తపస్సు చేయుటచే దీనికి వామనాశ్రమమని పేరు ఈ యాశ్రమమందు తపస్సొనర్చిన వారందరు సిద్ధినొందుటచే దీనికి సిద్ధాశ్రమమనియు పేరువచ్చెను.

విశ్వామిత్రుడు తాను యజ్ఞము చేయదలచిన ప్రదేశమీసిద్ధాశ్రమమే యని రామలక్ష్మణులకు చూపెను వారు యజ్ఞదీక్షగైకొమ్మని ఋషిని హెచ్చరించిరి. ఋషి దీక్షితుడాయెను. రాకుమారులు ధనుర్ధారులై అతిజాగరూకతతో మెలగుచుండిరి. ఐదు రాత్రులు గడచినవి. ఆరవరోజు యజ్ఞ

వేది దర్భలతోడను- పుష్పములతోడను- ఋత్విక్కులతోడను- సుగంధద్రవ్యములచేతను-మనోహరముగా ప్రజ్వరిల్లుచుండెను. అంతలో ఆకసమంతయు కారుమబ్బులతో నావరించియుండెను. అందుండి రక్తసావ్రములు వర్షింపసాగిరి. అపవిత్రములగు పదార్థములచే యజ్ఞవేది యంతయు నిండుచుండెను. రాజీవాక్షుడగు రాముడాదృశ్యమును చూచుటచే క్రోధతామ్రాక్షుడై లక్ష్మణా! రమ్ము! చూచితివా! క్రూరస్వభావులగు మారీచసుబాహులు యజ్ఞవేదినంతయు నపవిత్రమొనర్చుచున్నారు. నేనీ రాక్షస వీరులదునుమాడెద. ఇదిగో నీమానవాస్త్రముచే నీదుష్టుల పెనుగాలిచే చెదిరిన మేఘములవలె పటాపంచలు గావించెదనని మానవాస్త్రముచే మారీచుని వక్షస్థలమున కొట్టెను. లక్ష్మణా! చూచితివా? మానవాస్త్రము దయగలదగుటచే మారీచుని మూర్ఛపుచ్చి ఆకసమున పెనుగాలికి నెండు టాకువలె తీసుకొనిపోవుచున్నదని చిరునగవుతో పలికెను.

ఆ యమోఘమగు మానవాస్త్రము మారీచుని నూరామడ గొనిపోయి సముద్రమధ్యమున పారవైచెను. భావికాల కథా నిర్ణయమునకు కాబోలు! మారీచుడు బ్రతికెను. రాముడాగ్నేయాస్త్రము నభిమంత్రించి సుబాహుని వక్షస్థలమున లాగివైచెను. ఆ అంబుతాకునకు సుబాహుడు గ్రుడ్లు మిటకరించి చేయునది లేక ఆకసమూడి పడుచున్నదో యన ప్రేక్షకులు భయభ్రాంతులగుచుండ, భూమిపై బడి ప్రాణములవీడి, కొన్ని క్రోసుల నాక్రమించెను. దేవేంద్రాదులు రామచంద్రు

ని బలపరాక్రమముల కొనియాడిరి. విశ్వామిత్రుడు ప్రాయశ్చిత్తమున యజ్ఞదీక్ష పూర్తిచేసెను. ఆతని యానందము పెల్లుబికెను. విశ్వామిత్రుడు మందహాసమున రామచంద్రా! "సిద్ధాశ్రమమిదం సత్యం" నేడియ్యాశ్రమము సార్థకనామము కలదయ్యెను. అని రామలక్ష్మణుల నభినందించెను.

పాఠకులారా! ఈ యాగరక్షణను గూర్చి తెలుసుకొనవలసిన కొద్ది విషయము కలదు.

లోకాదర్శులగు రామలక్ష్మణులు గురువగు విశ్వామిత్రుని జన్నమును నిర్విఘ్నముగా సమాప్తి యొనర్చి గురుదక్షిణారూపమగు కర్తవ్యమును నెరవేర్చిరి. పై ధర్మమునే శ్రుతియు బోధించు చున్నది.

"ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య
ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" (తైత్తిరీయోపనిషత్తు)

తా॥ ఇంతకాలము నీకువిద్యోపదేశ మొనర్చిన ఆచార్యునకు ప్రియమైన ధనమునొసంగి, సంతానమునకు, విచ్ఛిత్తిని కలుగజేయకుము. అనగా వివాహితుడవై సత్సంతానము పొందుము. ధర్మరక్షణయే కదా! గురువులకు ప్రియమగు ధనము.

మఱియు భగవత్స్వరూపుడగు శ్రీరాముడు తన ప్రతిన నెరవేర్చుకొనెను. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అను గీతా వాక్యాను సారము దుష్టశిక్షణయు, సాధు రక్షణయు సలిపినాడని తేలుచున్నది.

## మిథిలా ప్రయాణము — కుశవంశ కథనము

విశ్వామిత్రుని జన్నము పూర్తియయ్యెను. ప్రియ శిష్యులగు రామలక్ష్మణులు నిర్వర్తించిన యజ్ఞపరిసమాప్తికి విశ్వామిత్రుడు సంతసించి వారలకు ప్రత్యుపకార మొనర్పనెంచెను. ఇంతలో సిద్ధాశ్రమ నివాసులగు మునులు విశ్వామిత్రుని పురస్కరించుకొని రామునితో నిట్లు నుడివిరి. మిథిలానగరాధిపతియగు జనక మహారాజు యజ్ఞమును చేయ సమకట్టెను. మేమందరము జన్నమునకు జనుచున్నారము. అచ్చట నద్భుతమగు ధనురత్నమొకటి కలదు. అది దేవలచే నివ్వబడినది. దానిని రాజు నిత్యమును గంధపుష్పాదులచే పూజించుచుండును. ఆ ధనుశ్శ్రేష్ఠమును ఎక్కుపెట్టజాలక దేవ దానవ గంధర్వులెందరో విఫలులైరి. బలపరాక్రమ సంపన్నులగు రాజపుత్రులెందరో దానిని కదల్పజాలక పోయిరి. అన. విశ్వామిత్ర మహర్షి రామలక్ష్మణులతో మిథిలకు ప్రయాణ సన్నద్ధుడాయెను. బ్రహ్మనిష్ఠులగు మునిశ్రేష్ఠులును బండ్లపై తమ తమ హోమాగ్నులనుంచి, పయనమైరి. విశ్వామిత్రుడు సిద్ధాశ్రమమునకు ప్రదక్షిణమొనర్చి వనదేవతలారా! మీకు శుభమగుగాత! యని, పయనమాయెను. సిద్ధాశ్రమ మందలి మృగపక్షి సమూహములు మహామునియగు విశ్వామిత్రుని ననుసరించి పోజొచ్చెను. ఇట్లు ప్రేమవాత్సల్యముచే వెన్నంటి వచ్చు మృగపక్షిగణముల జూచి మహాత్ముడగు విశ్వామిత్రుడతి ప్రీతితో వానిని బుజ్జగించి ఆశ్రమమునకు మరల్చెను. ఆహా! అహింసావ్రతమహిమ! అంత వారందరు పయనమై

శోణానదీ తీరమున విడిసిరి. అంతలో దినకరు డస్తాద్రి చేరెను. మునీశ్వరులును రామలక్ష్మణులును విధివిధానమున సాంధ్య కృత్యములదీర్చి అగ్నికార్యముల నిర్వర్తించిరి. పిమ్మట సస్య సమృద్ధమై అతిమనోహరమగు నీదేశ మెవ్వరిదని రాముడు విశ్వామిత్రుని ప్రశ్నింప నాతడిట్లనెను.

పూర్వము బ్రహ్మమానస పుత్రుడును అఖండ తపః ప్రభావుండును ధర్మవ్రతుడును అగు కుశుడను నొక మహాత్ముడు కలడు. ఇతడు విదర్భాధీశు కుమార్తెను పెండ్లియాడెను. ఈ పుణ్యదంపతులకు, కుశాంబుడు; కుశనాభుడు; అధూర్త రజసుడు, వసువు, అను నల్వురు కుమారులు గలరు. అందు పెద్దవాడగు కుశాంబుడు కౌశాంబి యను పట్టణమును రాజధానిగా జేసికొనియు, రెండవవాడగు కుశనాభుడు మహోదయ మనుపత్తనమును రాజధానిగా జేసికొనియు, అధూర్త రజసుడను మూడవవాడు ధర్మారణ్యమును పట్టణముగా జేసికొనియు, వసువను నాల్గవవాడు మగధదేశమున గిరి వ్రజమును ముఖ్యపట్టణముగా జేసికొనియు, ప్రజలు తమను కొనియాడ రాజ్యమేలిరి. రామచంద్రా! ఈ గిరివ్రజము మగధదేశమునకు ముఖ్యపత్తనము. అల్లదే కానుపించు కొండలైదును, యీ గిరివ్రజపత్తనమును చుట్టుముట్టి కోట గోడలవలె దీనిని రక్షించుచున్నవి. ఈ శోణనదము మగధ దేశమునుండి బయలువెడలి యీ పర్వతముల మధ్యగా సూత్రమువలె ప్రవహింప నీగిరివ్రజ రాజ్యలక్ష్మి కంఠమందలి ముత్యాల హారమో యన ప్రకాశించుచుండును. ఇక పెద్ద

వాడగు కుశనాభుడు ఘృతాచియను అచ్చరయందు నూర్గురు పుత్రికలం బడసెను. వారికి యౌవనము సంప్రాప్తమయ్యెను. జగన్మోహన రూపిణులగు నా జవ్వనులుద్యానవనమున మధురముగ గానమొనర్చుచు విహరింప జొచ్చిరి. కారుమబ్బునందలి తొలకరి మెరుపులవలె, ఉద్యానవనమున విహరించుచున్న నా లతాతన్వుల రూప యౌవన సౌందర్యములచూచి, సర్వవ్యాపియగు వాయువు వారలతో నిట్లనెను. సుందరులారా! మిమ్ములజూచి మదనునిచే ప్రేరేపింపబడితిని. మనుష్యుల యౌవనము చంచలమైనది. కాన మీకు నక్షయమగు యౌవనమును దేవత్వమును యిచ్చెదను. నాకోర్కె నెరవేర్పుడు. అన నా కన్యలావాక్యము లాలకించి పరిహాసముగ, పవమానుడా! మమ్ముల కుశనాభ పుత్రికల మని యెరుగవు కాబోలు! ఇప్పుడే నీకు శాపమొసంగి స్థానభ్రష్టుని చేయగలము. ఐనను మా తపో మహత్వముల రక్షించు కొనుటయే మా కర్తవ్యము. నీవు చరాచరములను పవిత్రము చేయువాడవు గదా! ఇట్లు చెడుగు దోసగు మాటలు పలుకుటన్యాయమూ! మాతండ్రి ఇష్టప్రకారము స్వయంవరమున వివాహమాడుము.

శ్లో॥ పితాహి ప్రభు రస్మాకం దైవతం పరమం హి సః।
యస్య నోదాస్యతి పితా సనో భర్తా భవిష్యతి॥

తా॥ "కన్యకలమైన మాకు ప్రభువు తండ్రియే. మమ్ములను మా తండ్రి యెవ్వరికిచ్చునో ఆతడే మాభర్త." ఆ వాక్యముల విని వాయువు క్రోధోద్రేకమున కన్యకలయందు ప్రవేశించి వారిని కుబ్జలగా జేసెను. ఆకన్యకలు లజ్జా పరవశులై

జరిగినదంత వివరముగ విన్నవించిరి. కుశనాభుడును దీనికై పుత్రికలఁజూచి కన్యకలారా! మీరు చేసిన కార్యము కడు శ్లాఘనీయమైనది. మనుష్యులకు దేవసుఖాభిలాషకడు నధికముగనుండును. మీరుమానుష స్వభావులై పవమానునిచే వరింపబడియు కామమునకు వశులుగాక నిండు జవ్వనమున కామమును జయింప గలిగితిరిగదా! ఇంతియగాదు. వాయువు మిమ్ముల శపించినను, శాపదగ్ధులయ్యును, కొంతయైనను క్రోధము వహింపక యీపిన్న వయసునందే క్రోధమునుగూడ జయించితిరిగదా! ఆహా! నాభాగ్యము! నావంశము పవిత్రమయ్యెను. ధన్యుడనైతిని. పుత్రికలారా!

శ్లో॥ "అలంకారో హి నారీణాం క్షమాతు పురుషస్య వా.
... ... ... ... ..."
"క్షమాదానం క్షమాయజ్ఞః క్షమాసత్యం హి పుత్రికాః
క్షమాయశః క్షమాధర్మః క్షమయావిష్ఠితం జగత్."

తా॥ "క్షమయే దానము, క్షమయే సత్యము, క్షమయే యశస్సు, క్షమయేధర్మము. క్షమయందే యీ ప్రపంచమంతయు నాధారపడి యున్నది.

పాఠకులారా! ఈ క్షమాధ్వరమునందే గదా! ప్రస్తుతము మహాత్ముడు దీక్షితుడై యుండెను.

అని ఇట్లు తన ముద్దుపట్టిలను రాజు సమాధానపరచి కొలువుదీర్చి మంత్రులతో కుబ్జాకారముల నొందిన నా పుత్రికలకు తగిన వరుడెవ్వడని యోచించుచుండెను. ఆ

కాలమున ఊర్ధ్వరేతస్కుడగు చూళి యను నొక తపస్వి గలడు. సోమద యను నొక గంధర్వకన్య భక్తి వినయములతో నాతని శుశ్రూష చేయుచుండెను. ఇట్లు కొన్ని సంవత్సరములు గడచెను. ముని యామె శుశ్రూషకు సంతసించి వరము వేడుమనెను. అంత నా గంధర్వ స్త్రీ మహాత్మా! నాకు నీ తపోమహిమచే సంతాన మనుగ్రహింపుమని ప్రార్థించెను. ఋషియు ఆమె యభీష్టానుసారముగా బ్రహ్మదత్తుడను కుమారు ననుగ్రహించెను. కుశనాభుడు బ్రహ్మదత్తుని పిల్చి తన నూర్గురు కుమార్తెలనిచ్చి వివాహ మొనర్చెను. వివాహ కాలమున పవిత్రస్వరూపుడగు బ్రహ్మదత్తుడు కుశనాభ పుత్రికల కెంగేలు దాకగనే యా పుత్రికలందరు వికారరూపముల వదలి మనోహరములైన సుందరాకారముల గ్రహించిరి. అంత కుశనాభుడు పరమానంద భరితుడై * కుమార్తెలను అల్లుని వెంట సాగనంపెను.

అనంతరము కుశనాభుడు పుత్రార్థియై జన్న మొనర్చెను. ఆ యజ్ఞమున కుశనాభుని మూలపురుషుడగు కుశుడు ప్రత్యక్షమై నీకు గాధియను పుత్రుడు జన్మించగలడని వరమిచ్చి అంతర్ధానము నొందెను. కుశనాభుడు కొంతకాలమునకు గాధియను పుత్రుని బడసెను. ఈతడు నిర్మల కీర్తి సంపన్నుడు రామచంద్రా! ఆ గాధియే నా తండ్రి. నేను కుశవంశ సంభూతుడనై కౌశికుడనని వ్యవహరింపబడుచున్నాను.

---

* ఈ కన్యకలుండిన ప్రదేశమునకే కన్యాకుబ్జమని పేరు. ఇప్పుడు దీనిని "కనోజ్" అందురు.

మరియు నాకు సత్యవతి అనుపేరుగల భగిని (అక్క) గలదు. ఈమె భర్త ఋచీకుడు. ఈమెసశరీరముగ భర్తననుస రించి స్వర్గమునకేగి లోకోద్ధరణకై నదీస్వరూపిణియై హిమవ త్ప్రాంతమున కౌశికి అను నామముతో పుణ్యసలిలయై ప్రవ హించుచున్నది. నేను నియమముతో నీ కౌశికీనదీ ప్రాంత మున కొంతకాలము దివ్య తపమొనర్చితిని. తదుపరి సిద్ధాశ్ర మమున ప్రవేశించి నీ తేజః ప్రభావముచే సిద్ధుడనైతిని. అని తన వంశవృత్తాంతమంతయు రామలక్ష్మణులకు మునీశ్వరులకు నుడివెను. ఇంతలో అర్ధరాత్రి ఆసన్నమాయెను. వృక్షములు నిద్రవోయినవోయన ఆకులసైతము కదల్చక నిలచియుండెను. మృగ పక్షి గణములు సంచారము మానివైచెను. జీవుల యాహ్లాదమునకో యన జాబిల్లి ఆకసమున కానవచ్చెను. ఋషీశ్వరులు విశ్వామిత్రుని వంశచరిత్ర కచ్చెరువడి మేలు మేలని విశ్వామిత్రుని పొగడిరి. కుశవంశ సంభూతులు ధర్మ పరాయణులనిరి. ఆవల అందరు నిద్రించిరి.

## — సగరాశ్వమేధము — గంగావతరణము —

పూర్వకాలమున అయోధ్యానగరమున పరాక్రమ వంతుడును, సత్కార్య నిరతుడును, ధర్మాత్ముడు నగు సగరు డను నొక చక్రవర్తి గలడు. ఆతనికి కేశిని, సుమతి అను నిద్దరు భార్యలు గలరు. ధర్మాత్ములగు నా రాజదంపతులకు సంతానము లేకపోవుటచే సంతాపము చెందుచుండిరి. అందుచే నారాజు భృగుప్రస్రవణ మను పర్వతప్రాంతమున నూరు దివ్య

సంవత్సరములు తపస్సు చేయగా భృగుమహర్షి ఆతనికి ప్రత్యక్షమై నీకేమి కావలయునో కోరుకొమ్మనెను అందుల కారాజు సంతసించి, యానంద బాష్పముల గ్రమ్మ దేర నా దేవదేవుని అనేకవిధముల స్తోత్రముచేసి వంశవర్ధనులగు పుత్రులవేడెను. భృగువు సంతసించి యారాజునకు రెండు వరము లిచ్చెను. రాజా! నీకు పెక్కుమంది పుత్రులుదయింతురు. నీ యశస్సు లోకమందంతటను వ్యాపించును. నీ యిద్దరి భార్యలలో వంశవర్ధనుడగు కుమారుడొక్కడు పుట్టును. అరువదివేల పుత్రులు మరియొక భార్యకు పుట్టుదురు. అని పలుకు నామాటలు రాజపత్నులు విని మునిచంద్రమా! మాలో నెవరికొక కొడుకు పుట్టును? నూరువేల పుత్రులెవరికి పుట్టుదురు? అని ప్రశ్నింప నా మునీంద్రుడు మీ కోరిక పరికారమగునని చెప్పి యంతర్ధాన మాయెను. రాజపత్నులిద్దరు గర్భముల ధరించిరి. నవ మాసములు నిండిన తరువాత పెద్దభార్యయగు కేశినికి వంశవర్ధనుడగు నొక కుమారుడు జన్మించెను. వీని పేరు అసమంజసుడు, గరుత్మంతుని చెల్లెలగు సుమతికి గ్రుడ్డువంటి యొక పిండము పుట్టెను. * దానిని బ్రద్దలుచేసుకొని అరువదివేల మంది బిడ్డలు పుట్టిరి. ఈ పిల్లల నందరను దాదులొక్కొక్క నేతికుండయందుంచి చాల కాలము పోషించిరి.

వీరు కొంతకాలమునకు ప్రాప్తయౌవనులై రూపరేఖా విలాసము కలవారైరి. పెద్దభార్య కుమారుడగు అసమంజసుడు ఊరిలోని పిల్లల నందరను నీట పారవైచి యొడ్డున నిలచి

* గాంధారి గర్భమందు జన్మించిన గర్భపిండము నిట్టిదే.

యానందించుచు దుష్టుడై ప్రవర్తింప సాగెను. అసమంజసుని ప్రవర్తనము అసమంజసముగనే యుండెను. ఊరిలోని వారందరు భయపడి ఈసదాచారము రాజున కెరింగించిరి. తండ్రియు పుత్రుని దుండగములు సహింపనోపక ప్రజాతత్పరుడగు నా రాజు పాపాత్ముడగు నీ యసమంజసుని పుత్రప్రేమనైతము విడనాడి, యడవులకు వెడలగొట్టించెను. సుగుణసంపత్తిగల పుత్రులుగదా లోకమునకొనియాడబడి వంశోద్ధారకులగుదురు!

ఆ యసమంజసుని కొడుకు అంశుమంతుడు. ఇతడు మంచి బుద్ధికలవాడై సర్వప్రజలకు మేలుగూర్చుచుండెను. ఇట్లుండగా సగరచక్రవర్తి అశ్వమేధము చేయ సంకల్పించి వింధ్యహిమవత్పర్వతముల మధ్యప్రదేశమున కావలసిన పదార్థములన్నియు సమకూర్చెను. ఆయశ్వమేధమునందు తన పెద్ద కుమారుని పుత్రుడగు నంశుమంతుని అశ్వరక్షణకై నియోగించెను. ఈతడస్త్రశస్త్రములం దారితేరినవాడగుటచే సేనాధిపతియై కడు నిపుణముగా నరువదివేల పినతండ్రులతో కార్యమును నిర్వహించుచుండెను. కొంతకాలమిట్లు జరుగగా ఇంద్రుడు మాయారూపమును ధరించి యజ్ఞాశ్వము నపహరించెను. దానబుత్విక్కులందరు సగరునితో నిట్లనిరి. మహారాజా! బలపరాక్రమ సంపన్నుడవగు, నీయజ్ఞాశ్వమును క్రూరులెవ్వరో నపహరించిరి, దీనిచే నీకును నీయజ్ఞమునందు పాల్గొనిన మాయందరకును కీడు సంభవించును. అందుచే నీ యశ్వము నెవరపహరించిరో వారిని సంహరించి యశ్వము మరల్చుకొని వచ్చి యజ్ఞమును పూర్తియొనర్పుము. ఋత్విక్కులిట్లుపలుకగా

ముల్లోకములు జయింపగల సగరుడు తన అరువదివేల పుత్రులతో నిట్లనెను.

పుత్రులారా! ఋత్విక్కులు మంత్రపూతమగు యజ్ఞము ప్రవర్తింప జేయుచుండ దుర్మార్గు డెవ్వడో యజ్ఞహయము నపహరించుకొనిపోయెను. కావున మీరందరును సముద్రము వరకు గల భూమినంతయు త్రవ్వివేయుడు. మీరొక్కరు ఒక్కొక్క ఆమడ చొప్పున వెదకుడు. యజ్ఞహయము దొరకు నంతవరకు మరలి రాకూడదు. ఆలస్యము చేయకుడు. దీక్షితుడ నగు నేను ఈ ఋత్విక్కులతోడను మనుమడగు నంశుమంతునితోడను, తురగ దర్శనముగువరకు వేచియుందును. పోయిరండు.ఇదినాయాజ్ఞ. అన వారందరు రాజాజ్ఞ ననుసరించి సంతోషముతో బయలుదేరిరి. ఒక్కొక్కరొక్కొక్క యామడ చొప్పున భూమినంతయు వజ్రాయుధమువంటి గోళ్ళతోడను, భయంకరములగు శూలములతోడను నాగళ్ళతోడను పగుల గొట్టిరి. అట్టితరి భూమియందు క్రూరసర్పములు, మాయావు లగు రాక్షసుల నెందరినో వారు సంహరించిరి. ఇందుచే సహింపరాని ధ్వని యుద్భవించెను. అరువదివేల మందియు అరువది వేలామడలు పాతాళమువరకు త్రవ్విరి. ఈ ప్రకారముగా సగరపుత్రులు భూమినంతయు చిందరవందరగా గుల్లమునకై ధైర్యస్థైర్యములతో త్రవ్వుచుండగా దేవదానవులందరు దిగులు వడి ధైర్యమును వీడి అందరును ఏకమై బ్రహ్మకడకేగి తత్తర పాటుతో నిట్లనిరి. "ఓ దేవదేవా ! సగరపుత్రులు కర్రలను

ధరించి మెఱకలన్నియు పల్లములుగను పల్లములన్నియు మెర కలగను జేయుచున్నారు.

పాతాళమువరకు గల భూమినంతయుం బెళ్ళగించి పాడుచేయుచున్నారు. "వీడే యజ్ఞాశ్వమునపహరించెను. వీడే యజ్ఞాశ్వమును దాచెను." అని భూతములనన్నిటిని హింసించుచున్నారు. మాకేదైన నుపాయంబు చెప్పి యీ బాధనుండి మమ్ము రక్షింపవే అని ప్రార్థింపగా బ్రహ్మ వారల యార్తాలాపముల విని ఓ దేవతలారా! ఈ నవద్వీపములతో గూడిన భూమియంతయు, కపిలరూపము ధరించిన శ్రీ మహా విష్ణువుదై యున్నది. ఆ పరమ పూజ్యుడగు కపిలుడీ భూభార మంతయు భరించి యుండును. అతని క్రోపాగ్నిచే నీ సగర పుత్రులు ధ్వంసము కాగలరు. ప్రతి కల్పమందును భూమి యిట్లే త్రవ్వబడుచుండును. దీనికై మీరేల విచారించెదరు? అల్పాయువు గల సగరపుత్రులు స్వల్పకాలములోనే నాశనము కాగలరని చెప్ప దేవతలందరు సంతసించి తమ తమ స్థానముల కరిగిరి. సగరపుత్రులు భూమినంతయు తుత్తునియలుగావించిరి. కాని, యజ్ఞాశ్వము కానుపించలేదు. తుట్టతుదకు వారందరు విఫల మనోరథులై దీనముగ ఒకచో చేరి భయపడుచు తండ్రి కడకేతెంచి యిట్లనిరి. ఓతండ్రీ! మీ యాజ్ఞానుసారముగ భూమినంతయు త్రవ్వితిమి. దేవదానవ పిశాచోరగముల నందరను సామ దాన భేద దండోపాయములచే నశ్వము నపహరించిన దొంగ ఎవరో తెలియునా యని యడిగితిమి. అనేకాశ్వముల చూచితిమి. కాని యజ్ఞాశ్వము కానరాలేదు. అశ్వాపహర్తయు తెలియబడలేదు. ఏమి చేయగలము? అన నా రాజసత్తముడు

పుత్రుల వాక్యములు విని రోషముతో ఏమీ ! కార్యమును సాధింపక తిరిగి వచ్చితిరా ! పొండు, మరల భూమినంతయు భేదింపుడు. దుష్టుడగు అశ్వహర్తనుపట్టి అశ్వమును గ్రహించి కృతకృత్యులు కండు. అంతదనుక ఇటకు రాజనదు, అన రాజ పుత్రులు మరల భూమిని త్రవ్వ నారంభించిరి. అందు భూభార మును వహించి తూర్పుననున్న విరూపాక్షమను దిగ్గజము వారికి కానుపించెను, రామచంద్రా ! ఈ దిగ్గజము ప్రతి పర్వ సమయమందును, భూభారముచే శిరస్సును కదిలించును. అందుచే భూమికంపించును అంత వారా దిగ్గజమునకు ప్రదక్షిణ మొనర్చి మరల దక్షిణ భూభాగమును త్రవ్వ అందు మహా పద్మమను దిగ్గజమును, పశ్చిమ భూభాగము భేదింపగా నందు సౌమనసమను మహాదిగ్గజమును, నుత్తరభాగమును త్రవ్వగా నందు తెల్లనికాంతితో ప్రకాశించు భద్రగజమును చూచి ప్రద క్షిణ నమస్కారములు సల్పినవారై అశ్వమును కానక క్రోధావేశ పూరితులై భూమినంతయు బొబ్బలిడుచు భేదిం చుచు పాతాళమునకుం జనిరి. అందు వారలకు మహాత్ముడును, అనాది పురుషుడును, వాసుదేవుడు నగు కపిల మహర్షి కాను పించెను. ఆ కపిలమహర్షి సమీపమున యజ్ఞాశ్వము మేయుచు తిరుగుచుండెను. ఆ యశ్వమును చూచి సగరపుత్రు లొక్కు మ్మడి సంతోషాంబుధి నోలలాడిరి. అశ్వము నపహరించినదీ మునీశ్వరుడేయని నిర్ణయించి క్రోధావేశ పూరితులై పారలును పలుగులను పట్టుకొని కొందరును, శిలావృక్షముల బట్టుకొని మరికొందరును, తాము చేయుపనులను వదలి వాయువేగ

మనోవేగముతో మాయజ్ఞాశ్వమును దొంగిలించినది నీవా ? దొంగవై తాపసరూపమును ధరించితివా ? నిలునిలుమని కపిల మహర్షిని కేకలువేయుచు నాతని హత మొనర్చుటకై రివ్వున పరువెత్తుకొని వచ్చి యాతనిపైఁ బడబోయిరి. అంత కపిల మహర్షి వారినిచూచి క్రోధముతో హుంకరించెను. మహాత్ము డగు నాకపిలుని యమోఘ హుంకారముచే అరువదివేల సగర పుత్రులు భస్మరాసులై పడిరి.

ఇట సగరుడు పుత్రులు చాలకాలమైనను తిరిగి యింటికి రాకుండుటచే వ్యాకులిత చిత్తుడై తేజోవంతుడగు తన మను మనితో నిట్లనెను. అంశుమంతా ! యజ్ఞాశ్వమును తెచ్చుటకై నీ పినతండ్రులందరు పోయి చాల కాలమైనది. వారేలకో యింతదనుక వచ్చినవారుగారు. నీవు శూరుడవు. అస్త్రశస్త్రాది విద్యలయందు కడునిపుణుడవు. కాన నీ పినతండ్రు లెచట నున్నారో-యజ్ఞాశ్వమెందున్నదో- నీ తండ్రులు పోయినజాడ బట్టి గుర్తెరింగి కార్యమును సాధించుటకై కోదండమును గ్రహింపుము. రణవీరుడవై శత్రువుల ఖండింపుము. పురుష సింహుడవై విజయలక్ష్మిని చేపట్టుము. అంశుమంతునిచే సగరుడు యజ్ఞమును నిర్వర్తింప గలిగెనను యశశ్చంద్రికల దేశమంతయు ప్రసరింపజేయుము. వంశగౌరవమునునిల్పి దేశీయు లకు మార్గదర్శివిగమ్ము. నీవలన నే నీ కార్యము నిర్వర్తించిన వాడ నగుదును.

కాని, నీ కొక రహస్యమును చెప్పెదను. నీకు విఘ్న మొనర్చెడి క్రూరులను సంహరింపుము. పూజ్యులగు వారికి

వందన మొనర్పుము. ఈ విషయము బాగుగా జ్ఞప్తియందుంచు కొనుము. నీకు శుభమగుగాక ! పోయిరమ్ము.

అన మహాసత్వుడగు నంశుమంతుడు ధనుర్ధరుడై వీరాతి వీరుడై బయలుదేరి తన పినతండ్రులు భూమిని త్రవ్విన మార్గమునుబట్టి పోవుచు క్రూరజంతువులను సంహరించుచు సాధువులకు వందనమొనర్చుచు,తూర్పున దిగ్గజము నొకదానిని చూచెను. దానికి ప్రదక్షిణము సలిపి వందనమొనర్చి, ఓ దిగ్గజమా! మా యజ్ఞాశ్వముజాడ - పిన్నతండ్రులస్థితి- నీకేమైన తెలియునా ? అని ప్రశ్నించెను. సూర్యవంశ సంభూతుడగు నాయంశుమంతుని వాక్యములు విని యాదిగ్గజము ఓ రాజపుత్రా ! నీవు శీఘ్ర కాలములో యజ్ఞాశ్వమును గైకొని సుఖముగా నింటికి చేర గలవు. అని పల్కె నా శుభప్రదమగు వాక్యముల విని యంశుమంతుడు భూమినంతయు పెకలించి కనబడిన దిగ్గజముల కెల్ల ప్రదక్షిణ నమస్కారముల సలిపి తన పినతండ్రులు పడియున్న భస్మరాసుల కడకేతెంచెను. సమీపమున తిరుగుచున్న యజ్ఞాశ్వమును చూచినవాడై దుఃఖించుచు - విలపించుచు- ఎట్టకేలకు శోకమును దిగమ్రింగి మృతులైన పినతండ్రుల కందరకు ఉదకదానముల నిర్వర్తించుటకై తిరిగి తిరిగి ఎచ్చటను జలాశయము గానక విచారించుచుండగా నాతనికి గరుత్మంతుడు కానుపించి "ఓ పురుషసింహమా ! విచారింపకుము. వారు అప్రమేయుడగు కపిల మహర్షి కోపాగ్నిచే దగ్ధమై పోయిరి. అట్లు ఋషిచే దగ్ధమైన నీ పినతండ్రులకు పవిత్రమగు గంగా జలమున ఉదకదానము చేసినచో వారందరికి నూర్ధ్వలోక

ములు సంప్రాప్తమగును. కాని, హేయమగుచెరువునీటిచే జల
దానమొసంగిననేమి ప్రయోజనము ?

శ్లో॥ గంగా హిమవతో జ్యేష్ఠాదుహితా పురుషర్షభ !
తస్యాంకురు మహాబాహో పితౄణాంతు జలక్రియాం
భస్మరాశీ కృతా నేతాః ప్లావయే ల్లోక పావనీ
త్వయాక్లిన్నమిదం భస్మగంగయాలోక కాంతయా
షష్టిం పుత్రసహస్రాణి స్వర్గలోకం నయిష్యతి.

బాలకాండ, అ, 41. శ్లో. 20.

కావున హిమవంతుని పెద్దకుమార్తెయగు గంగను తెచ్చి యా జలముచే, మృతులైన నీపితృదేవతల భస్మరాసుల మీాదుగా, లోకపావనియగు గంగను ప్రవహింపజేసితివేని మృతులైన నీ అరువదివేల పినతండ్రులు, నరకబాధలేక, శాశ్వత సుఖము ననుభవించుచు, నెల్లపుడు స్వర్గమునందుండెదరు. అందుచే, కుమారా ! నీవట్లు చేయుము. శీఘ్రముగా యజ్ఞాశ్వమును గైకొని, తాతగారి యజ్ఞము నిర్విఘ్నముగా పరిసమాప్తి యొనర్పుము. అన నంశుమంతుడు యజ్ఞాశ్వమును గైకొని పైతామహుడగు సగరునికడకేతెంచెను. దీక్షితుడగు నాతనికి పిన్నతండ్రుల మరణంబును, సుపర్ణుడు పలికిన యితివృత్తమంతయు తేటతెల్లముగ బోధింపగా, సగరుడు పుత్రుల మరణంబునకు దుఃఖించుచూ, కల్పవిధిగా యజ్ఞమును పరిసమాప్తిగావించి తన పట్టణమగు నయోధ్యకు జని గంగను స్వర్గలోకమునుండి భూలోకమునకెట్లు తెత్తునా యని విచారిం

చుచు, నేమియును తెలియనివాడై యసమర్థుడై యాలోచన తోనే ముప్పదివేల సంవత్సరములు రాజ్యమేలి స్వర్గస్థుడాయెను.

సగరుడు కాలధర్మము నొందగా ప్రజలందరు ధర్మాత్ము డగు అంశుమంతుని రాజుగ గోరిరి. అంశుమంతుడు కొంత కాలము రాజ్యమేలెను. ఈతనికి దిలీపుడను కుమారుడు కలిగెను. అంశుమంతుడు తన రాజ్యమున దిలీపునుంచి తాను హిమవ చ్ఛిఖరమున ముప్పదిరెండువేల దివ్యసంవత్సరములు తప మాచరించి గంగాజలముచే పితృదేవతల స్వర్గస్థుల జేయ జాలకనె స్వర్గమున కరిగెను. ఆ పిమ్మట మహాసత్వుడగు దిలీ పుడును అనేక యాగములుచేసి ముప్పదివేల సంవత్సరములు రాజ్యమును పరిపాలించి భగీరథుడను తన పుత్రుని రాజుగా జేసి దివంగతుడాయెను. ధార్మికుడగు భగీరథుడును ప్రజా కాముడై సంతానములేనివాడయ్యును గంగను తెచ్చుటయందు బద్ధకంకణుడై గోకర్ణమునందు ఊర్ధ్వబాహుడై జితేంద్రియు డై అనేక దివ్యసహస్ర వర్షములు ఘోర తపమాచరించెను. తపమొనర్చుచున్న భగీరథునకు బ్రహ్మ ప్రత్యక్షమై కుమారా! భగీరథా! లెమ్ము. తపస్సునకు మెచ్చితిని. సువ్రతుడా! నీకేమి కావలయునో కోరుకొనుము. అన మహాభాగుడగు భగీ రథుడు అంజలిమోడ్చి-దేవా! నా తపమునకు సంతసించితివేని. నా తపము ఫలించెనేని-కపిలమహర్షి హుంకారముచే బూడిద రాసులైన నా పితరుల స్వర్గప్రాప్తికై భస్మరాసుల మీదుగా గంగప్రవహించు నట్లనుగ్రహింపుము. మరియు నిక్ష్వాకుకుల మంతరించకుండునట్లు నాకువంశవర్ధనుడగు పుత్రుని దయ

చేయుము. అన లోకపితామహుడు మహాతేజా! భగీరథా! నీవు కోరినట్లే యగుగాక! ఈ హిమవంతుని పెద్ద కుమార్తెయగు గంగను భరించుట కీశ్వరునియోగింపుము. గంగ స్వర్గలోకము నుండి భూలోకమునకు వచ్చుతరి యావేగమును భూమి సహింపజాలదు. గంగా ప్రవాహవేగమును భరించుటకు శూలియే తగిన సమర్థుడు, అని గంగనుచూచి "సాధ్వీ! యీసుప్రతుని కోర్కెదీర్చుటకై నీవు భూలోకమునకుబొమ్ము" అని గంగ నాజ్ఞాపించి బ్రహ్మ మరుద్గణములతో నదృశ్యుడాయెను.

బ్రహ్మదేవుని యాజ్ఞానుసారము భగీరథుడు దృఢవ్రతమూని నిరాలంబుడై బొటనవ్రేలిపై నిలచి వాయుభక్షకుడై రాయివలె చలింపక దివారాత్రములు నిశ్చలభక్తితో వత్సర కాలము శంకరునిగూర్చి ఘోరతపమొనర్చెను. లోకపూజ్యుడగు నుమాపతి భగీరథునకు ప్రత్యక్షమై రాజా! నీతపమునకు సంతసించితిని. గంగను నాశిరమున ధరించెదననివర మొసంగెను. భగీరథునిప్రార్థనానుసారము ఆకాశమునుండి గంగ గర్వాతిశయముతో దుస్సహమగు రూపమును దాల్చి ప్రవాహ జవముచే శంకరునిగదిసి ముంచి తీసుకొనిపోయి చూపరు లెల్ల రాశ్చర్యపడునట్లు పాతాళమున బడద్రోసెదగాక! యని మహా రూపమును ధరించి దుస్సహమగు వేగముతో శంకరుని శిరస్సుపై బడబోగా శివుడు గంగ బిగువెరింగి తన శిరమునుండి ఒక్క బిందువునైనను క్రిందకు దిగజారకుండునటుల సంకల్పించెను. అంత పుణ్యసలిలయగు గంగ రుద్రునిశిరమునబడి హిమవత్పర్వత గుహలబోలు నాతని జటామండలమునజొచ్చి కదల

మెదలజాలక మోహితయై యుండెనిలచిపోయెను. అహంకార మెట్టివారినైనను కూలద్రోయునుగదా!

ఇట్లు గంగ శివజటా జూటమున ప్రవేశించి ఎంతకాలమైనను రాకపోవుటచే భగీరథుడు శంకరునిగూర్చి మరలఘోరమగు తపమాచరించెను. ఔరా! ఏమి! భగీరథుని కార్యదీక్ష!

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచుఁ ధృత్యున్నతో త్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.
"భర్తృహరి."

తా॥ అధములు విఘ్నములుకలుగుననుభయముచేత గార్యమునే యారంభింపరు. మధ్యములు కార్యమును ప్రారంభింతురు గాని, నడుమ విఘ్నములు కలిగెనేని దానినివి డిచిపెట్టుదురు. ధైర్యశీలాది యుత్తమగుణములు గల ధీరులు ప్రారంభించిన కార్యమును విఘ్నములు మాటిమాటికి కలిగినను విడిచిపెట్టరు. దీనికేకాబోలు! భగీరథ ప్రయత్నమందురు.

శంకరుడు భగీరథుని తపస్సునకు మెచ్చి తనజడల గుంపులోనుండి కొంచెముగా బిందు సరోవరమందు వదలెను. అందుండి హ్లాదిని, పావని, నళిని యను నదులు తూర్పుదిక్కుకు మూడుపాయలై ప్రవహించెను. సుచక్షువు, సీత, సింధు, అను నదులు మూడుపాయలు పడమరగాపారెను. ఏడవపాయ

శివజటాజూటమునుండి బయలువడి నర్తకియోయన ప్రవహించుచు కారుమబ్బునందలి మెరుగుదీగవలె మెరయుచు, జలచరాభరణములతో భూరంగస్థలమున నృత్యముచేయ జగన్మోహనాకారిణియై భగీరథునివెంట పోసాగెను. అట్టియెడ జగన్మోహినియగు ఆ గంగవిలాసవిభ్రమభ్రమణ నటనాచాతుర్యము చూచుటకై యక్ష దానవ కింపురుషాదులు గజతురగారూఢులై కొందరును, చిత్రవిచిత్ర విమానారూఢులై మరికొందరును చూచుచుండిరి. వారి ముఖములు చంద్రబింబములవలె విరాజిల్ల వారియాభరణములు నక్షత్రములవలె ప్రకాశించెను. ఋషీశ్వరు లాశ్చర్యచకితులైరి. మానవులు ప్రళయభీతి నొందుచుండిరి. అవ్వల నాసతి జలచరాభరణములదాల్చి మోహనాకారిణియై భూరంగ స్థలమున నిలిచిన నర్తకినాకాననయ్యెను. కోమలమగు నామె ముఖపద్మమందు నవరస భరితములగు నాట్యచిహ్నములు ఉట్టిపడుచుండెను. అంత నాతన్వి ప్రేక్షకులపై పుష్పాంజలి జల్లినదో యన సలిల పీడనముచే జలచరములు పైకెగురజొచ్చెను. అవ్వల నాలతాతన్వి నాట్యము చేయుచుండ జలచరములు మెరుపుతీగలవలె ప్రకాశింపదొడగెను. నీటియొరిపిడిచే నలుప్రక్కల చెదరిన నురుగుల జూడ ఒకచో నాసాధ్వి కామరూపధారిణివలెను, మరొకచో నాకసమున బారులు దీర్చి సంచరించు హంస సమూహములవలెను వేరొకచో చెదరిన శరత్కాల మేఘమాలల వలెను, సంచరింపజొచ్చెను. పల్లపు నేల యున్నపుడు ధూర్త స్త్రీవలె పరుగులిడును. సముద్రప్రదేశముల నల్లనల్లన గంభీర

ముగా పతివ్రతవలె నడచును. ఒకచో విటుని వంచింప కామ శాస్త్ర ప్రవీణురాలగు వేశ్యాంగనవలె సంచరించును. నాట్య కళయందు ప్రేక్షక హృదయముల నాకర్షించినదో యన,మిట్టల నాక్రమించి పై బారి యాటకత్తియవలె గంతులిడుచు త్రొక్కులాడును.

అంతలో బలిసిన పిరుదులు గలదానివలె విశాలమై మెల్లమెల్లగా నడచును. ఒకచో చిక్కిననడుముకలదానివలె శూన్యముగా కానుపించి అతివేగముగా పరువులెత్తును. గుం టలోబడి నీళ్ళరాపిడిచే పెన్నిధిగన్న పేదచందమున మిడిసి పడుచుండును. అంతలో కుటిల గమనయై సంచరించును. ఇట్లా గంగా ప్రవాహ విలాససుందరి, తరంగ డోలికల నూగులాడ సర్వజన మనోభిరామయై వెల్లివిరిసెను. అంత నా గంగ పుణ్య సలిలయై స్నానార్థులకు పుణ్యమొసంగుచు చూపరుల డెందమున కానందమును గూర్చెను. ఆ పుణ్యప్రవాహముగని, దేవాదులు సైతము సంతసించిరి. ఇట్లాకాశగంగ పదభ్రష్టురాలై నడుమ నాగక భగీరథుని రథమార్గము ననుసరించెను. దేవదానవ యక్ష కిన్నరులు శివుని శిరస్సునుండిబడిన గంగాజలము పవిత్ర మైనదని సంతసించి గంగవెంబడి పోవుచుండిరి. అంతనా గంగభగీరథుని వెంటబోవుచు మార్గమధ్యమున జహ్ను మహర్షి యజ్ఞవాటికను ప్రవాహమున ముంచెను. జహ్ను మహర్షి గంగ గర్వమునణపనెంచి ప్రవాహమును పానము చేసెను. ఏమి! తపః ప్రభావము! దానిజూచి వెంబడి వచ్చు చున్న మునీంద్రులు లోనగు మహాత్ములు "ఓ ఋషిసత్తమా!

యీగంగ నీకు కూతురను ప్రఖ్యాతివహించును. లోకక్షేమము నకై ఈమె నొదలిపెట్టుము.” అని ప్రార్థించిరి. వారి మాటల కా ఋషి సంతోషించి శ్రవణములద్వారా చూపరు లచ్చెరు వడ గంగను వెలుపలకు వదలెను. జహ్ను మహర్షి చెవులలో నుండి వెడలివచ్చిన దగుటచే గంగ జాహ్నవి యను పేర ప్రసిద్ధిగాంచెను. అవల గంగ భగీరథుని వెంటపోయి సముద్ర మున ప్రవేశించి యాతని కోరిక దీర్చుటకు పాతాళలోకము నకు పోయెను. భగీరథుడు భస్మరాసులై పడియున్న పితరుల దుస్థితి చూచి దీనవదనుడై గతులులేక పడియున్న బూడిద కుప్పలపై గంగానదిని ప్రవహింపచేసెను. అంత భగీరథునకు బ్రహ్మ ప్రత్యక్షమై రాజేంద్రా ! సగరుని యరువదివేల కుమా రులు పిశాచత్వమును వీడి భువర్లోకమువదలి స్వర్గలోకమునకు పోయి దేవత్వమును పొందినవారైరి. ఎంతదనుక సముద్రము లందు జలముండునో అంతవరకు వారు స్వర్గమందే నివసించి యుందురు. భూలోకమునందు గంగాదేవి నీ కూతురను పేరు గలదై యాచంద్ర తారకము ప్రఖ్యాతివడసి భగీరథియను పేరు ప్రసిద్ధి కెక్కును. ఈ దేవనది, గంగయనియు, త్రిపథగ యనియు భాగీరథియనియు మూడు పేర్లుగలదగును. మూడు మార్గము లుగ ప్రవహించుటచే దీనికి త్రిపథగ యను పేరు సార్థక మయ్యెను. నీ తాతలు చేయలేనిపనిని నీవు సాధించినవాడ వైతివి. నీ కీర్తి లోకమున నిలచియుండుగాక! మృతులైన నీ పితృదేవతల కందరకు నుదక దానములొసంగి యథాప్రకార ముగా రాజ్యపరిపాలన మొనర్పుము. అని పితామహుడు దేవ

గణములతోడ సంతర్పితుడాయెను. భగీరథుడును బ్రహ్మదేవుని యాజ్ఞానుసారముగ గంగయందు స్నానమొనర్చి శుచియై పితరులకు నివాపాంజలు లొసంగి తన రాజ్యమునకు బోయి యథాప్రకారము రాజ్యసంపద పూనగా ప్రజలందరు ధర్మాత్ముడగు రాజు మరల లభించెగదా యని మనోవేదన విడిచి సంతోష చిత్తులై యుండ రాజ్యసుఖముల ననుభవించెను. రామచంద్రా! గంగా చరిత్రమునంతయు నా మూలాగ్రముగ నీకు తెలిపితిని. నీకు శుభమగుగాక! సంధ్యాకాల మతిక్రమించు చున్నది. ఈ రాత్రి యిచ్చట నివసింతము.

శ్లో॥ ఇదమాఖ్యా న మవ్యగ్రోగంగావతరణం శుభం
యశ్శృణోతిచ కాకుత్స్థ సర్వాన్ కామా నవాప్నుయాత్
సర్వేపాపాః ప్రణశ్యన్తి ఆయుః కీర్తిశ్చ వర్థతే.

ఈ ఉపాఖ్యానము నిర్మలమగు మనస్సుతో విన్నవారికి చిత్తైకాగ్రత కలుగును. అన శ్రీరామచంద్రుడు విని మహర్షీ! మీ యనుగ్రహమున గంగా వృత్తాంతము మొదలగు పుణ్యకథలవింటిని. సాధుసంసర్గము గంగవలె మానవుని పవిత్రమొనర్చునుగదా! అని యూరకుండెను.

పాఠకులారా! ఋషి రామలక్ష్మణులకు బోధించిన సగర వృత్తాంతము– గంగావతరణము – అను కథలవలన రఘువంశస్థుల వీరత్వము, భగీరథ వృత్తాంతమువలన కార్యదీక్షా తత్పరతయు, లోకమునకు ప్రబోధింపబడెను. స్వరాజ్యవిషయమున మహాత్మని కార్యదీక్షయేకదా! ఈనాటికి పాశ్చాత్త్యుల క్షోభింపజేయుచున్నది. భారతవీరాగ్రేసరు లందరు తమ ఉపాధ్యా

యులవలన పూర్వుల వీరగాథల దెలిసికొని ధర్మరతులై వీరు లైరి. భావిభారతభాగ్యోదయముకొఱకు వీరపురుషులను వీరవనితలగూడ గనిరి. శివాజీ తల్లిప్రబోధముచేతనే వీరుడై భరత మాతృదాస్యమును తొలగించినాడు. అట్లు మహాద్భుత వీర్య సంపన్నులగు శ్రీరాముడు శ్రీకృష్ణుడు, అర్జునుడు, అభిమన్యుడు, మొదలుగాగల వీరులెందరో ఈ భారతమాతను వీరమాత నొనర్చిరిగదా! అట్టి మహనీయుల చిత్రపటములను గృహములందుంచక పాశ్చాత్య ప్రతిమలను భారతీయులు పడకటింట్లలో సైతము అలంకరింప జేయుచున్నారు. సిగ్గు! సిగ్గు!

## —♦ విశాలానగర వృత్తాంతము ♦—

మరునాడు రామలక్ష్మణులు విశ్వామిత్రునితో గంగ దాటి యుత్తర భాగమున దిగిరి. కనుమేరదూరములో వారికి స్వర్గమువలె అతిమనోహరమగు విశాలానగరము కానవచ్చుచుండెను. శ్రీరామచంద్రుడా నగరసౌందర్యమునుచూచి విశ్వామిత్రునిట్లుప్రశ్నించెను.

ఆర్యా! ఈ నగరమునుపాలించు రాజెవడు? ఆతడేవంశమున జన్మించెను? పురాతనమయ్యు అతిసుందరమగు నీనగర వృత్తాంతమునుగూర్చి వినవలెనను కౌతూహలము జనించుచున్నది. అన విశ్వామిత్రుడు ప్రేమతో రాకుమారులచూచి రామచంద్రా! వినుము. పూర్వము కృతయుగమునందు రాక్షసులును దేవతలును ఏకమైజరామరణవ్యాధులు లేకుండ హాయిగా నిత్యానంద సుఖముగోరినవారై దానికెద్దియూ యుపాయంబని

పెద్దకాలమాలోచించిరి. అంతవారు పాలసముద్రమును చిలికితి మేనియందు నమృతముపుట్టును. దానిని ద్రావినచో ముసలితన మును చావును లేక సుఖముగా నుండవచ్చునని నిశ్చయించి, మందరపర్వతమును కవ్వముగాను, వాసుకియనుపామునుచిలికెడి త్రాడుగాను, నిర్మించి పాలసముద్రమును మధించుచుండిరి. వేయిసంవత్సరములు గడచెను. ఆ రాపిడి సహింపలేక వాసుకి విషజ్వాలలు గ్రక్కజొచ్చెను. ఆయుష్ణమువలన మంద రము బీటలువారి పగులుచుండెను. కొంత కాలమునకు సము ద్రమునుండి ప్రళయాగ్ని సంకాశమగు కాలకూటమహావిషము బయలుదేరి దేవతలను రాక్షసులను నాశనముజేయుటయేగాక సర్వజగత్తును విలయమొందింపజొచ్చెను. అంత నాహాలా హలాగ్ని తాపమునకాగలేక యీ విపత్తునుండి కాపాడమని దేవతలు శంకరుని మిగులభక్తితో ప్రార్థించిరి. వారిభక్తికి మెచ్చి శంకరుడు దేవాదులకు ప్రత్యక్షమై కాలకూటమహావిషమును అమృత ప్రాయముగా పుచ్చుకొని తనకంఠమందుంచెను. నాట గ్రోలె శంకరుడు గరళకంఠుడను పేరప్రఖ్యాతి వడసెను. శంకరుడు విషమును మ్రింగిపోయెను. అంతవారు మరల మథనమునకు పూనుకొనిరి. కొండయె సముద్రమునందు నిము గెను. దేవాదులు విష్ణువును సమీపించి, దేవా!

శ్లో॥ "త్వంగతి స్సర్వభూతానాం విశేషేణ దివౌకసాం
పాలయాస్మాన్ మహాబాహో! గిరి ముద్ధర్తు మర్హసి."

సర్వభూతములకు నీవే శరణ్యుడవు. అందును దేవా దులపాలిటి కల్పవృక్షమవు. మందర పర్వతము నీటిలోమునుగు

చున్నది. దానిని పైకెత్తుటకు నీవుతప్ప వేరొకరు సమర్థులు గారు. కాన నో దేవా! మందరపర్వతమును మునుగకుండునటుల చేయుము. దీనులగు మమ్ము పరిపాలింపుము.

అన శ్రీ మహావిష్ణువు ఆశ్రితరక్షకుడుగాన కరుణించి బ్రహ్మాండాధి పతియగు నమ్మహాభాగుడు దేవతలలో నొకడై మందర శిఖరమును నొకచేతితో బట్టుకొని పర్వతముక్రింద తాను కూర్మమై నిలచి భక్తుల యభిప్రాయము నెరవేర్చుటకై స్వయముగ మందరమును చిలికెను. నిర్విడతెగక వారు వేయి సంవత్సరములు చిలుకగా కమండల ధరుండై, దేవాదుల కందరకును, వైద్యుడగు ధన్వంతరి యుద్భవించెను. కొంత కాలమునకు సారము జనించెను. అందుండి సుందరులగు అప్స రస స్త్రీలు జన్మించిరి. అప్పుల (నీటి)నుండి వచ్చిన రసము నందుపుట్టినవారు కాన వీరప్సరసలైరి. వీరి సంఖ్య అరువది కోట్లు. వీరి పరిచారిక లెందరో గలరు. వీరిని లెక్కించ నెవరి వశము ? వీరలను కార్యదీక్షా తత్పరులగు దేవతలుగాని, రాక్షసులుగాని గ్రహింపరైరి. కావున వీరందరు పురుషుల యందు సమభావము కలిగి సంచరించిరి. ఇందు వరుణుని కుమార్తెయగు వారుణి (సురయనునామె) రాక్షసులను గ్రహిం పుడని ప్రార్థింపగా వారు గ్రహింపలేదు. ఆమె దేవతలను ప్రార్థింప గా వారు సంతోషముతో గ్రహించిరి. నాటినుండి సురను గ్రహింపని కారణముచే దైత్యులు అసురులనబడిరి. సురను గ్రహించుటచే దేవతలు సురులని పిలువబడు చుండిరి. ఆవల నుచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును, కౌస్తుభంబను రత్నమును

పుట్టెను. ఉచ్చైశ్శ్రవమును ఇంద్రుడుగ్రహించెను. కౌస్తుభమును మహావిష్ణువు మెడయందు ధరించెను. తుట్టతుదకు అమృతము పుట్టెను. రాక్షసులీ యమృతమును దేవతలకివ్వక తామేయపహరింపవలెనని తలచిరి. దీనిచే దేవదానవులకు ఘోరయుద్ధము సంప్రాప్తమయ్యెను.

అంత విష్ణువు దేవతలపక్షము వహించి మోహినీ రూపము ధరించి రెండుపక్షముల వారికిని సమభాగములుగ నమృతము పంచియిచ్చెదనని తెల్పి వారిని శాంతపఱచి మాయాప్రభావమున నమృతమును దేవతలకిచ్చివైచెను. దేవతలును నమృతమును ద్రావినవారగుటచే జరామరణములు లేనివారైరి. అట్టి దేవాదుల నందఱను సైనికులుగా నుంచుకొని యింద్రుడు రాక్షసుల వధించెను.

అట్లు దేవతలచే నసురులు మడసిరి. దానవులకు తల్లియగు దితి దుఃఖముచే సంకటము జెందుచు భర్తయగు కశ్యపునిజేరి నాథా! పుత్రశోకముచే దుఃఖించుచున్నాను. ఇంద్రుని జయింపగల కుమారుని నాకనుగ్రహింపుమని ప్రార్థించెను. కశ్యపుడు దేవీ! చింతింపకుము. వేయి సంవత్సరములు నియమముగా శుచివై విఘ్నము లేక తపమాచరింపుము. ఇంద్రుని జయింపగల శూరుడు నీ కుదయింప గలడని ప్రేమపూర్వకముగ పలికెను. ఆవాక్యముల విని దితి పరమానంద భరితయై కుశప్లవ * మను క్షేత్రమున ఇంద్రుని జయించు శూరు డుద్భవించుటకై దీర్ఘతప మాచరింపజొచ్చెను. అట్టితఱి ఇంద్రు

* "కుశప్లవము" విశాలా నగరమునకు పూర్వమున్న తపోవనము.

డామెకు భక్తివినయములతో నుపచారములు చేయుచుండెను. పది సంవత్సరములు తక్కువగా వేయిసంవత్సరములు గడచెను. దితి తన సవతి పుత్రుడగు ఇంద్రునిసేవకు సంతసించి పూర్వవైరమును మరచినదికాబోలు! అందుచే ఇంద్రునితో నీ తండ్రి నాయందు కరుణించి వేయివత్సరములు శుచివై విఘ్నములు లేక తపంబొనర్చినచో ముల్లోకముల జయింపగల కుమారు డుద్భవించునని యనుగ్రహించెను. తండ్రిచెప్పిన వేయివత్సరములకు పది సంవత్సరములు మిగిలియున్నవి. ఈ పది సంవత్సరములు గడచిన నీముద్దుతమ్ముని చూడగలవు.

ఆ మాటలు విని ఇంద్రుడు భయపడి తన్ను జయించు శత్రువునెట్లు జంపుదునాయని సమయమునకై వేచి యుండెను.

ఒకతరి దితి మధ్యాహ్నకాలమున నెండకు బడలి, దేహముమరచి శయ్యపై పాదస్థానమునశిరమును, శిరస్థానమున పాదమునుంచి యశుచియై నిద్రింపజొచ్చెను. సమయమునకై వేచియున్న యింద్రుడు సంతసించి; వ్రతదీక్షమరచి పగలు నిద్రించుచున్న దితిగర్భమందు ప్రవేశించి, వజ్రాయుధముచే నాపిండమును నేడుభాగములుగ ఖండించెను. లోనున్న పిండము యేడ్వసాగెను. * మారుద! మారుద! (ఏడ్వకుము-ఏడ్వకుము)అని ఇంద్రుడు ఖండించుచుండెను. ఇంతలో దితి-రోదన ధ్వనికి మేల్కాంచి, "చంపకు చంపకు"మని విలపించెను.తల్లిమాటయందలి గౌరవముచే నాఖండములను ఖండింపక వెలుపలికివచ్చి తల్లి కాళ్ళపైబడి, తల్లీ! నన్ను రక్షింపుము. వ్రతదీక్షలోనున్న

* "మారుద - మారుద" - అనుటచే వారు మరుద్గణమని వ్యవహరింపబడిరి

నీవు అశుచివై విపరీతముగా పరుంటివి. మరియు, పగటి వేళ పరుంటివి. కాన నీవశుచివైనసమయమెరిగి గర్భమున ప్రవేశించి ఆత్మసంరక్షణార్థము పిండమును భేదించితిని; దీన నాదోషమేమున్నది? కావున నన్ను క్షమించి కాపాడుము. అన నా దితి తన గర్భము నేడుతునకలుగా నరుకబడెనని తెలిసి కొని తనముందు నిలచియున్న నింద్రునిచూచి ఇంద్రా! నీ వలన దోషములేదు. దోషమంతయు నాపైనుండ నిన్ననేల? నీపై నాకు కోపమేల? కాని నీచే ఖండింపబడిన నేడుఖండములు దేవరూపులై ప్రఖ్యాతనామములతో వాయుమండలమున సంచరించునట్లు చేయుము.

ఇదియేనాకోరిక. అన తల్లియాజ్ఞానుసారము నాస ప్త మరుత్తులను ఖండములుగానొనర్చి వైకమత్యమువహించి సుఖముగ నింద్రుడు స్వర్గరాజ్యమేలుకొనుచుండెను. ఇది సప్తమరుత్తుల యుపాఖ్యానము, ఈ పవిత్రస్థలమున దితి తప మాచరింప ఇంద్రుడుడామెకు సపర్య యొనర్చెనుదాన ఇంద్రుడు తనయభీష్టమును నెరవేర్చుకొనెను. కొంతకాలము గడవగా ఇక్ష్వాకుపుత్రుడైన విశాలుడనురాజు ఈ దేశమును నిర్మించెను. అందుచే యీ నగరము విశాలానగరమని ప్రసిద్ధి వడసెను. ఇప్పుడీ దేశమును 'సుమతి' పరిపాలించుచున్నాడు. అని చెప్పుచుండ, విశ్వామిత్రురాక నెరిగి సుమతి వారినాహ్వా నింప నచ్చటికేతెంచెను. సుమతిచేపూజితులై రామలక్ష్మణులు విశ్వామిత్రుడును ఆరాత్రి నచ్చటనే గడిపిరి.

పాఠకులారా! సప్తమరుదుపాఖ్యానము పఠించినపుడు ఇంద్రుడు చేసిన దితి గర్భచ్ఛేదము అను దురంతము పాఠకుల మనస్సులను కలతపెట్టకమానదు. లోకములో ధర్మము రెండు విధములుగా నున్నది. 1 సామాన్యధర్మము, 2 విశేష ధర్మము. సామాన్యధర్మము అబద్ధమాడకుము; ధర్మాచరణ చేయుము; అని సర్వసామాన్యముగా విధించుట.

విశేషధర్మమనగా—

శ్లో॥ వృద్ధాచమాతా పితరౌ భార్యా సాధ్వీ సుత శ్శిశుః
అప్యకార్య శతంకృత్వా భర్తవ్యామనురబ్రవీత్॥.

"వృద్ధులైన తలిదండ్రులు - సత్ప్రవర్తనగలభార్య - బాల్యావస్థయందున్నకుమారుడు, వీరిని నూరుతప్పులొనర్చి యైనను పోషింపవలయు" నని మనుస్మృతి తెల్పుచున్నది. ఇయ్యది విశేషధర్మము.

పైనచెప్పిన సామాన్యధర్మము సర్వులకాచరణీయ మైనను వారివారి అధికారతారతమ్యమునుబట్టి విశేషధర్మ ముల ప్రవర్తింప జేయవలసి యుండును. వ్యక్తిధర్మము వేరు. సంఘధర్మము వేరు. క్షత్రియజాతికి విధించబడిన ధర్మము వేరు. రాజ్యమేలు రాజు ధర్మము వేరు. అందును చక్రవర్తి ధర్మము వేరు. ఇట్లే వారివారి వృత్తాంతముల ననుసరించి ధర్మములు విలక్షణములై యున్నవి. ఈ విశేషధర్మము ప్రజలు స్థూల దృష్టితో చూచుతరి అధర్మముగా కానుపించినను సూక్ష్మ బుద్ధితో విచారించినచో లోకోపకారముకొరకేర్పరుపబడిన

వని స్పష్టమగును. ఇచట ఇంద్రుడు దితి గర్భమును ఏడు భాగ ములుగా ఖండించెనని గదా! పఠించియుంటిమి. దీనిని స్థూల ముగా విచారించిన దోషమువలె కాన్పించును. ఇంద్రుడుత్రిలో కాధిపతి; నియామకుడు. కాన, హింసకూడ దనునది సామాన్య ధర్మమైనను సూక్ష్మదృష్టితో పరికించిన విశేషధర్మము ననుస రించి లోకోపకారముకొరకు ఒకే స్వరూపముగల వాయువును యేడు విధములుగ విభజింపవలసి వచ్చెను. ఒకవేళ ఇంద్రు డొనర్చినపని పాపమనియే పాఠకులు నిశ్చయించు పక్షమున నరకమునకైనను పాల్పడి లోకకళ్యాణమును కోరు తేజోవంతు లవసరమేగదా! ఒకప్పుడు జగద్గురువులలో నొకరగు రామా నుజాచార్యులవారి గురువుగారు శిష్యుని శుశ్రూషకు సంత సించి ఏకాంత స్థలమునకు గొనిపోయి "నే నుపదేశము చేయ బోవు మంత్రమును యితరుల కెవరికిని నీ వుపదేశము చేయ గూడదని పలువిధముల శపథము జేయించుకొని అష్టాక్షరీ మంత్రముపదేశించెను.

కొంతకాలమునకు రామానుజాచార్యులు గుర్వాజ్ఞ నొని శ్రీరంగమునకు వెళ్ళి ఆ నగరమందలి ఆలయ గోపుర మెక్కి ఆ నగరవాసులనెల్ల యాహ్వానముచేసి గురూపదిష్ట మంత్రరహస్యములనెల్ల బోధించెను. ఈసంగతి గోష్ఠీపూర్ణులు (గురువుగారు) విని యతిశేఖరుని రావించి రామానుజా! గుర్వాజ్ఞోల్లంఘన మొనర్చినవారికేగతి?" యని యడుగగా ఉడయవరులు స్వామీ! అట్టివారికి నరకమేగతి యని విన్న వించిరి. ఇట్లుండ నీవీ పాపకార్యము నేల చేసితివి? అని యడు

గగా గురువర్యా ! గుర్వాజ్ఞ నతిక్రమించుటచేత నేనొక్కడనే నరకమునకు పాత్రుండనై నను మంత్రప్రభావముచే జీవులందరు నుజ్జీవించుదురను అభిప్రాయముతో నేనట్లొనర్చితినని విన్నవించిరి. అట్లే, ప్రస్తుతమున ఇంద్రుడు తనకు శిశుహత్యవలన పాపము సంభవించినను దితిగర్భము నేడు ఖండములొనర్చి లోకోపకారమునకై వాయుమండలముల నేర్పరచెను.

శ్లో॥ ఆవహః ప్రవహశ్చైవ సంవహశ్చోద్వహ స్తథా
వివహాఖ్యః పరివహః పరావహ ఇతిక్రమాత్
సప్తైతే మారుత స్కంధా మహర్షిభి రుదాహృతాః॥
ఆవహోవర్తయెద్వాయు ర్మేఘోల్కావృష్టి విద్యుతః.
వర్తయె త్ప్రవహశ్చైవ తథా మార్తాండ మండలమ్
సంవహోమారుత స్కంధ స్తథా శీతాంశు మండలమ్.
వర్తయెదుద్వహాశ్చాపి తథా నక్షత్రమండలమ్
పంచమో వివహాఖ్యశ్చ తథైవగ్రహామండలమ్
సప్తర్షిమండలం స్వర్గం గాం వష్ఠః పరివహ స్తథా
పరావహ స్తథా వాయుర్వ ర్తయె ద్ధ్రువమండలమ్.

సప్తమరుత్తులపేర్లు......

తా॥ ఆవహుడు, ప్రవహుడు, సంవహుడు, ఉద్వహుడు, వివహుడు, పరివహుడు, పరావహుడు; వీరుండు స్కంధములకు మారుతస్కంధములనిపేరు. ఈసప్తమరుత్తులలో (1) ఆవహుడు. ఆవహామను గాలి. మేఘములు, ఆకాశముందుండిపడు కొరవులు, వర్షము, పిడుగులు, వీనియందు

వర్తించును (2) ప్రవహమనువాయువు సూర్యమండలము నందుండును. (3) సంవహమనువాయువు చంద్రమండల మందుండును. (4) ఉద్వహ వాయువు నక్షత్రమండలమందు వర్తించును. (5) వివహవాయువు గ్రహమండలమున వర్తించును. (6) పరివహవాయువు సప్తర్షిమండలము నందును, స్వర్గమందును, భూమియందును, ఉండును. (7) పరావహవాయువు ధ్రువమండలమున వర్తించును.

శ్లో॥ గగన స్పర్శనోవాయు రనిలశ్చ తథా పరః
ప్రాణః ప్రాణేశ్వరోజీవ ఇత్యేతే సప్తమారుతాః

తా॥ గగనము, స్పర్శనము, వాయువు, అనిలుడు, ప్రాణము, ప్రాణేశ్వరుడు, జీవుడు-అని కూడ సప్తమారుతుల పేర్లు గలవు.

విశేషధర్మము నాదర్శముగగొని ఇంద్రుడు పైనుదహరించిన లోకోపకారము నొనర్చియున్నాడు. ఈ విశేష ధర్మమునే రాజై, రాజ్యపాలనజేసి, కష్టసుఖముల ననుభవించి, త్యాగియై, యోగియై, బ్రహ్మర్షిగా మారిన విశ్వామిత్రుడు మనువంశజుడును, ప్రజల పరిపాలింపవలసిన ధర్మస్వరూపుడగు రాముని పురోభివృద్ధికి యీకథా రూపమున బోధించెను రామునకు బోధించిన కథలన్నియు ఒక్కొక్క విశేషధర్మమును బోధించుట కేర్పడినవే. సామాన్య ధర్మముల కన్న విశేషధర్మమునే ఎక్కువ ప్రబోధించుట శాస్త్రహృదయము. అన్నము తినవలెనని ప్రతివారికిని తెలుసును. కాని,

పాసిన అన్నమును తిన్నచో అజీర్ణముగలుగునను సంగతి శాస్త్రముచే బోధింపబడవలెను. అన్నముతిన్న బలమని తెలియును. జ్వరము వచ్చినపుడు తినినయడల దోషము. (ప్రాణహాని) అని శాస్త్రము బోధింపవలయును.

## అహల్యా శాపమోక్షము

ఉదయమున రామలక్ష్మణులు విశ్వామిత్రుని ప్రబోధముచే మేల్కాంచి సంధ్యాకృత్యముల నిర్వర్తించిరి. ఆవల మునీశ్వరులతో వారు మిథిలానగరమునకు పయనమైరి. కనుమేర దూరములో వారికి మిథిలానగరము కానవచ్చుచుండెను. వారందరామిథిలానగర సౌందర్యమున కచ్చెరువొందుచుండిరి. అంత వారలకుసమీపముననె మిథిలకు కొలదిదూరములో నిర్జనమయ్యును కడురమ్యముగానుండి పురాతనమగు నాశ్రమ మొకటి కానవచ్చుచుండెను. రామచంద్రు డా యాశ్రమ సౌందర్యమున కచ్చెరువడి విశ్వామిత్రు నిట్లు ప్రశ్నించెను. ఆర్యా! ఈ యాశ్రమమెవ్వరిది? సౌందర్య లక్ష్మికి స్థానమయ్యు ఇందు మునీశ్వరులెవ్వరు నివసింపకుండుటకు కారణమేమి? మునీంద్రా! తాము సర్వజ్ఞులరు కాన సెలవిండన కౌశికుడిట్లనెను.

రామచంద్రా! తొల్లి బ్రహ్మతన శిల్పకళాచాతుర్యముచే త్రిలోకసుందరియగు, నొక కన్యకను సృష్టించెను ఆమెపేరహల్య. ఆమెను తపోవిరాజితుడగు గౌతమ మహర్షి వివాహమాడెను, ఆ మహర్షి తన భార్యతోగూడి ఇయ్యాశ్రమమున

పెక్కుసంవత్సరములు దివ్య తపమాచరించెను. అట్టియెడ నొక నాడు ఇంద్రుడు అహల్యారూప విలాసముల కచ్చెరువడి గౌతమ వేషధారియై ఆమునియాశ్రమమున లేనియెడ నహల్యతో నిట్లనెను. సుందరీ! నీ యమానుష తనుసౌందర్యమున కచ్చెరు వడి నీతోడి భోగలాలసుడనై తిని. కాముకులగువారు ఋతు కాలమును ప్రతీక్షింపజాలరుగదా! కాన నా కోరిక నెర వేర్పుము. అన నా జవ్వని దేవరాజని యెరింగి * దుస్స్వభావయై ఇంద్రుని యభీష్టమును నెరవేర్చెను. అంత నా విలాసిని.

శ్లో॥ "కృతార్థాస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్రమితః ప్రభో!
ఆత్మానం మాంచ దేవేశ సర్వదారక్ష మానద".

సురేంద్రా! నేను ధన్యురాలనైతిని. నాపతికి విషయము తెలిసిన మనప్రాణముపైకి వచ్చును. గాన, శీఘ్రముగా జనుము. ఇటనుండ జనదు. మనల నిద్దరనెల్లపుడు రక్షించుభారము నీయదియ. వేగజనుము. ఆ మాటలవినిఇంద్రుడు చిరునవ్వు ముఖమున చిందులాడ "తన్వీ! నీసపర్యకు చాల సంతసించి తిని. ఇదె బోవుచున్నా"నని పర్ణశాలదాటి భయసంభ్ర మాశ్చర్యసంశయములతో పోజొచ్చెను. అప్పుడే స్నాన విధులాచరించి సమిధలను-దర్భలను-గైకొని గౌతముడు తిరిగి వచ్చుచుండ తన వేషమును ధరించిన గౌతముడెదురాయెను. ఋషి మనము సందేహాంబుధి నోలలాడెను. యథార్థమంతయు తన దివ్యప్రభావముచే నెరింగెను. దుర్మార్గుడగు నింద్రుడు

* "మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన,
మతిం చకారదుర్మేధా దేవరాజ కుతూహలాత్", అని మూలము.

సల్పిన దుండగమునకు రోషావేశ పూరితుడాయెను. "ఓరీ! దుర్మతీ! నారూపమును ధరించి నాసతి గవసితివా? అధర్మ మని యెరుగవా? మూర్ఖుడా! వెంటనే దీనికి తగిన ఫలము ననుభవింపుము. నీ వృషణములు తెగిపడుగాక!"

అని ఇంద్రుని శపించి అహల్యను జూచి క్రోధముతో నిట్లు శపించెను.

శ్లో॥ ఇహావర్ష సహస్రాణి బహూనిత్వం నివత్స్యసి
వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేస్మిన్నివత్స్యసి॥
యదాచైతద్వనం ఘోరం రామోదశరథాత్మజః
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదాపూతా భవిష్యసి
తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహవివర్జితా
మత్సకాశే ముదా యుక్తా స్వంవపుర్ధారయిష్యసి॥

తా॥ ఓసీ! అనేక సంవత్సరములు ఆహారమువదలి గాలి పీల్చుచు భస్మశాయినివై తపించుచు నేభూతములకు కానరాక యీయాశ్రమములోనే పడియుండుము. ఎప్పుడు దశరథపుత్రుడైన రామచంద్రుడీ యాశ్రమమునకు వచ్చునో ఆనాడు నీవు వ్యభిచారదోషమునువీడి పవిత్రురాల వయ్యెదవు. ఆయన కాతిథ్యమొసంగి, పూజించి లోభమోహముల వదలి,నీ వెప్పటి సుందరదేహమును ధరించి, సంతోషముతో నన్ను పొందగలవు. అని దుష్టచారిణి యగు భార్యనుగూడ శపించి గౌతమ మహాముని సిద్ధమునిసేవితమగు హిమవచ్ఛిఖరమందు తపమాచరింపజనెను.

ఇట్ల ఇంద్రుడు వృషణహీనుడై తన పరాభవమును దేవతలతో నిట్లు విన్నవించెను. దేవతలారా! నేను దేవకార్యార్థమై గౌతమమహర్షి తపోవిఘ్నమొనర్పనేగి యాయన క్రోధాగ్నికి లోనైతిని. దేవకార్యమును నిర్వర్తింపబోయిన నాకీస్థితి సంభవించెను. మరల నాకు వృషణములు వచ్చు నుపాయము జేయుడు. వ్యభిచారవర్తనులిట్లే తమ దోసగుల గప్పిపుచ్చుచుందురుకాబోలు! ఇంద్రునిమాటలువిని పితృదేవతలు మేక బీజములు ఇంద్రునకు జోడించిరి. ఆ దినమునుండి దేవాదులు బీజహీనములగుమేకలనే భుజించి యజ్ఞకర్తలకు యజ్ఞఫలము నీయసాగిరి.

అని విశ్వామిత్రుడు నుడువ రామలక్ష్మణులు ఆఋషితో గౌతమాశ్రమమును ప్రవేశించిరి. అంత వారలకు దేదీప్యమానమగుతనుకాంతి కనులమిరుమిట్లుగొలిపెను. ఆతనులావణ్యము గంధర్వాప్సరస్త్రీలలో లేదా యను సంశయము పొడసూపెను. సృష్టికర్త అపూర్వ ప్రయత్నముచే లావణ్యమును చేర్చి - కూర్చి - మాయస్వరూపిణిని - సృష్టించెనో యన జగన్మోహనాకారము వెల్లివిరియజొచ్చెను. అంత నా సుందరి మంచు కప్పిన జాబిల్లియో యన, నాచుకప్పినపద్మమన, శరత్కాల మేఘమండలిచంద్రబింబమో యన కానవచ్చెను. అంత నా సుమంగళి శ్రీరామచంద్రుని దర్శనమాత్రముచే పాపరహితయై సుందరమగు తను కాంతితో లోకమునకు కానవచ్చెను. రామలక్ష్మణు లామెకు నమస్కరించిరి. ఆమెయు భర్తయగు గౌతమ వచనముల స్మరించెను.

శ్రీరాముని అవతారమూర్తిగా భావించి వానికర్ఘ్యపా ద్యాదుల నొసంగి రామునిట్లు స్తోత్రము జేసెను.

శ్లో॥ అహో! కృతార్థాస్మి జగన్నివాస! తే
పాదాబ్జ సంలగ్న రజః కణాదహమ్
స్పృశామి యత్పద్మజ శంకరాది భి
ర్వి మృగ్యతే రంధితమానసైస్సదా.

తా॥ జగన్నివాసా! రామచంద్రా! నీ పాదపద్మముల యందుండు పరాగలేశములచే నేను కడు ధన్యురాలనైతిని. అహో! బ్రహ్మ శంకరుడు మొదలైన వారందరు ఏ నీ పాద ధూళికై ప్రయత్నింతురో, ప్రయత్నించియు పొందలేకుండిరో, అట్టి నీ పాదరజము తనంతతానై వచ్చి నన్ను కృతార్థురాలను గావించినది.

శ్లో॥ అహో! విచిత్రం తవరామ! చేష్టితం
మనుష్యభావేన విమోహితం జగత్
చలస్యజస్రంచరణాది వర్జిత
స్సంపూర్ణ ఆనందమయోతి మాయికః.

తా॥ రామచంద్రా! లీలామాత్రమగు నీ మానవాకార ముచే జగత్తు మోహపడుచున్నది. పూర్ణుడవును, ఆనంద రూపుడవగు నీవు మిథ్యారూపమగు నీ ప్రపంచమును ప్రదర్శించుచున్నావు. ఔరా! ఏమి! నీ విచిత్రచేష్టలు!

శ్లో॥ యత్పాద పంకజపరాగ పవిత్రగాత్రా
భాగీరథీ భవవిరించి ముఖాన్పునాతి
సాక్షాత్స ఏవమమదృగ్విషయో యదాస్తే
కింవర్ణ్యతే మమపురాకృత భాగధేయం.

తా॥ ఏదివ్యపురుషుని పాదపద్మములనుండి పుట్టిన గంగా నది శంకరాదులను సైతము పవిత్రవంతుల జేయుచున్నదో, ఆ దివ్యపురుషుడే యీ రూపమును ధరించి నాయెదుట సాక్షాత్కరించెను. నాపూర్వ పుణ్యమును ఎవరు ఏమని వర్ణింతురు? నాతపః ప్రభావము నాకు ఆశ్చర్యమును గొల్పుచున్నది.

శ్లో॥ మర్త్యావతారే మనుజాకృతిం హరిం
రామాభిధేయం రమణీయ దేహినం
ధనుర్ధరం పద్మవిశాల లోచనం
భజామి నిత్యం నపరాన్భజిష్యే.

తా॥ ఏ పరమాత్మ ఆకృతి లేనివాడయ్యును ధర్మసంరక్షణార్థమై భూలోకమున మానవరూపమున నవతరించెనో భక్తులను పరిపూర్ణముగ అనుగ్రహించుటకో యన తామర రేకుల బోలు విశాలనేత్రములు గలిగి ధనుర్ధరుడై ఏ పరమాత్మ జగన్మోహనాకారముధరించెనో అట్టి రామునే నేసేవించెదను గాని పరుల సేవింపను.

శ్లో॥ యత్పాదపంకజరజశ్శ్రుతిభిర్విమృగ్యం
యన్నాభి పంకజ భవః కమలాస నశ్చ
యన్నామసార రసికో భగవాన్పురారి
స్తం రామచంద్రమనిశం హృదిభావయామి.

తా॥ సనాతనములగు శ్రుతులకుగూడ ఏ మహనీయుని పాదరజస్సు గోచరింపదో, సృష్టికర్తయగుబ్రహ్మ యెవ్వాని నాభికమలమున నుద్భవించెనో, ఎల్లప్పు డెవనినామమును

గానముచేయుచు శంకరు డానందాంబుధి నోలలాడునో అట్టి శ్రీరామ చంద్రుని భావించుచున్నాను.

శ్లో॥ యస్యా వతారచరితాని విరించి లోకే
గాయ న్తి నారద ముఖా భవపద్మ జాద్యాః
ఆనందజాశ్రు పరిషి క్త కుచాగ్రసీమా
వాగీశ్వరీచ త మహిం శరణం ప్రపద్యే.

తా॥ నారదాది దేవర్షులును బ్రహ్మాది దేవలును ఎవ్వని చరిత్ర బ్రహ్మలోకమున గానము చేయుటచే సరస్వతీ దేవి విని ఆనందబాష్పములచేత తడసిన కుచమండలము కలదగు చున్నదో అట్టి శ్రీరామచంద్రుని సర్వదా నేను శరణు పొందు చున్నాను. (బ్రహ్మలోకమున నారదాదులు రామనామమును గానము చేయగా సరస్వతీ దేవి ఆనందించునని భావము.)

అధ్యాత్మ రామాయణము

అంతనా రఘుకులో త్తంసులును భక్తురాలగు నా యహల్య యొసంగిన అర్ఘ్యపాద్యాదుల నతిప్రీతితో గ్రహించెను. లోభమోహములవదలి పవిత్రమగు పూర్వదేహమును అహల్య పొంది ఉ త్తమ సాధ్వియయ్యెగదాయని దేవతలు పుష్పవర్షముల గురిపించిరి. గౌతముడును రామపాదస్పర్శచే అహల్య పవిత్రవంతురాలగుట తపోమహిమచే నెరిగి సంతసమున హిమ వచ్ఛిఖరమునుండి చయ్యన ఆశ్రమమునకు చనుదెంచెను. పరిశుద్ధురాలగు అహల్యను భార్యగా గ్రహించి రామచంద్రుని భక్తివినయము పూజించెను. శ్రీరామలక్ష్మణులును విశ్వా

మిత్రునితో నా పవిత్రదంపతుల పూజాదులగ్రహించి మిథిలా నగరమునకు పయనమైరి.

పాఠకులారా! ఇక అహల్యచరిత్రియందలి కొన్ని ముఖ్యాంశముల గమనింతము. అహల్యను శిలగా పడియుండునట్లు గౌతముడు శపించెనని కొన్ని గ్రంధములందు గలదు. కాని వాల్మీకిరామాయణమం దగుపడుటలేదు. శాపవాక్యములనిందు పొందు పరచుచున్నాను.

శ్లో॥ "............ అహల్యా మపిశ ప్తవాన్
ఇహావర్ష సహస్రాణి బహూనిత్వం నివత్స్యసి
వాయు భక్షానిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యాసర్వ భూతానామాశ్రమేస్మి న్నివత్స్యసి.
యదా చైత ద్వనంఘోరం రామోదశరథాత్మజః
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదా పూతాభవిష్యసి."

తా॥ నా యాశ్రమముననే కొన్ని వేలవత్సరములు ఆహారము లేక తపించుచు, భస్మశాయివై పడియుండుము. దశరథపుత్రుడగు రాముడీ యరణ్యమున ప్రవేశించుటతోడనే నీవు పవిత్రురాల వయ్యెదవు.

పై వాల్మీకి వాక్యములు పట్టిచూడగా అహల్యను రాయిగా శపించనట్లే స్పష్టము. అహల్యచేసిన అపరాధమునకు రాయిగా పడియుండుము అనుటకంటె శరీరముతోడనే శీతోష్ణాదుల సహించి తపించుచుండుమనుటే యుక్తము. అచేతనమగు రాయి సుఖదుఃఖముల ననుభవించుట అసంభవము గదా!

అహల్యచరిత్రమునుండి మనము గ్రహింపవలసిన దేమనగా, అహల్య బుద్ధిపూర్వకముగ చేసినదోషమునకు భర్త యిచ్చిన శాపమే శిక్షగా పరిణమించెను. శాపమనుభవించు కాలమంతయు నేసౌఖ్యము లేకపోయెను. కాని ఆ శాపకాలవ్యవధి తన సూక్ష్మశరీరముచే విపరీతమగు పశ్చాత్తాపతప్తయగుట వలన శుద్ధురాలై రామదర్శనమున కర్హతగలదియయ్యె. ఇట్లే జీవుడు తానొనర్చుదోషములకు శిక్షననుభవించియే తీర వలెను.

ఇక దుశ్శీలయగు అహల్య లోకారాధ్య ఎట్లయ్యెను? అహల్యాజారుడగు ఇంద్రుని వేదమేల స్తుతించెను? అను విషయమును గూర్చి పూర్వమీమాంసకుల సమాధానమరయుదము.

శ్లో॥ శ్రుతిసామాన్యమాత్రాద్వాన దోషోఽత్ర భవిష్యతి
మనుష్యప్రతిషేధాద్వా తేజోబల వశేనవా
యథా వా న విరుద్ధత్వం తథా తద్గమయిష్యతి.

శ్రుతులలో విధులను బలపరచుచు అర్థవాదము లుండును. ఆ యర్థవాదములు విధిని స్తుతించుచు, నిషేధ్యమును నిందించుచు, మానవుని విధి నిషేధములయందు ప్రవర్తింప జేయును. దానికి నీతి ప్రధానముగాని కథాభాగము ప్రధానము గాదు. కాబట్టి యీకథ అర్థవాదమాత్రమనియు దీనిచే ఇంద్రాహల్యల దోషము ప్రకటింపబడదనియు, పూర్వమీమాంసా శాస్త్ర మర్యాదననుసరించి దేవతలు శబ్దప్రతిపాద్యులగుట

వలన కథ భూతార్థవాదము (చరిత్రను తెల్పునది) కాదనియు, మొదటి ప్రత్యుత్తరము.

2. శాస్త్రనిషేధము—శాస్త్రాధికృతులగు మనుష్యులకు మాత్రమేయగుటవలన పరదారగమననిషేధము మనుష్యులకు మాత్రమేనని రెండవప్రత్యుత్తరము.

3. "సర్వంబలవతః పథ్యమ్" బలవంతుడు ఏదితిన్నను అరుగును. ఆరోగ్యము చేయును. అట్లు దుర్బలులకు చేయదు. అట్లే తేజోబలసంపన్నులగుటవలన దేవతలు చేసినది నిజమునకు తప్పే అయినను వారి తేజస్సువలన వారిని బాధింపదని మూడవ ప్రత్యుత్తరము. కాని, యీప్రత్యుత్తరములయందు శాస్త్రకారునికి దార్ఢ్యము లేక శిష్టాచారము శక్తియున్నంతవరకే లోకమనుసరించునుగనుక, లోకవ్యవస్థకు ఇది భంగకరమని తలచి నాల్గవ ప్రత్యుత్తరమును వ్రాసెను.

దాని వివరణమును అతడే స్వయముగ వ్రాసుకొనెను.

"ఇది—పరమైశ్వర్యే" అను ధాతువునుండి ఇంద్రశబ్దము ఉత్పన్నమైనది. ఇంద్రుడనగా పరమైశ్వర్య సంపన్నుడని అర్థము. కావున తేజోరూపమగు పరమైశ్వర్యము సూర్యునియందుండుటవలన ఇంద్రశబ్దమునకు సూర్యుడని యర్థము. "అహని—లీయతే ఇత్యహల్యా" అహని=తెల్లవారగనే, లీయతేఇతి=నశించిపోవునుగాన రాత్రికి అహల్యయని పేరు "జౄష్=వయోహానౌ" జారయతీతి=జారః-జారుడన శిథిలముగా జేయువాడు.

రాత్రియను అహల్యను క్షయించునట్లు చేయును. గాన, సూర్యుడు అహల్యాజారుడని వేదమున చెప్పబడెనేగాని పరస్త్రీ వ్యభిచారముగాదు.

(మీమాంసాదర్శనము—తంత్రవార్తికము)

మరియొక అర్థము. "హలానాంసమూహాః=హల్యా నవిద్యతే హల్యాయస్యాంసా= అహల్యా" నాగళ్ళుగుంపుగలది. "హల్య" యని పిలువబడుచున్నది గాన హల్య = యన దున్నినభూమియనియర్థము, దున్ననిభూమి (బంజెరు) అహల్య అగును. గౌతమః - అత్యంతంగౌః=గౌతమః _ పెద్దయెద్దు. ఇంద్రుడు మేఘములకు అధిపతిగాన ఆ మేఘములను వర్షింజేసి గౌతముని (ఎద్దు) యొక్క-అధీనములోనున్న అహల్యకు అనగా దున్నని భూమికి శిధిలత్వమును కల్పించుటచే ఇంద్రుడహల్యా జారుడని పిలువబడెనేగాని జారత్వముచేగాదు.

## — ♦ మిధిలానగర ప్రవేశము ♦ —

పాఠకులారా! ముందుకథ నరయుదము. ఇపుడు మనము మిధిలానగర ప్రయాణములో నుంటిమి.

రామలక్ష్మణులు అహల్యాశాప మోక్షానంతరము విశ్వామిత్రునితో గౌతమాశ్రమమునుండి యీశాన్యదిక్కు-గా మిధిలకు పయనమైరి, అందు జనకుని యజ్ఞశాల వారికి కాన నగుచుండెను. బ్రాహ్మణోత్తములు కడుమనోహరముగా సామ గాన మొనర్చుచుండిరి. వేదాధ్యయనము చేయుచుండిరి. ఋషీశ్వరులుండు ప్రదేశము నూర్లకొలది బండ్లతో నిండి

యుండెను. రాకుమారులెందరో చతురంగ బలసమన్వితులై ప్రాసాదముల విడిసియుండిరి. రామలక్ష్మణులు, మునియజ్ఞ వాటికను ప్రవేశించి, సంభారములగాంచి వేదాధ్యయనముల విని ఆనంద పడుచుండిరి. పిమ్మటవారు నిర్మలమగునుదకము గలిగి నిర్జనమగు ప్రదేశమున విడిసిరి.

జనక మహారాజు మునిశ్రేష్ఠుడగు విశ్వామిత్రమహర్షి వచ్చిన వార్తవిని తన పురోహితుడగు శతానందుడు వెంటరా మంత్రిసత్తములు మొదలగు వారితోగూడ నెదురేగి యర్ఘ్యపాద్యాది విధుల పూజించెను. ఋషివర్యా! మీరు నాగృహమునకు వచ్చుటచే నా యీ యజ్ఞము సఫలమైనది. నేను ధన్యుడనైతిని. ఇక యజ్ఞము పూర్తియగుటకు పండ్రెండు దినములు కొరతయున్నవి. మునీశ్వరా! యజ్ఞభాగములు గైకొనుటకై దేవతలు వత్తురు. వారిని దర్శింప మీరిందే యుండుడు. అని ముని నాహ్వానించుచుండెను. కాని, విదేహ రాజుమనస్సు ముగ్ధత్వము చెందుచుండెను. దృష్టులు సమీప మున నున్న బాలురపైకి పరువులెత్తజొచ్చెను. వారి జగన్మో హనాకారము విరాగియగు విదేహుని రాగవంతునొనర్చెను. వారి రూపసౌభాగ్యముల నిర్ణయించుటకు మనశ్శక్తి అల్ప మగుచుండెను. వారి లావణ్యము చూడ నేత్రేంద్రియములకే కాకారత సంభవించెను. మునిచంద్రా! రూపరేఖావిలాసముల మన్మథునిబోలి దేవతుల్యపరాక్రములగు నీ రాజకుమారు లెవరు? నవనవోన్మేషరూపవిలాసమున తేజరిల్లు వీరి శరీర కాంతి నారాయణాకృతిని జ్ఞప్తికి తెచ్చుచున్నది, వీరి నేత్రము-

లాయత పద్మములు,—కరుణారస పూరితములు,—తే(బాయులగు నీ రాకుమారుల ముఖములు కరుణారస పూర్ణములయ్యును క్షాత్రవీర్యములుట్టిపడుచున్నవి. పుష్పబాణుని వింటివలె వీరి కనుబొమలు సొబగు గూర్చుచున్నవి. గండుతుమ్మెదల బోలు వీరి ముంగురులు ముఖపద్మమునకు శోభ గూర్చుచున్నవి. సృష్టికర్త తన శిల్పకళానైపుణ్యమున లావణ్యమంతయు కరుడుగ జేసి తన ప్రథమ ప్రయత్నముగ వీరిని సృష్టించి యుండ నోపు! వీరి గమనములు సింహ, శార్దూల, గజ, వృషభముల ననుకరించుచున్నవి. నూత్నయౌవనములతో అశ్వినీదేవతలం బోలు నీ రాకుమారులయందు శృంగారము మూర్తీభవించి యున్నది.

మునీంద్రా! దేవలోకమునుండి భూసంచార మపేక్షించి స్వేచ్ఛావిహారముగ నేతెంచిన యక్ష కిన్నర కింపురుషులో? వీరి సుకుమార తామ్రపాదములు కరకునేలపై మోపి సంచరింప గతంబేమియో? మునీంద్రా! గగన మండలమున సర్వ తేజోవిభూషితులగు సూర్యచంద్రులవలె ప్రకాశించుచున్న నీ రాకుమారులచరిత్ర మెరుంగ మనస్సు వేగిరపడుచున్నది. ఆవాక్యముల విని విశ్వామిత్రుడు జనకమహారాజుతో తన జన్మమును రక్షించినది మొదలు అహల్యాశాపమోక్షము వరకు గల ఇతివృత్తమంతయు నెరింగించి వీరు దశరథమహారాజు పుత్రులగు రామలక్ష్మణులు. నీయజ్ఞమును— ధనుస్సును— దర్శించుట కిట కరుగుదెంచిరని ముని యూరకుండెను. ఆవాక్యములవిని జనక పురోహితుడగు శతానందుడు తల్లియగు

అహల్యయొక్క శాపమోక్షమును, గౌతమసమాగమమును, విని శతానందుడు సహస్రవిధముల నానందమొంది యిట్లనెను. దైవోపహతురాలగు నాతల్లి శాపమోక్షము నొందెనా? సర్వలోకారాధ్యుడగు రాముని వన్యపుష్పముల పూజించి పవిత్రఫలముల నారగింపజేసెనా? పరిశుద్ధురాలగు నాతల్లిని తండ్రి సంతోషమున పరిగ్రహించెనుగదా? ఇదంతయు నీఅనుగ్రహమేనని శతానందుడు విశ్వామిత్రుని కొనియాడెను.

రామచంద్రునిచూచి శ్రీరామా! నీకు స్వాగతము! మాయదృష్టవశమున బ్రహ్మతేజోవిరాజితుడగు విశ్వామిత్రుడు వెంటతోడ్కొనిరాగా మీరు సంతసమున విచ్చేసితిరి. నీవే మహాత్మునిచే రాబడితివో అట్టి విశ్వామిత్రుడెట్టివాడో నీకు తెలియునా?

## —♦ విశ్వామిత్రుని పూర్వవృత్తము ♦—

మహా తేజస్సంపన్నుడగు ఈ విశ్వామిత్రుడు రాజవంశసంభూతుడు. అతడనేకవేల దివ్యసంవత్సరములు ఘోరముగా తపమాచరించి బ్రహ్మఋషిత్వమును సంపాదించినవాడు. ఋషులలో శ్రేష్ఠుడు. ఈతనివంశము పవిత్రమైనది. ఈతడు పవిత్రుడగు గాధికి జన్మించెను. ఈతడు తొల్లి అనేక సంవత్సరములు రాజ్యపాలన మొనర్చి ధర్మాత్ముడై భూమిని తిరుగ జొచ్చెను. కొండలును; నదులును, ఆశ్రమములును, రాష్ట్రములును తిరిగి తిరిగి నానావృక్షఫలభరితమైనదియు, అనేక మృగగణములతో కూడినదియు, సిద్ధచారణులు సేవిం

చునదియు, దేవదానవ గంధర్వకిన్నరులచే మనోహరమైనదియు, బ్రహ్మర్షులకు ఆటపట్టయినదియునగు వశిష్ఠమహాముని ఆశ్రమము కాంచెను. అందలి మహామునులు పవమానాశనులై జప హోమపరాయణులై విరాజిల్లుచుండిరి. వశిష్ఠాశ్రమమును విశ్వామిత్రుడు చూచి రెండవ బ్రహ్మలోకమని తలచి పరమ ప్రీతుడై భక్తివినయములతో మునిశ్రేష్ఠుడగు వశిష్ఠుని స్వాగతము గైకొని, ఆతని పూజార్ఘ్యములందికొని ఉచితాసనాసీనుడయ్యెను. వారి అన్యోన్యకుశలప్రశ్నానంతరము వశిష్ఠుడు చిరునగవుతో విశ్వామిత్రునితో నిట్లనియె. రాజా! నీవు నాకు అతిథివైతివి. నీకును, నీచతురంగబలమునకును, అతిథిసత్కారములు చేయవలసియున్నది. కాన, మాసత్కారములంది కొనుము. అన విశ్వామిత్రుడు చిరునగవుతో మహాభాగా! మీ దర్శనముచేతను, మీఅర్ఘ్యపాద్యాది కుశలప్రశ్నములచేతను మేముధన్యులమైతిమి పూజ్యులగుమీతో సంభాషణముచేయుట కంటె వేరు ఆతిథ్యము మాకేల ? మహర్షీ ! అమృతప్రాయములగు కందమూలఫలాదులు భుజించి సంతసించితిని. మీ దర్శన భాగ్యముచే ధన్యుడనైతిని. మహామునీ ! స్నేహము మరువకుండుము. పోయివచ్చెదను. సెలవిమ్ము. అన భగవానుడగు వశిష్ఠునిచే విశ్వామిత్రుడు వాత్సల్యపూర్వకముగా మాటిమాటికి యాతిథ్యమునకు గౌరవింపబడినవాడై యాశ్రమవాసియగు నీ వశిష్ఠుడు నాయీ సర్వసైన్యమునకంతయు నాతిథ్య మెట్లొసగగలడో చూతమని మిన్నకుండెను. పిమ్మట తపశ్శ్రేష్ఠుడగు వశిష్టుడు తన కామధేనువగు "శబల" యను

దానిని వేగరమ్మని పిలిచి నీవీ విశ్వామిత్ర మహారాజునకును, సర్వసైన్యముల నెల్లవారలకును జాలినంత భక్ష్య భోజ్య చోష్య లేహ్యపానీయములను చతుర్విధాహారములను వారికోరిక తీరునట్లుగాశీఘ్రముగా కూర్చుమనెను.వశిష్ఠుని వచనాను సారముగ కామధేనువు తగినరీతిని సమస్తమును సృజించెను. అనేక పదార్థములను, వెండిపాత్రలును అమృతసలిల పూరితములగు సువర్ణకలశములతో నెవరికివారికి వేరువేరుగా పీటలు మొదలగు ఉన్నతాసనముల నిర్మించెను. అందరకు క్రమక్రమముగా వడ్డించెను.

విశ్వామిత్రుడును, ఆతని యంతఃపురస్త్రీలును, మంత్రులును, సర్వసైన్యమును, కమ్మనికూరల ఘుమ్మను సువాసనలచే నోరూర పిలువబడి యెల్లరును తృప్తిగభుజించిరి. పిమ్మట వశిష్ఠమహర్షి సలిపిన సత్కారములకు విశ్వామిత్రుడు సంతసించి మునిచంద్రమా ! మీవిందునకు సంతసించితిని. మీ ప్రభావము కొనియాడదగినది. నేను మీరు సల్పిన యతిథి పూజచే కడుధన్యుడనైతిని. "శబలా" ప్రభావమున కచ్చెరువందితిని. కాని, మహాత్మా ! ఒక కోరికగలదు. నీకు వేలకొలది యావుల నిచ్చెదను. ఈశబలను నాకిమ్ము. నీకేల యీ శబల? యని యంటివా చెప్పెద వినుము. శ్రేష్ఠమగు పదార్థములన్నియు రాజులవద్దనుండవలయును. రాజులు రత్నహారులని వినలేదా ? యన తపశ్శ్రేష్ఠుడగు వశిష్ఠుడు రాజా ! నూర్ల వేల యావుల నిచ్చినను, బంగారము కొండలుగా గ్రుమ్మరించినను నేనీయావును నీకియ్యనొల్ల. ఆత్మజ్ఞానిని కీర్తి యెడబాయనట్లు

నన్ను విడిచి ఈ కామధేను వెన్నడు నుండజాలదు. ఈ ధేను వును నా స్వార్థమునకుగాక దేశోపయోగకరములగు కార్యములకు వినియోగించుచుంటిని. ఈ యావువలననే దేవాదులకు హవ్యమును, పితృదేవతలకు కవ్యమును, హోమమునకు గావలసిన సర్వసంభారములను బడయుగలుగు చున్నాను. రాజా! ఇది యది యననేల? నా దేహమిదియె. నా జీవిత యాత్ర యంతెయు నీ కామధేనువుపై నాధారపడియున్నది. దీనితో నేను సర్వమును నెరవేర్చుకొనుచున్నాను ఇంతియే గాదు. అనేక దివ్యవిద్యలు దీనియందున్నవి.

ఇది నాకు నిత్యానందమునుగూర్చు వేల్పుగిడ్డి. ఇది యంతయు యథార్థము. కాన ధర్మస్వరూపుడవగు ఓరాజా! నేనెట్లు దీని విడనాడుదును? అన విశ్వామిత్రుడు ధేనువును గ్రహింపవలెనని, నీ కోరిన కాంచన ధనరాసుల నిచ్చెదనని లోభపెట్టెను. కానివశిష్ఠు డంగీకరింపలేదు. ఆత్మరతులను కాంచనము కలతపెట్టునా? అంత విశ్వామిత్రుడు అధర్మ పరుడై శబలను పట్టి-కట్టి-తీసుకొని పోజొచ్చెను. కామధేనువు దుఃఖముతో తన్ను మునీశ్వరుడిట్లు రాజున కప్పగించి యూరకుండుటకు నేనేమి తప్పుచేసితినోకదా యని యేడ్చుచు, వదలక నీడ్చుకొనిపోవు రాజభటులను కొమ్ములచేతను, తన్నుల చేతను, నేలబడద్రొన్ని వశిష్ఠుని సన్నిధికేతెంచి, కన్నులవెంట నీరుగార్చుచు నంబా! యనితోబుట్టువవలె మిక్కిలి బాధపడుచు మేఘదుందుభిధ్వనితో, బ్రహ్మకుమారా! దయామయా! నీవు నన్ను వదలిపెట్టుటకు నేనేమితప్పుచేసితిని. నీ సమీపమున

నుండనీయక నీ దుర్మార్గులగు రాజభటులు నన్ను చావమోదుచూ, నీడ్చికొని పోవుచున్నారె! అని విలపింప జొచ్చెను. అంత శోకాతిశయముచే పరితపించుచు, తనముందర దీనముఖముతో, నేడ్చుచు ప్రార్థించుచున్న యా కామధేనువు దీనాలాపముల నాలకించి వశిష్ఠమహర్షి "వేల్పుగిడ్డీ! కామధేనువు) నేను బుద్ధిపూర్వకముగా నిన్ను వదలి విడిచి చనినవాడను గాను. విశ్వామిత్రుడు రాజ్యమదాంధుడై, కన్నుమిన్ను గానక యధర్మవర్తనుడై బలాత్కారముగా నిన్ను బంధించి గొనిపోవుచుండెను. అతడు భూపాలుడు; వివిధచతురంగబలసమన్వితుడు; అస్త్రశస్త్రవిద్యావిశారదుడు; మహాబలపరాక్రమసమన్వితుడు. అదియునుంగాక వీరుడు. ఇక నేనన్ననో, బలహీనుడను. బీదబ్రహ్మణుడను. రాజుతో నెదిరించి రాజ్యవిప్లవంబును గల్పించుశక్తి గలవాడను గాదుగదా! అట్టిచో వాని కార్యములను మాన్పుటకు నాకుసాధ్యమా? అతని నేనేమి చేయగలను? నాస్థితినీకు తెలియదా?

అన శబల. మహాత్మా!

శ్లో॥ నబలంక్షత్రియస్యాహుర్బ్రాహ్మణోబలవత్తరః
బ్రహ్మన్ బ్రహ్మబలం దివ్యం క్షత్రాత్తు బలవత్తరం.
(బాలకాండ. 54-అ. శ్లో. 15.)

క్షత్రియబల మొకబలమా? అది యొక గొప్పబలమని నీవు చెప్పెదవేల? బ్రహ్మబలమే బలము. మహర్షే! విశ్వామిత్రుడెంతబలము గలవాడైనను, నీకంటె నధికబల సమన్వితుడుగాడు. నన్నాజ్ఞాపింపుడు. నేనీతని సర్వసైన్యమును

నాశనము చేసెదను. మునిచంద్రమా! నీ వనుజ్ఞనిమ్ము. అని తన్ను వినయముగా ప్రార్థించు నా కామధేనువునకు ముని రాట్ వేల్పుగిడ్డీ! మదాంధులగు వీరి పీచమడచుము. ఇందు లకై నూర్లకొలది శూరులను సృష్టింపుము. వారలకు ధైర్యమును పురిగొల్పుము. విశ్వామిత్రుని సర్వసైన్యమునాశన మొనర్పుము. అని యాజ్ఞాపంప కామధేనువు తనహుంభార వముచేతనే భయంకర స్వరూపులగు రణశూరుల నిర్మించెను. వారు విశ్వామిత్రునిసేననంతయు రూపుమాపివిజృంభించిరి. దాని జూచి సహింపనేరక విశ్వామిత్రుడు క్రోధముతో మండి పడుచు కనులెఱ్ఱజేసి శత్రుసైన్యము చచ్చి భూమిమీద పడు నట్లు విజృంభించగా కామధేనువు పహ్లవ, యవన, శకసేనలను, గుంపులుగుంపులుగా - విస్తారముగా కోట్లకొలది సృజించి పంపెను. వీరందరు క్రోధముచే క్రూరులై అనివార్య పరా క్రమ క్రీడయందలి ప్రీతిచే విశ్వామిత్రుసైన్యముపై కారు చిచ్చు అడవిపై బడినట్లు అస్త్రకోటులచే శత్రు సమూహము లను చీల్చి చెండాడిరి. కాని, విశ్వామిత్రుడు భయంకరమైన శస్త్రాస్త్రములచే పహ్లవ, యవన, సైన్యముల నాశనమొనర్ప జొచ్చెను. పడిపోయిన సేనలజూచి వశిష్ఠుడు "శబలా! శీఘ్ర ముగా నీ యోగబలముచే నింక ననేకవీరుల సృజింపుము. అని హెచ్చరింపగా కామధేనువు తన హుంకారప్రభావమున పొదుగున కాంభోజసేనలను, యోనియందు పహ్లవులను, గుదమునుండి శకులును, రోమకూపమున మ్లేచ్ఛులను, కిరా తులను సృష్టించెను. వారెల్లరు రాజసైన్యమునునాశనముచేసిరి.

విశ్వామిత్రునిపుత్రులు నూర్వురును వశిష్ఠునిపై బడగా నాతడు కుపితుడై హుంకారముచే వారల నందర బూడిదపాలు చేసెను. విశ్వామిత్రుడు తన సేనలన్నియు నాశనమగుటయు, నూర్గురు పుత్రులు మరణించుటయు, తన గౌరవాహంకారములు చెడుటయు, విచారించి సిగ్గుచే సముద్రతరంగములవలె వెడలు వేదనముతో కోరలూడిన క్రూరసర్పమయి రాహువుచే పట్టువడిన దినరాజుపగిది, పక్షములువీడిన పక్షియోయన, గర్వభంగము జెంది, కాంతిమాసి-ముఖము వెలవెలబార- ఉత్సాహము చెదరి, వ్యాకులిత చిత్తుడై చేయునదిలేక హతశేషుడగు పుత్రుని రాజ్యమందుంచి యూవగించంత క్రోధాగ్నితో వశిష్ఠుని జయింపవలెనని హిమవత్పార్శ్వమున మహాదేవ ప్రసాదార్థమై తపమాచరింపజనెను. ఆతనికృపచే సర్వాస్త్రములును సంహారోప సంహారములతో బడసెను. అస్త్రాధిష్ఠానదేవతలు తనకు స్వాధీనముకాగా ఋషికి గర్వము విజృంభించెను. వశిష్ఠుని జయించితినని నిశ్చయించుకొనెను. నిండుజాబిల్లిని చూచి మురిసిపోవుసముద్రుని పగిదిపొంగి పొరలుచు వశిష్ఠాశ్రమమునకు విసవిస నడచివచ్చి ఆతని దివ్యాస్త్రశస్త్రములచే వశిష్ఠుని తపోవనమంతయు నగ్నిజ్వాలలచే గప్పివుచ్చెను. ఆ యుపద్రవమును జూచి తాళజాలక మునులు గుంపులుగుంపులుగ పరువెత్తి దిక్కుల నాశ్రయించిరి. పక్షిసమూహంబులాకసంబున కెగసిపోయెను. శిష్యసంఘములు భయభ్రాంతులై చెదరిపోయిరి. లేడిగుంపులు చెంగున నెగిరి తిప్పునపారిపోయెను. తెప్పపాటు కాలములో నానావృక్షలతాగుల్మకుసుమా

కరంబగు నాతపోవనమంతయు చూచుటకు చెట్టుమొదలైనను గానరాక విశ్వామిత్రుని దివ్యాస్త్రజ్వాలలచే తగులపడి బూడిద యైపోయెను. అంతమంచువలె నాశ్రమముచుట్టును వ్యాపించి పీడించుచున్న దివ్యాస్త్రముల జూచి సహింపక తపోవిరాజి తుడగు వశిష్ఠమహాముని సహస్రకిరణ ప్రభావముతో లోక బాంధవుడై ఆశ్రమమధ్య నావిర్భవించెను. ముఖమెఱ్ఱబారెను. కనులవెంట నిప్పులురాలజొచ్చెను. అంత నాతడు ఆశ్రమ వాసులజూచి మీరు పో జనదని పోవువారిని హెచ్చరించి ధైర్యమును పురిగొల్పుచూ ఓరీ! విశ్వామిత్రా! శిష్టజనకంటకా! నిలు; నిలువుము. నీ విజృంభణము నాపలేనని నీవు గర్వించు చున్నావా? నేను చిరకాలము పెంచి ప్రీతితో నీరువోసిన యీతపో వనమునంతయు నాశమొనర్చితివి.

ఓరీ ! కుటిలస్వభావా ! ఇక నిన్ను సంహించిన పాపము వచ్చెనురా ! అని క్రోధపూరితుడై కాలాగ్ని జ్వాలలగ్రక్కు బ్రహ్మదండమును, రెండవ యమదండమువలె పట్టుకొని నిల్చి, నిజతపఃప్రభావ స్వైరవిహారధీరుడై, గాంభీర్యమున సముద్ర మును మించి– యొడలువిరిచి– విజృంభించి– దర్పముతో వేగ ముగ నాతని కెదురుగా నిలువబడెను. అంత విశ్వామిత్రుడును నిలు నిలు వెందుబోయెదవని రోషకషాయితనేత్రుడై, పోటు మానిసియుంబోలె, పొగరుమాటల పదరుచు నాటోపమున వశిష్ఠు నిపై నాగ్నేయాస్త్రమును ప్రయోగించెను. దాన పర్వతము వలె నేమియు చలింపక మునిరాజు ధరణిరాజగు విశ్వామిత్రు నితో నిట్లనెను. ఓరీ! నిర్దయుడా ! నీయస్త్రాస్త్రముల పాండిత్య.

మెంతయో, నీక్షత్రియ బలమెంతయో, క్షణకాలములో భస్మము
చేసి యీవల నిన్ను భూమిపై లేకుండ బూడిదపాలు చేసెదను.

శ్లో॥ క్వచతేక్షత్రియబలం క్వచబ్రహ్మబలం క్వచిత్
పశ్య బ్రహ్మబలం దివ్యం మమ క్షత్రియపాంసన.

ఓరీ! నీచక్షత్రియుడా ! ఎక్కడి క్షత్రియబలము? ఎక్కడి బ్రహ్మబలము? ఇంతమాత్ర మెఱుంగవు. దివ్యమగు బ్రహ్మ బలము నికచూపెదను చూడుము. అన విశ్వామిత్రుడు వైచిన యాగ్నేయాస్త్రమూరక బ్రహ్మదండముచేతనే చల్లారెను. అంతలో బోక రోషపూరితుడై విశ్వామిత్రుడు గాంధర్వము, బ్రహ్మపాశము, జృంభణము, పైశాచము మొదలుగా గల యనేక దివ్యాస్త్రములు ప్రయోగించెను. బ్రహ్మసుతుడగు వశిష్ఠుడాతని దివ్యాస్త్రముల నన్నియు, బ్రహ్మదండము చేతనే సంహరించెను. అది చూచి చూపరులెల్లరు వశిష్ఠుని ప్రభావమున కాశ్చర్యపడిరి. విశ్వామిత్రుడు దీర్ఘక్రోధముచే భయంకరాకారుడాయెను. చివరకు విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రమును వదలెను. మూడులోకముల వారును మిగుల భయభ్రాంతులై యేమికానున్నదో యని చూచుచుండిరి. అంత అగ్నిజ్వాలలు గ్రక్కుచువచ్చు నా బ్రహ్మాస్త్రమును, బ్రహ్మకుమారుడు తన బ్రహ్మదండముచే తనయందు విలీనముజేసుకొనెను. అంతవశిష్ఠుడు భయంకరుడాయెను. ఆతని రోమకూపములనుండియగ్నిజ్వాలలు పంక్తులుపంక్తులుగా బయలుదేరెను, ఋషిశ్రేష్ఠుడు కాలాగ్నియోయన ప్రకాశింపదొడగెను. మునీశ్వరులందరు ఆపగారాని యాతని మహాప్రభావమును జూచి స్తోత్రముచేయ నా

వశిష్ఠమహాముని ప్రసన్నవదనుడాయెను. అంత ఋషీశ్వరు లాతనితో నిట్లనిరి. మహామునీ! నీ తపోబల మింతయని చెప్ప రానిదై లోకమున ప్రసిద్ధినొందెను. నీచే విశ్వామిత్రుడు ఓడింప బడె. అని మునీశ్వరులుపలుక వశిష్ఠుడు శాంతినొందెను. విశ్వామిత్రు డేమియును చేయజాలక తన యస్త్రములన్నియు బుగ్గి యగుటచే నిట్టూర్పువిడుచుచు దుఃఖసముద్రమున పడి —

శ్లో॥ ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలం
ఏకేన బ్రహ్మదండేన, సర్వాస్త్రాణి హతానిమె.

తా॥ బలమనిన బ్రహ్మబలమేబలముగాని క్షత్రియ బలము బలముగాదు. ఏలనన, నా దివ్యాస్త్రముల నన్నింటిని యీతనిచేతి బ్రహ్మదండమె సంహరించెనుగదా! నా క్షాత్ర బలము వ్యర్థమాయెను. దివ్యాస్త్రములు మంటగలిసెను. కాన, నిక దీనితోనాకు బనియేమి? నాకు విరోధియగు వశిష్ఠుడు నియతాత్ముడై, బ్రహ్మనిష్ఠుడై, శాంతుడై, యుండుటచేతనే గదా యీతని కింత మహాత్వము కలిగెను. కాన శాంతచిత్తుడగు నీతనితో నాకువిరోధమేల? నేనును శాంత చిత్తుడనై ఇంద్రియాదులనుజయించి తపోవృత్తి నవలంబించి బ్రహర్షి నయ్యెదనని నిశ్చయించి లోలోపల వశిష్ఠునందు నీర్ష్యో చ్ఛ్వాసల విడచుచు, క్రోధాగ్నిచే కుమిలి కుమిలి భార్యతో కూడ దక్షిణదిక్కునకు జని వానప్రస్థాశ్రమమును స్వీక రించి తపస్సుచేయ దొడగెను. ఔరా! పూజ్యులతోడి విరోధ మైనను శ్రేయస్సుగదా!

పాఠకులారా! ఇంతవఱకు పఠించిన విశ్వామిత్రుని చరిత్రమందు యంత్రబలము పశుబలముకన్న మంత్రబలము (సాత్త్వికమగు తపోబలమే) ప్రబలశక్తి కలదని తెలియవచ్చినది. దీనిని ప్రస్తుతమున మహాత్ముడు ప్రపంచమునకు బోధించుచు తాను మహాతపస్సు చేయుచున్నాడు. సత్యసంపాదనచేతనే స్వరాజ్య సంపాదన కావలయునని మహాత్ముని అభిప్రాయము. భారతీయులారా!

కర్మభూమియగు భరతఖండమునబుట్టినమనము తపస్సును కోల్పోవుటకంటె దురదృష్టముకలదా! దీనినే భర్తృహరి వర్ణించియున్నాడు.

శ్లో॥ "స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతితిలఖలీ
మిన్ధనైశ్చన్దనాద్యైః
సౌవర్ణైర్లాఙ్గలాగ్రైర్విలిఖతివసుధా
మర్కమూలస్య హేతోః
ఛిత్వా కర్పూరఖండాన్ వృతిమిహ కురుతే
కోద్రవాణాంసమన్తాత్
ప్రాప్యేమాం కర్మభూమింనభజతి మనుజో
యస్తపోమన్దభాగ్యః."

తా॥ కర్మనాచరించుటకు యోగ్యమైన యీ భూమిని బ్రాపించియు నే భాగ్యహీనుడు తపము నాచరింపడో అట్టివాడు వైడూర్యమణి మయమైన పాత్రయందు తెలికపిండిని వండువానితోను, పనికి మాలిన జిల్లేడు వేరుకొరకు బంగరు నాగళ్ళతో నేలను దున్నువానితోను, కప్పురపు అరటులనరికి

వానితో అళ్ళను (ధాన్యములలో ఒక ధాన్యము పేరు) అడ్డము వేయువానితోను సమానమగు మూర్ఖుడు.

## — స్వార్థత్యాగము —

అందు విశ్వామిత్రునకు హరిష్యందుడు, మధుష్యందుడు, దృఢనేత్రుడు, మహారథుడు, అను నలుగురు కుమారులు పుట్టిరి. ఇట్లు నూరుసంవత్సరములు గడువగా బ్రహ్మ ప్రత్యక్షమై విశ్వామిత్రుని మృదుమధురాలాపముల దీవించి రాజా! నీ తపంబునకు మెచ్చితి. నీవు రాజర్షిలోకమును జయించి యుత్తమరాజర్షివైతివి. అని బ్రహ్మ దేవగణములతో తిరోభూతుడాయెను. విశ్వామిత్రుడును బ్రహ్మవాక్యముల విని నేనింత ఘోరమగు తపంబు చేయగా నాకు రాజర్షిత్వమా ప్రాప్తింపజేయుట? అని సిగ్గుచే తలవంచుకొని దుఃఖతప్తుడై చేయునది లేక నేను బ్రహ్మఋషిని కాకపోతినిగదా యని మనంబున చింతించి వెనుకటికంటె నధిక తపమాచరింప దొడగెను.

అట్టి తరి అయోధ్యాధిపతియగు త్రిశంకుడను నొక రాజు గలడు. ఆతడు దేహముతోడనే స్వర్గసుఖము ననుభవింపవలెనని యాశతో తన పురోహితుడగు వశిష్ఠమహామునిని పిలిపించి నిజమనోనిశ్చయము నెల్లడించెను. మహాసత్త్వుడగు నా వశిష్ఠుడాతని నిశ్చితాభిప్రాయము నెరింగి నాలోచించి యిది యసాధ్యకార్యమని చెప్పెను. దానితో రాజు తృప్తినొందక నిత్యాగ్నిహోత్రముల వేల్చుచు దేదీప్యమాన కాంతితో

పరిహాసించు వశిష్ఠుని నూర్వురుపుత్రులకడ కేగి తపోవిరాజితు లగు నో మహామునులారా ? దేహముతో స్వర్గమునకు పంపు యజ్ఞము నాచే జేయింపుడు. మీతండ్రియగు వశిష్ఠుని ప్రార్థించియు తిరస్కరింపబడి నవమానింపబడితిని. తాను పురోహితుడననియు, నేను రాజునని యేమాత్రమును యోజింపక యాతడు నన్ను ధిక్కరించెను. మీరే నాకు రక్షకులు,

"పురోధస స్తు విద్వాంస స్తారయంతి సదానృపాన్."
విద్వాంసులగు పురోహితులే గదా రాజుల తరింప జేయుదురు.

అన వశిష్ఠు నతిక్రమించి పలికిన పలుకుల నాకర్ణించి గురుపుత్రులు నూర్వురును అగ్నిజ్వాలలో నేయిపోసిన పగిది మండిపడి క్రోధముతో నోరీ! వివేకహీనుడా! యథార్థమువచించిన గురువాక్యములు త్రోసిపుచ్చి వదరు పలుకులు పలుక నీకు తగునా? తపోధనుడగు నా గురుసత్తముని విడనాడి వేరొకరి నాశ్రయింపవచ్చునా? ఆవు మేయని మేత దూడ మేయునా? మా తండ్రియగు వశిష్ఠుడే కాదనగా, మావలన సాధ్యపడునా? నీవు నీ తప్పును గ్రహించుకొనుము. ధర్మబుద్ధిగలవాడవై తిరిగి పురంబునకుపోయి నీ గురువగు వశిష్ఠునే యాశ్రయింపుము. కరుణామయుడగు నాతడే నీ కోర్కె నెరవేర్చగలడు. అన త్రిశంకుడు విఫలమనోరథుడై, గురుపుత్రుల వాక్యముల గౌరవింపక నా కోరికను మీరు తీర్చనికారణముచే నేను వేరొక మార్గమును చూచుకొందును. పోయివచ్చెదనని చులకనగా పలుక వారు కోపించి ఓయీ! గురువాక్యములను త్రోసి పుచ్చుటయేగాక, గురుపుత్రులమగు మా వాక్యములనైన తమ

ద్రోసిపుచ్చి నిర్భయుడవై పోవుచుంటివా? అటులైన గురుద్రోహీ! వెంటనే చండాలత్వమును పొందుము అని శపించిరి. అంత నారాజు ఉదయమున మేల్కాంచుతరి, అందమై నిగనిగలాడుకురులు గిరసబారి కరకుతేలెను. వస్త్రములు చినిగి పీలికలై మలినమాయెను. బంగారు శరీరచ్ఛాయ కాకివలె నల్లబారెను. రత్నాభరణములన్నియు ఇనుపగొలుసులై కంఠమున వ్రేలాడజొచ్చెను. దంజములు ఇనుపకమ్ములయ్యెను. ఇట్టి సాక్షాచ్చండాల వేషమును పొందిన రాజగు త్రిశంకుని చూచి పురజనులెల్లరు శీఘ్రముగా తొలగి తొలగి దూరముగా పోయిరి. రాజుమాత్రము ధైర్యమును వీడక స్వశరీరస్వర్గ సుఖాసక్తుడై తపోధనుడగు విశ్వామిత్రుని సమీపించెను. అట్లు సమీపించిన యా త్రిశంకు మహారాజును విశ్వామిత్రుడుజూచి ఆతనిస్థితికి దయగలవాడై రాజా! ఏ నిమిత్తమున నీవిచటికి వచ్చితివి? నీవిట్లు చండాల తనువును పొందుటకు కారణమేమి? అని ప్రశ్నింప త్రిశంకుడు చేతులు జోడించి విశ్వామిత్రునకు నమస్కరించి మునీశ్వరా! సశరీరస్వర్గమును గోరి గురువగు వశిష్ఠుని, గురుపుత్రులను యాచించి స్వర్గమును పొందకపోగా విపర్యయ ఫలమగు నీచండాల తనువును పొందితిని. మునిచంద్రమా! నీవే నాపాలిరక్షకుడవు. "నాన్యశ్శరణమస్తిమే" నన్ను రక్షింప నన్యులెవ్వరులేరు. అని దీనాలాపముల ప్రార్థింప ఋషి మధురవచనముల నృపపుంగవ! నీకు స్వాగతము! ఇక్ష్వాకువంశ సంభూతుడవగు నీవు సత్యసంధుడవు ధార్మికుడవని యెరుంగుదు. భయపడకుము. నీకు నే

శరణమిచ్చుచున్నాను. నీచే యజ్ఞమును చేయించెదను. కాని యొకమాట. గురుశాపమును మాత్రము తప్పింపవలను పడదు.

శ్లో॥ "దైవే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన"

దైవము కోపించిన గురువు రక్షించును. గురువు కోపించిన రక్షించువారు లేరు. ఈ రూపముతోడనే నిన్ను స్వర్గమునకు పంపెదను. నీ కీర్తి నిలచియుండునట్లు జేసెదను. రాజా! ఎక్కుడు మాటలవలన ప్రయోజనమేమి? నీకు నే శరణొసంగుటచే సర్వథా నీకార్యము నెరవేరినదనినమ్ముము. అని యా విశ్వామిత్రుడు యజ్ఞారంభమునకుపూని తన కుమారులను యజ్ఞసంభారములకు నియమించి తన శిష్యసమూహములను ముఖ్యహితులగు మునీశ్వరులను తీసుకొనిరా నియోగించె. మఱియు వారితో నిట్లనెను. ఎవడైనను నా పలుకాదరింపక యగౌరవముగ పలికిరేని యట్టివారి పలుకుల నాకు మీరు విన్నది విన్నటుల చెప్పుడు. దేశదేశములందలి బ్రాహ్మణుల నందరిని బిలువుడు. ఇది విశ్వామిత్రుని యాజ్ఞ. అన భయపడుచు త్వరగాపోయి పిలువ బ్రహ్మవాదులందరును విశ్వామిత్రుని భయముచే యజ్ఞమును జూడవచ్చిరి. ఆవల శిష్యులందరు మునీంద్రా! దేశదేశముల ద్రిమ్మరి బ్రహ్మవాదుల నందరను తోడితెచ్చితిమి గాని వశిష్ఠుడు రాలేదు. ఆతని కుమారులగౌరవముతో మేము పిలువ రోషముతో ఏమీ? యజ్ఞము చేయువాడు చండాలుడా! యజ్ఞము చేయించువాడు రాజగు విశ్వామిత్రుడా? శ్రోత్రియ పరులగు బ్రాహ్మణులు చండాల యజ్ఞమున నన్నమెట్లు తిందురో? దేవతలు సంతోషముగ

హావ్యముల నెట్లు పరిగ్రహింతురో ? చండాలునకు యజ్ఞ ఫలము స్వర్గమా ? అయినచో నదెట్టి స్వర్గమో ?

అని మహోదయుడాది గాగల వశిష్ఠకుమారులు పలికి రనిన విశ్వామిత్రుడు కోపముతో కనుల నిప్పులు గ్రక్కుచు మండిపడి మహోదయుని విడిచి మిగిలినపుత్రులనిట్లు శపించెను. "వెంటనే చచ్చి బూడిదయై యమదూతల కఠినబాధల బాధపడుచు తిరిగి ఏడునూర్ల జన్మలు పీనుగులను, కుక్కమాంసములను భక్షింపుచు దీనులై నీచాతినీచులై వికారవేషములతో వ్యాధిగ్రస్తులై జీవింతురుగాక! కఠినముగా నిందించిన జ్యేష్ఠుడగు మహోదయుడు దుర్బుద్ధియై నిషాదత్వమును పొందునుగాక!" అని వశిష్ఠకుమారుల నూర్వురను ఘోరముగ శపించెను. పిమ్మట అచ్చటి మునీశ్వరుల జూచి త్రిశంకుని జూపుచు మునీశ్వరులారా! ఈతడు ఇక్ష్వాకువంశపు రాజు. ధార్మిక పురుషుడు. త్రిశంకుడను పేరుగలవాడు. మహాభాగ్యసంపన్నుడు. శరీరముతోడనే స్వర్గమునకు బోవలెనని నా సహాయము గోరెను. కాన మనమందర మీతనిచే యజ్ఞము చేయించి యీతనియభిప్రాయము నెరవేర్పవలయును. అన పరమకోపియు, చండప్రచండుడు నగు నా విశ్వామిత్రుని మాట కాదన్నచో నేమి శపించి మాడ్చునో యని మునీశ్వరు లెల్లరును సరి సరి, బాగు బాగు, అని కార్యనిర్వహణమునకు బూనుకొనిరి.

విశ్వామిత్రుడు యాజకుడై యజ్ఞమును నిర్వర్తించుచుండెను. విశ్వామిత్రుని యాజ్ఞానుసారముగ నియతకర్ములై మునీ

శ్వరులెల్లరును, నేమి నెపము వాటిల్లునోయని భయంపడుచుం గడు జాగరూకతతో ప్రవర్తించుచుండిరి. అంత తపోధనుడగు విశ్వామిత్రుడు హవిర్భాగములు గ్రైకొనుటకై యెలుగెత్తిదేవతలనుపిలిచెను. కానివారు మేము రామనిరి. విశ్వామిత్రుడు కంట్లెర్ర జేసెను. స్రువమునుజేతబట్టెను. లేచినిలచెను. అంతనాత్యాగి త్రిశంకునిజూచి రాజా! ఈయజ్ఞముచే ప్రయోజనములేదు నాచే సంపాదింపబడిన తపోబల సంపదచే నిన్ను మేనితో సునాయాసముగ స్వర్గమునకు పంపెదనని యాకసమున తీవ్రదృష్టిని ప్రసరింపజేసి నా తపోబలముచే నెవ్వరికిని దేహముతోపోవ శక్యముగాని స్వర్గమునకుపొమ్మని పలుక, నా విశ్వామిత్రుని తపః ప్రభావముచే ఋషులందరు నాశ్చర్యముతో చూచుచుండ నా రాజాకసమున విమానమో యన నెగసి రివ్వన స్వర్గమునకు పోయెను. ఆహా! ఏమి! తపోబలశక్తి? మునిగణ సేవితుడై దేవాదులతోగూడి యున్నత సింహాసనాసీనుడై యున్న యింద్రుడు త్రిశంకుని జూచెను. గురుధిక్కారపాపము ఆతని యందు చండాల రూపమున ప్రత్యక్షమయ్యెను. ఇంద్రుడు మూఢుడా! నీకుదోడు స్వర్గమా! ఏలోపమును లేక సత్కర్మానుష్ఠానులగు వారలకే స్వశరీర స్వర్గవాసములేదే? అట్టిచో నిక నీకా? నీవిచట నుండదగవు. భూలోకమునకు బొమ్ము. అని తలక్రిందుగా భూమిమీద పడునట్లు త్రోసెను. "కేవానస్యుః పరిభవ పదం నిష్ఫలారంభ యత్నాః" నిష్ఫల ప్రయత్నముల చేయువారు ఎవరు పరాభవింపబడరు? రాజు భూమిపై బడుచు కరుణామయా! మహాతేజా! తపోధన! రక్షింపుము,

రక్షింపుము. నాపని యిట్లయినది. భూమిపై బడుచున్నాను. ఇక భూమిపై పడి వికలాంగుడనయ్యెదనని యాక్రోశించు దీనాలాపముల విని దయాసముద్రుడగు విశ్వామిత్రుడు క్రోధముతో విజృంభించి రాజా! "నిలు నిలు" మని తన తపోబలముచే నాతని నిలిపి సృష్టికి ప్రతిసృష్టి యొనర్పబూని సప్తమహర్షులను కొన్ని నక్షత్రములను సృష్టించెను. దేవేంద్రునిగూడ సృష్టించెదనని దేవతలను సృష్టించుటకై యత్నింప దేవతలందరును విశ్వామిత్రుని కడకు వచ్చి మహాతేజ! నీతపోబలము లోకమున కుపకారము గలుగునట్లు చేయవలయును గాని, యిట్లు వ్యర్థముగ వ్యయమొనర్పవచ్చునా? ఈ త్రిశంకుడు గురుశాపహతుడు. ఇట్టివాడు స్వర్గమున కర్హుడగునా? నీవే యొకరిని శపించితి వనుకొనుము. వేరొకఋషి యిట్లులే యొనర్చినచో నిక చేయునదియేమి? స్వర్గమంతయు, మాలలపాలయి పోవలసినదేనా? నీవు చేయదగని పనిని చేయ సాహసించితివి. నీకంటె తపోధనులును- మహాతేజులునగు మహర్షు లెందరు లేరు? వారందరు నీవలె శాస్త్రమర్యాదలను తొలగ ద్రోసిరా! శాస్త్రమర్యాదను నుల్లఘింపకుము. అన విశ్వామిత్రుడు దేవతలారా! నా కార్యము నెరవేర్పుటకొక యుపాయము చెప్పెదను. తొలుతనాచే సృష్టింపబడిన నక్షత్రములన్నియు జగముండువరకు సుప్రసిద్ధనక్షత్రమార్గములై ఉండును. తలక్రిందుగానున్న త్రిశంకుడును యీ నక్షత్రముల ననుసరించి యుండును. అన దేవతలును అట్లే అంగీకరించిరి. యజ్ఞము ముగియగానే వచ్చినవారందరు వారివారి స్థానములకు

బోయిరి. అంత విశ్వామిత్రుడు తన తపస్సునకు విఘ్నము సంప్రాప్తమైనదని యా దక్షిణదిక్కు వదిలి పడమట దిక్కునగల పుష్కరతీర్థమునకు బోయి యందొకచో పవిత్రదేశమున నిశ్చలచిత్తుడై తీవ్రతపమాచరింప జొచ్చెను.

ఆకాలమున అయోధ్య యను పట్టణమునందు నంబరీషుడను రాజు ప్రజల మెప్పువడసి రాజ్యమును పరిపాలించుచు యొక జన్నమును చేయ పూనుకొనెను. యజ్ఞప్రారంభముననే యజ్ఞాశ్వమును ఇంద్రు డపహరించెను రాజు భయపడెను. ఋత్విజులు క్రోధపడిరి ఇట్టి బుద్ధిమాంద్యము తగునా యని వారు రాజును తూలనాడిరి.తుట్టతుదకు రాజు వారల ప్రార్థింప యజ్ఞపశువు దొరకనిచో తిరిగి యజ్ఞ ప్రారంభమునకు మనుష్యునైనా పట్టితెమ్మనిరి. దేవసముడైన రాజు యజ్ఞపశువునకై పల్లెల, పట్టణముల, యరణ్యముల వెదకి కానరాక ధర్మపరిపాలకు డౌట చేబలాత్కారముగనారా జెవ్వనిపీడింపబోక చిట్టచివరకు ఋచీకుడను మునియొద్దకుంబోయి నమస్కరించి మునీశ్వరా! నేనొక యజ్ఞమును ప్రారంభించితిని.మూర్ఖుడగు నెవడోనాయజ్ఞపశువు నపహరించెను. దేశ దేశములును వెదకించితిని. కాని లభించినదికాదు. దాన ఋత్విజులెల్లరు యజ్ఞపశువునకు మారుగా మనుష్య పశువునైనను నుంచవలసినదనిచెప్పిరి. నీకు ముగ్గురు కుమారులున్నారుగదా! వారిలో నొక్కని నా యజ్ఞసంరక్షణార్థమైయిమ్ము. నీకులక్షగోవులనిచ్చెదను. ఋచీకునకు ధనకాంక్షయు పుత్రప్రేమయు—నొక్కమ్మడి మనమున నుయ్యాల లూగ చివరకు తెంపుజేసి రాజేంద్రా! నా ప్రేమకు

పాత్రుడును నా కర్మలకు నక్కరకువచ్చు జ్యేష్ఠపుత్రు నీయ జాలననెను. ఆమాటలవిని భార్య కడపటివాని నేనివ్వననెను. అంత నడిమివాడగు శునశ్శేపుడు తల్లిదండ్రుల మాటలను వారి భావములను గ్రహించి యిరువురకు పనికిరానివాడనై నిరర్థక జీవినైతిని గదా యని తలచి నాప్రాణమిచ్చి ఈరాజు జన్నమై నను సంరక్షించెదనని, యాత డుదారబుద్ధితో రాజునకిట్లనెను. రాజా! తల్లిదండ్రుల మాటలబట్టి చూడగా నన్ను విక్రయింప నిష్టమున్నట్లు తేలుచున్నది కాన నో రాజా! నేను నీ వెంట వచ్చెదను. లక్షయావులను వీరికిమ్ము. అన రాజు ఋచీకునకు గోవుల నిచ్చి శునశ్శేపుని సంతోషముతో తోడ్కొని పోవుచు మధ్యాహ్నకాలమగుటచే పుష్కర తీర్థమున విశ్రమించెను. అచట కొంత విరామము దొరకుటచే శునశ్శేపుడు ఋషి సంఘములోనున్న విశ్వామిత్రునిచూచి ప్రాణభయ మాతని పరువులెత్తింప మేనమామ యెదుట నిలచి వందనమాచరించెను. దీనవదనుడై ఋషివర్యా! తలిదండ్రులు నన్ను యజ్ఞపశువుగా రాజునకు విక్రయించినారు. నాగతి యేమని చెప్పుదును. నీవే నాకు తల్లివి; దండ్రివి; దైవమవు; కాన నేవిధముగానైనను నీ తపోబలముచే రాజు యజ్ఞమును సంరక్షించి నాకు దీర్ఘాయు వొసంగికాపాడుము. "ఆపన్నార్తి ప్రశమనఫలా స్సంపదో హ్యుత్తమానాం" ఆపన్నులగువారిని రక్షించుటయే గదా ఉత్తముల సంపదకు ఫలము.

అన గాధినందనుడు కరుణార్ద్రహృదయుడై తనకుమారుల పిలచి ధర్మాత్ములారా! తలిదండ్రుల యాజ్ఞను పాలించి

తలిదండ్రులకు పరలోకముల కల్పించుటగదా పుత్రుల కర్తవ్యము. అట్టి కాలమాసన్నమైనది. ఈతడు ఋషిపుత్రుడు. ప్రాణభయముచే నన్ను శరణు వేడినాడు. మీలో నెవరైన యజ్ఞపశువుగా ఉండి యీ ఋషిపుత్రునకు ప్రాణభిక్ష యొసంగుడు. దాన మీకును నాకును శుభము చేకూరగలదు. అభయ ప్రదానముకన్న వేరొండు ధర్మముకలదా? అని విశ్వామిత్రుడు పుత్రుల నాజ్ఞాపించెను.

పాఠకులారా! ఏమి విశ్వామిత్రుని ఉదార హృదయము; స్వార్థత్యాగము. ఇట్టివారేగదా! లోకమున సత్పురుషులని గణింప బడుదురు.

"తమకార్యంబు పరిత్యజించియు పరార్థప్రాపకుల్ సజ్జనుల్"

ఆ వాక్యముల విని మధుష్యందాదులగు పుత్రులు అహంకార పూరితులై యపహాస్యమును సూచించుచు తండ్రీ! పుత్రప్రియుడవగు నీవు నీ బిడ్డలను, వదలి పరుల బిడ్డలను రక్షించి పోషించుట తగునా? ఇదేటి న్యాయము? కేవలము స్వార్జిత మధురాహార పదార్థములను వీడి కుక్క-మాంసమును దినుటకు నెవరైన నుత్సాహపడెదరా? ఇట్టి నిషిద్ధకార్యమును పూనుకొనుట యుక్తమా? యని మధుష్యందాదులగు తన సుతులు తండ్రిని ధిక్కరించి పలికిన పలుకులకు విశ్వామిత్రుడు కోపించి, కొరగానికొమరులు బ్రతికిననేమి? చచ్చిననేమి? ఛీ! మీ మొగముచూడరాదు. వశిష్ఠపుత్రులవలె మీరును సంకరజాతియందు జన్మించి కుక్క-మాంసమును తినుచు నీచమనస్కులై వేయిసంవత్సరములు

భూమిపైబడి యల్లాడుదు." అని విశ్వామిత్రుడు పుత్రులను క్రూరముగా శపించెను ఔరా! క్రోధమెంత పనిచేయును. "కిమరిభిః క్రోధో స్తిచేద్దేహినాం." శునశ్శేఫునిచూచి ఓయీ! నీకు భయములేదు. దివ్య మంత్రరాజములను నీకుపదేశించు చున్నాను. విష్ణుయూపమునకు నిన్ను గట్టినపుడు నీవు జాగు సేయక నే నుపదేశించు మంత్రమును జపించుము. అని రెండు మంత్రములనుపదేశించెను. శునశ్శేఫు డా మంత్రరాజముల గొని రాజును యజ్ఞదీక్షకై తొందరబెట్టుచు అంబరీషుని వెంట బోయెను. రాజు గృహమునకు జని తన ఋత్విక్కులు జెప్పిన చొప్పున యజ్ఞదీక్షవహించెను. ఋత్విక్కులును శునశ్శేఫునకు రక్త వస్త్రములుగట్టి దర్భలచే పేనబడిన త్రాళ్ళతో పట్టితెచ్చి యూపస్తంభమునకు కట్టివైచిరి. మునిపుత్రుడు ఏమియు భయ పడక నిశ్చలభక్తితో అగ్నిని ప్రార్థించి విశ్వామిత్రముని యుప దేశించిన మంత్రములచే ఇంద్రుని, ఉపేంద్రుని స్తోత్రము జేసెను. (యజ్ఞపశువును భుజించువాడు ఇంద్రుడు. యూప స్తంభ దేవత ఉపేంద్రుడు గాన వీరిని స్తోత్రముజేసెను.) ఆ స్తోత్రమునకు సహస్రాక్షుడు సంతసించి, రాజునకు యజ్ఞఫల మును, మునికుమారునకు దీర్ఘాయువు నొసంగి యంతర్ధాన మాయెను. ఔరా! మంత్రప్రభావ మెంతది?

ఇట విశ్వామిత్రుడును తిరిగి వేయి సంవత్సరములు పుష్కరతీర్థమందె తపస్సుజేసెను. వేయిసంవత్సరములు పూర్తి కాగా బ్రహ్మప్రత్యక్షమై ఋషివైతివని విశ్వామిత్రునకు వర మొసంగి సత్యలోకమునకరిగెను. ధీమంతులు తమ సంక

ల్పము పూర్ణముగ నెరవేరునంత దనుక స్వల్పలాభమున తుష్టి నొందుదురా? తిరిగి విశ్వామిత్రుడు "బ్రహ్మర్షిత్వ" ప్రాప్తికై తీవ్ర తపముచేయ దీక్షితుడాయెను.

పాఠకులారా! విశ్వామిత్రుని స్వార్థత్యాగమను కథ యందలి విశేషము గమనింతము.

ప్రతిమానవుడును తనచేయి పైన నుంచుకొనుటకే ప్రయత్నింపవలెను. యాచనసేయుహస్తము క్రిందనుండును. తానెవ్వరికిని చేయి చాచకుండుటకును, ఒకరు చాచిన లేదనకిచ్చుటకును, కర్ణుడు శ్రీకృష్ణునివేడెను. కాని ఒకరి కివ్వవలెనన్నచో ముందు తాను సంపాదించవలెనుగదా! మానవుడు సంపాదించు సమస్త పదార్థములలో తపోబలము శ్రేష్ఠమైనది. అట్టి బలవంతు డఘుటనాసమర్థుడగును. అట్టిబలమును దీనజనోద్ధరణకై వినియోగించువారి గొప్పదనము చెప్పవలయునా? అట్టి తపోబలమున్న కారణముచేతనే యీనాడు మహాత్ముడందరిచేతను గౌరవింపబడుచున్నాడు.

## విజయ ధ్వజము

అది మిగుల మనోహరప్రదేశము. అందును నానావిధ వృక్షలతాకుంజములు వికసించిన పుష్పములు సౌరభమును చిమ్ముచుండెను. తుమ్మెదపిండుల ఝుంకారములు పెల్లుమీరెను. లేమావిచిగురుటాకుల మేసి కోయిలలు మనోహరముగా కూయసాగెను. అందునసమీపములో నొకతటాకము. దాని

ప్రక్కగా సెలయేరు ప్రవహించుచు నందలి లతాపుష్పమంజరు లను, పొదరిండ్లను, చల్లని తుంపురులచే తడుపుచుండును. హరిణములు పచ్చికలనాకుచు చెంగుచెంగున నలుదిక్కులను బెదిరిబెదిరిచూచుచు పరువులిడుచుండెను. అందొక రమణీయ మగు పర్ణశాలకలదు. దానిచెంత నున్నతాసనమున కృష్ణాజి నముపఱచి, సిద్ధాసనమువైచి, కనుబొమ్మలమధ్య దృష్టినిలిపి నిశ్చలధ్యానమున బ్రహ్మపదమునకై నొకదివ్యపురుషుడు తపము జేయ జొచ్చెను. అతడు విశ్వామిత్రుడని పాఠకలోకము నకు నేజెప్పబనిలేదు. ఈతని తపస్సమాధికి దేవేంద్రాదులదటి పడి, వారీతని తపంబు నాశనమొనరింప యత్నించిరి.

అంత త్రిలోక సుందరియగు నొక యచ్చర ముని పర్ణ శాల సమీపించెను. ఆతనుమధ్యచూపు లాకర్షణీయములై విరాగులనైతము రాగులజేయుచుండెను. అట్టి తటియా అప్సరస మేఘములందలి క్రొమ్మెరుంగు తీగవలె నా కొలనుదరి జలకమాడ జొచ్చెను. అనంతరమున నా నవలాతిలకము నవనవోన్మేష పరిమళ పరివృతయై సన్నని చీరచెరంగు గాలి తాకుడుచే నాట్యమాడ తానును తనకాలిగజ్జియలు గల్లుగల్లు మని నాట్యమాడ జొచ్చెను. ఆ మృదు మధుర నాట్యనినా దము ఆ ఋషి పుంగవుని శ్రోత్రపుటంబునం ప్రవేశించి ఆమహా నీయుని కన్నుల తటాలున తెరిపించెను. రాజు చూపులా రాజవదనపై ప్రసరించెను. తోడనే ఆమె స్మరద్రూపమునకు వశుడయ్యెను.

సీ॥ కలిగెఁబో యీయింతి కలుకుగుబ్బలజూడ
శీతశైలాదుల సేవఫలము
కలిగెఁబో యీనాతివళులయందము జూడ
గంగాతరంగముల్ గన్నఫలము
కలిగెఁబో యీరామ కనుబొమల్యాడంగ
మును ధనుష్కోటిలో మునుగుఫలము
కలిగెఁబో యీ భామకటివిలాసముజూడ
భూప్రదక్షిణము సల్పుటకు ఫలము
తే॥ తోడుతోడనె యిటుల చేకూడవలదె
తనివిదీఱగనింక సీతన్వి గూడి
సరససంభోగ సల్లాప సరణిదేలు
నాఁడుగా ఫలియించుట నాతపంబు.

(విజయవిలాసము)

మునిరాజు మనము కామబాణపీడితమై తామరాకందలి నీరువలె కదలజొచ్చెను. సంయమితపం బెచటికిపారిబోయినదో!

హృదయమున మన్మథుడు ప్రవేశించి యాతని యా యందకత్తె కడకు జేర్చెను.

శ్లో॥ "..............................................
యది సా వనితా హృదయే రమితా
క్వ ? జపః, క్వ ? తపః, క్వ ?" సమాధిరతిః

మేనక మునిచంద్రుని మదనాలాపముల నాలించి ఆ మహర్షి ఆశ్రమమందే యుండిపోయెను. పది సంవత్సరములు

గడచెను. (ఆ పుణ్యదంపతుల కుద్భవించినదే వినీలకుంతలయగు శకుంతల)

కొంతకాలమునకు నా విశ్వామిత్రుడు తెలివితెచ్చుకొని చింతాశోక పరాయణుడై అయ్యో! "పది సంవత్సరములు వ్యర్థముగా జీవితమునుగడపితిని. బ్రహ్మర్షిత్వము పొందని యీ జీవిత మేల? జితేంద్రియుడనగు నాకు కామభోగము లేల? పరులు విినిన పక్కున నవ్వరా ? సిగ్గు ! సిగ్గు ! అయ్యయ్యో! ఈ యాడుదాని తగులాటముతో ఒకరేవు ఒకమాపువలె పది సంవత్సరములు వ్యర్థముగాగడచె. మనస్సు మన్మథబారికి వశమయ్యె. అవమానింపబడితిని".

మ॥ నరకద్వారము సాహసాకరము పు
ణ్యస్వర్గవిఘ్నంబు దు
స్తరమాయాశతపేటి దంభనిధి దో
షస్థానమప్రత్యయో
త్కరసుక్షేత్రము కాలకూటమమృతా,
కారంబుస్త్రీయంత్రముం
ధర నెవ్వాఁడు సృజించెఁ బూరుషగళో
ద్బంధక్రియాపాశముం.

(భర్తృహరి)

ఆహా ! విశ్వామిత్రుఁడట ! భోగముదానితో పొందట ! నన్ను "యీ తడువేషధారి యగు ముని" యని పరులునవ్వరా అని పశ్చాత్తాపము పొందుచు—

మ॥ ఉపవాసంబులడయ్యుటో విషయసంయోగంబువర్జించుటో
తపముంబూని చరించుటో హరిపదధ్యానంబునంనిల్చుటో
యపలాపంబున నేలబొందితి హతంబయ్యెన్ తపంబెల్ల
నీ కపటస్త్రీపరిరంభము ల్మునులకుం గైవల్య సంసిద్ధులే॥
(ఆంధ్రభాగ॥ స్కం. 9.)

అని విచారించి తన యోగదృష్టిచే యిది యంతయు దేవతల పన్నాగమని తెలిసికొని మోసపోతినిగదా! యని నిట్టూర్పువిడిచెను. మేనకయు శాపభయముచే వణకజొచ్చెను. అంత ముని అచ్చరనుజూచి నిన్ను శపించిన నేమిప్రయోజనము? ఇకపొమ్మని మధురవాక్యముల మేనకను పంపివైచి కామునుజయింప – హిమవంతమునకుజని కౌశికీతీరమందు నిశ్చలబుద్ధితో ఘోరతపమాచరింపజొచ్చెను.

మరల వేయిసంవత్సరములు పూర్తికాగా బ్రహ్మ ప్రత్యక్షమై "విశ్వామిత్రా! నీవు మహర్షివైతివి ఇక లెమ్ము" అన విశ్వామిత్రుడు తృప్తినొందక నేను మహర్షినైనచో జితేంద్రియుడనైతిగదా? యనెను. పితామహుడు ఋషీ! "వికారహేతౌ సతి విక్రియన్తె యేషాంనచేతాంసి త ఏవధీరాః" మనస్సును చలింపజేయువస్తువు లెదుటఉన్నను యెవరిమనస్సు చలింపదో ఆతడుగదా! జితేంద్రియుడు. అట్టి స్థితి సంభవించు నంతదనుక ప్రయత్నింపుము. అని బ్రహ్మ సత్యలోకమున కేగెను. విశ్వామిత్ర మహర్షియు వర్షాతపముల లెక్కచేయక వాయువునే ఆహారముగ గొనుచు తపము చేయదొడగెను. దాన ప్రపంచము తల్లడిల్ల దేవేంద్రాదులకు భయముపాటిల్లెను.

దేవాదు లీతనితపమునకు విఘ్నముచేయ రంభను నియమించిరి. రంభ సిగ్గుచేత తలవంచి ఇంద్రుని జూచి 'శచీపతీ! ఆ గాధిపుత్రు డధిక క్రోధి. వానిమాటలు విన్న నాశరీరము గడగడ లాడు చున్నది. తటాలున నేమి శపించునో యని భీతిల్లెదను.' అన, ఇంద్రు డామెతో నిట్లనెను.

వంచిత యోగిజనసమారంభా! రంభా! భయపడెద వేల! సింగారించుకునిరమ్ము. హృదయహారిణి యగు కోకిల కూయుచుండ పూవిల్తుడు తోడురా నే నీపార్శ్వమున సంచ రింతును. మనోహర వృక్షలతా పుష్పమంజరీనికుంజముల వసంతు డాశ్రయించి నిలచియుండును. దీన విరాగులు సైతము రాగులయ్యెదరు.అన విని రంభ శచీకాంతుని యాజ్ఞానుసారము క్రొంగ్రొత్త సొగసుచేసుకొని ముఖమున చిరునవ్వు మొలక లెత్త హంసగమనయై మునిచెంగట "రహిపుట్ట జంత్రగాత్ర ముల రాల్ గరగించు విమలగాంధర్వ"గానము చేయ ప్రారం భించెను. అంతలో ముని కనుదమ్ములవిచ్చి చూచి సంశయించి ఇదియంతయు శచీకాంతుని తంత్రమని తెలిసి కినుకతో కన్ను గవ కెంపువహింప "ఓసీ! రంభా! కామమునుజయింప తపంబు చేయు నన్ను పాపకార్యమని యెంచక నా తపస్సు పాడుచేసి తివిగా? ఓసీ కులటా! పదివేలసంవత్సరములు రాయివై పడి యుందువు. ఉత్తమ తపస్సంపన్నుడగు బ్రాహ్మణుడొకడు నీ శాపవిమోచన చేయగలడు. అవల నీకు శుభమగును." అన తటాలున రంభ శిలయయ్యెను. ఇట్లు శపించి మరల పశ్చాత్తా పముచే యోర్పు లేకపోయెగదా! యని తపించెను. విశ్వామి

త్రుని క్రోధమునుచూచి మన ప్రాణము లెచట తీయునోయని భయపడి ఇంద్రుడును, మన్మథుడును పరువెత్తిరి.

ఇట విశ్వామిత్రుడు కామమును జయించితిని గాని క్రోధమును జయింపలేకపోతినిగదా ? యని పశ్చాత్తాపము పొంది తిరిగి వేయిసంవత్సరములు ఘోర తపమాచరింప తూర్పుదిశ కేగెను. అట్టితరి యొకనాడింద్రుడు విశ్వామిత్రుని పరీక్షార్థమై అతడుతిను అన్నమును యాచించెను. అంత విశ్వామిత్రుడును కామక్రోధరహితుడై సిద్ధాన్నము ఇంద్రున కొసంగెను. పిమ్మట దేవతలపనుపున బ్రహ్మప్రత్యక్షమై విశ్వామిత్రా! నీవు బ్రహ్మర్షి వైతివి. అన విశ్వామిత్రుడు వశిష్ఠుడు బ్రహ్మర్షి గా నన్నాహ్వానించిననేగాని, నాకు పరిపూర్ణ విశ్వాసము గలుగదు. నేను పితామహునితో దేవతలందరు వసిష్ఠునికడకుబోయి ప్రార్థింపగా నా తపోభాగుడు "విశ్వామిత్రా ! నీవు బ్రహ్మర్షి వైతివి'' అని విశ్వామిత్రుని స్నేహము చేసికొనెను.

పాఠకులారా! ఇట్లు విమలమగు విశ్వామిత్రునిచరిత్రము శతానందుడు రామునకు తెలిపెను. జనకుడును ఆపవిత్రచరిత్ర విని విశ్వామిత్రుని కొనియాడి "గుణాబహు విధాః ప్రాప్తాస్తవ సందర్శనాన్మయా" సంయమీ!సూర్యుడు పశ్చిమాంబుధి గ్రుంక నున్నాడు. ఇది కర్మానుష్ఠాన సమయము. రేవు ఉదయమున మీ దర్శనభాగ్యము మాకు కలుగుగాక యని జనకుడు పురోహిత మంత్రి బాంధవులతో గృహమున కేగెను. రామలక్ష్మణులతో విశ్వామిత్రుడును విడిది కరిగెను.

పాఠకులారా! ఈ ప్రకరణము మానవజీవితమునకు కడు ముఖ్యమగు ఆదర్శము. ప్రతి మతస్థుడును ప్రతి దేశీయుడును, శాశ్వతమగు సుఖమును కోరును. కాని స్వల్పములగు నింద్రియ సుఖములచే భ్రమపడి కామక్రోధములకు లోనై ఆశాపిశాచమునకు దాసులై ఆ నిత్యానందమును కోల్పోవుచున్నారు. విశ్వామిత్రుడంతటి మహర్షి ఇంద్రియముల జయించుటకై యెంతయో ప్రబలప్రయత్నము చేసినటుల పఠించియుంటిమి గదా? సామాన్యులగు మానవులెంతగాఢ ప్రయత్నము చేయవలెనో మనమూహించుకొనవలెను. యేయుగమునందైనను ఇంద్రియనిగ్రహము లేక శాంతినొందిన వాడే లేడు. శాంతిలేక సౌఖ్యము లేదు. శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు సాంఖ్యము నుపదేశించి పిమ్మట ఇంద్రియములగూర్చి యిట్లుపన్యసించి యున్నాడు.

శ్లో॥ యతతోహ్యపికౌంతేయ పురుషస్యవిపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభంమనః.

తా॥ స్థితప్రజ్ఞుడగుటకు సిద్ధముగానున్న పండితునిగూడ ఇంద్రియము బలాత్కారముగ మనస్సును చలింపజేసి లోబరుకొనును.

దీనినే ప్రహ్లాదుడును ఉపదేశించి యున్నాడు.

శా॥ హాలాపాన విజృంభమాణ మదగర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకన శృంఖలా నిచయ సంబద్ధాత్ములై లేశముర్
వేలానిస్సరణంబుగానక మహావిద్వాంసులుర్ గామినీ
హేలాకృష్ట కురంగ శాబకమగుర్ హీనస్థితిర్ వింటిరే.

అట్లింద్రియములు పండితునిగూడ వశము చేయును. కావుననే గీతాచార్యుడు—

శ్లో॥ తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్యభరతర్షభ.

... ... ... ...

గీత. అ. 3. శ్లో. 41

స్థిత ప్రజ్ఞుడవగుటకు ప్రథమమున ఇంద్రియముల నిగ్రహింపుము. అట్లు ఇంద్రియ నిగ్రహము కలవానికే స్థితప్రజ్ఞత్వము దృఢమగును.

శ్లో॥ " ... ... ... ...

వశేహియస్యేంద్రియాణి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా."

ఇంద్రియము లెవరికిలోబడియున్నవో వారిప్రజ్ఞ గొప్పది. స్థిరమైనది.

శ్లో॥ "కాన్తాకటాక్ష విశిఖా న ఖనన్తి యస్య
చిత్తం ననిర్దహతి కోపకృశాను తాపః
కర్షన్తి భూరి విషయాశ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్నమిదం సధీరః."

(భర్తృహరి.)

తా॥ ఎవని మనస్సు పూవుబోడుల వాడిచూపులనెడి బాణములకుగురికాదో- ఎవనిమనస్సు క్రోధాగ్ని చే తపించదో - శబ్దాదివిషయములందగిలి లోభపాశములచే కట్టుబడదో-వాడే ధీరుడు. వానికి మూడు లోకములును వశమైయుండును.

ధీమంతులారా! శ్రీమద్రామాయణమును మనము కేవలముకథాదృష్టితో చదువుట గాక ఏతద్గ్రంథమునందలి వ్యక్తుల

ఆధ్యాత్మిక—జీవితానుభవములు గ్రహించి, చదువరి తనజీవితాంశములతో మేళవించు కొనవలయును. అపుడే కావ్యపఠనా ప్రయోజనము సంపూర్ణముగ సిద్ధించును.

## —♦ హరధనుర్భంగము ♦ —

లోకబాంధవు డుదయించెను. జనకచక్రవర్తి హుతాగ్నిహోత్రుడై, మంత్రి పురోహితులతో కొలువుదీర్చి రాకుమారులతో గూడ విశ్వామిత్రు నాహ్వానించెను. బ్రహ్మతేజోవిరాజితుడగు విశ్వామిత్ర మహాముని నృపబాలురతో జనక సభ నలంకరించెను. చక్రవర్తి అర్ఘ్యపాద్యముల వారిని పూజించి మునిచంద్రుని తన కర్తవ్యము నాజ్ఞాపింపుమని ప్రార్థించెను. విశ్వామిత్రుడు రాజా! ఈ దశరథపుత్రులు ప్రపంచమున ప్రసిద్ధికెక్కిన వీరులు. నీధనువును చూడగోరి నిచటికేతెంచిరి. ఆ ధనువును వీరికి చూపి వీరి కోరికనెరవేర్పుము. అన జనక మహారాజు విశ్వామిత్రునితో ధనస్సునుగూర్చి చెప్పదొడగెను. మహాత్మా! పూర్వము త్రిపురాసురసంహారకాలమునవిశ్వకర్మచే దేవతలు రెండుధనస్సుల నిర్మింపజేసిఒకటి విష్ణువునకును, ఒకటి రుద్రునకునుయిచ్చిరి ఒకప్పుడు దక్షయజ్ఞమందు రుద్రునకుభాగ మివ్వకనే దేవతలందరు హవిర్భాగముల గ్రహించుచుండిరి. దాన, రుద్రుడుకోపించి ఆ ధనస్సును వెక్కుపెట్టి దేవతల వధింతునని విజృంభించెను. అంత దేవతలందరు మహేశ్వరుని ప్రార్థింపగా ఆ దేవదేవుడు శాంతినొంది ఆధనస్సును దేవతల కొసంగెను. ఆ దేవతలు మాపూర్వుడగు దేవరాతునకొసంగిరి

అదిమొదలు ప్రతిదినము పూజింపబడుచు నీధనస్సు మాయింటనే యున్నది. పిమ్మట కొంతకాలమునకు నే జన్నముచేయ నభిప్రాయము గలవాడనై భూమిని దున్నుచుండ నందు నాగేటి చాలున నొక బంగారు పేటిక కాననయ్యెను. అందు చిన్నారి నెలత యొకర్తు దివ్యకాంతితో ప్రకాశించుచుండెను. నాగటి చాలునందు దొరకుటచే నా చిన్నారిపొలతుకకు "సీత" యని పేరిడితిని. మునిచంద్రమా! ఈ పొన్నారిచిరుత మనుష్యులవలె జన్మింపక— అయోజనియై— పవిత్రయై— జన్మించెను. ఈమెను నేను పోషించితిని. ఈలోకసుందరిని అనేక రాజకుమారులు కాంక్షించిరి. కాని, ఈకన్య వీర్యశుల్క— యని యెరిగి యెవ్వరికిచ్చి వివాహముచేయక "రాజకుమారులారా! ఈ నా కూతురు వీర్యశుల్క. ఈ శివు విల్లు నెక్కు— వెట్ట నెవరుసమర్థులో వారే యీ కన్యను వివాహమాడదగి యున్నారు. దుర్బలులగు వారికివ్వజాలనన రాజాధి రాజకుమారులెందరో వచ్చి చూచి యత్నెత్తాడును విల్లుకోపునకు తగిలింప లేకయు, వింటి నెత్తలేక యుండ, వారలకీ కన్యనీయనంటిని. అంత వారందరు నాపై యుద్ధమునకు సిద్ధపడి మిథిలను ముట్టడించిరి."

"అట్లొక్క— సంవత్సరముగడువగా నాసాధనములన్నియు క్షీణించెను. అంత నేను గొప్ప తపస్సుజేసి దేవతలను మెప్పింప వారు సంతసించి చతురంగబలము నొసంగిరి. ఆ సేనల సహాయముతో వీరమానులగు విరోధుల నెల్లరను, యోడించితిని. ఆ ధనురత్న మియ్యదియు." దాని రామలక్ష్మణులకు చూపెద.

రాముడీ ధనస్సును మోపెట్టగలిగనేని అయోజనియగు సీతను శ్రీరామచంద్రునకిచ్చి వివాహముగావించెద. అన విశ్వామిత్రుడు ధనస్సును రామునకు చూపుమనెను. జనకచక్రవర్తియు ఆ ధనూరత్నమును తెచ్చుటకు గొప్ప బలాఢ్యులను ఐదువేలమందిని పంపెను. యెనిమిది చక్రములు గల ఆ ఇనుపపెట్టెను వారతి ప్రయత్నమున త్రోసుకొని సభాస్థలినుంచిరి. జనకచక్రవర్తి రామచంద్ర మునిచంద్రుల చూచి దేవదానవ యక్షరాక్షస కింపురుషాదులు సైతము దీనినికదల్ప లేకపోయిరి. యిక మానవులను గురించి వేరు చెప్పవలయునా ?

అన జనకుని వాక్యములువిని విశ్వామిత్రుడు మందహాసముతో రామునిచూచి వత్సా! రామచంద్రా! ఇదిగో ధనస్సును చూడు మని యాజ్ఞాపించెను. రాముడు గురువాక్య ప్రబోధితుడై ధనుః పేటికయొద్దకుబోయి తలుపులు తెరచి – చూచి మునిచంద్రమా! ఆజ్ఞయొసంగిన యెడల నవశ్యము దీనిని వెలువరించి అల్లెత్రాడు నెక్కించ ప్రయత్నించెద ననెను విశ్వామిత్ర జనకు లిద్దరు వల్లెయనిరి.

అనంత బలపరాక్రమ సంపన్నుడగు శ్రీరామచంద్రుడా శివధనస్సును మధ్యభాగమునుబట్టి నవలీలగా యెత్తి రాజులందరు చూచుచు నచ్చెరువొందుచుండ యల్లెత్రాటిని విల్లున కెక్కించ ఆ కర్ణాంతము లాగెను. తోడనే యా ధనస్సు బిగువుతప్పి ఫెల్లుమని రెండుగా విరిగెను. విరిగిన యా వింటి ధ్వని దశదిశలు నిండెను. భూమి కంపించెను. విశ్వామిత్రుడు

జనక మహారాజు రామలక్ష్మణులు తప్ప సభలోనున్న రాజాధిరాజులు సైతము గుండెలదరిపడ మనస్సుభ్రమింప స్మృతి తప్పి ఎటులనున్నవా రటులనే నేలపై బడిరి.

పాఠకులారా! ఈ ధనుర్ధ్వనిని భోజభూపతి మనోహరముగా వర్ణించియున్నాడు.

శ్లో॥ "రామాకర్షణ భగ్నకార్ముక భువాధ్వానేన రోదోరుధా
దృప్తక్షత్ర యశః సితచ్ఛత కులేజీమూతనాదాయితం
వీరశ్రీ ప్రథమప్రవేశసమయే పుణ్యాహ ఘోషాయితం
సీతాయాః కిల మానసే పరిణయె మాంగళ్యతూర్యాయితం"

తా॥ శ్రీరాముడు శివధనుర్భంగమొనర్చినపు డుదయించిన ప్రచండనినాదము భూనభోంతరాళముల వ్యాపించి క్షత్రవీరుల యశస్సులనెడి రాజహంసలకు మేఘమయ్యెను. (వర్షాకాలమున హంసలుపారిపోవుట సుప్రసిద్ధము) జయలక్ష్మియొక్క ప్రథమ సమాగమమునకు పుణ్యాహఘోషమై సీతాపరిణయమునకు మంగళధ్వనియై విలసిల్లెను.

పిమ్మట నెట్టకేలకు సభ్యులందరు తెలివినొంద జనకమహారాజు విశ్వామిత్రునిజూచి యిట్లనెను. దేవదానవాదులకు గూడనలవిగాని యీ ప్రతిన నెట్లు నెరవేర్తునా? నాకన్యకకు తగువరు డెవ్వడా? యని చాలవిచార పడుచున్నాను. నా పూర్వపుణ్య విభవముచే నీలే బ్రాయపు రాకుమారులతో మీరు ప్రత్యక్షమైతిరి. మునిచంద్రా! రామచంద్రుని దోశ్శక్తి అద్భుతము-నచింత్యమునై యున్నది. ధనస్సును వెక్కు-పెట్టుట గాక తునియలుగా నొనర్చెను.

కావున అయోనిజయగు నాసీత నిచ్చి వివాహముచేయ సిద్ధముగ నున్నాను. మీ ఆజ్ఞయైనచో దూతల నయోధ్యకు పంపెదనని ముని యాజ్ఞచే దూతలను అయోధ్యకు పంపెను.

రాజ ప్రేషితులగు దూతలు గుఱ్ఱములు అలసిపోవ పరువెత్తించుచు త్వరితగతిని మూడహోరాత్రములు ప్రయాణముచేసి నాల్గవనాడు అయోధ్యకు జేరిరి. పిమ్మట వృద్ధుడయ్యును దేవతేజో విరాజితుడగు దశరథుని జూచి భయము విడచి, దండములిడి,మృదుమధురములగు వాక్యములతో మనోహర భావములతో "మహారాజా! మేము జనకమహారాజు దూతలము. జనకమహారాజు అగ్నిహోత్ర పురస్సరముగ మంత్రిపురోహితుల యోగక్షేమము లరయుచు విశ్వామిత్రుని యాజ్ఞనొంది యొకవర్తమాన మంపెను.

"రాజేంద్రా! నాకుమార్తె యగు సీతవీర్య శుల్కయని మీకు విదితమెగదా! అట్టి ప్రతినను నెరవేర్చలేక యెందరో రాజపుత్రులు విఫలులైరి. నా పూర్వపుణ్య విభవముచే విశ్వామిత్రునితో నీ కుమారులు ఆకస్మికముగ వచ్చి రాజాధి రాజులతోగూడిన నిండుసభలో నీ పుత్రుడగు రామచంద్రుడు చూపరుల గుండియలు దిగ్గురన నావింటిని రెండుగా విరిచెను. రామచంద్రమూర్తికి నాకుమార్తె యగు సీతనిచ్చి వివాహము చేసి నా కూతురు వీర్యశుల్కయని నేజేసిన ప్రతిజ్ఞ సార్థకము జేసుకొనదలచి యున్నాడను. మీ బంధుత్వము అన్నివిధముల కొనియాడదగినది. సోపాధ్యాయ పురోహితులతో గూడ శీఘ్రము

ముగ దయచేయు మని ప్రార్థించుచున్నాను. అను జనకుని వాక్యముల నివేదించి దూత లూరకుండిరి.

ఆయమృతము లొలుకు కుమారుల వివాహమహోత్సవ సందర్భములగు వాక్యములువిని దశరథుడు హర్షాతిశయముచే నుప్పొంగుచు వశిష్ఠ వామదేవాది ఋషులను మంత్రులను రావించి యిట్లనెను. కౌసల్యా నందవర్ధనుడగు రామచంద్రుడు విశ్వామిత్రునిచే సురక్షితుడై లక్ష్మణునితోగూడ జనక రాజధానియగు మిథిల యందున్నాడట; రాముని బలపరాక్రమమునకు మెచ్చి జనకుడు తన కుమార్తెయగు సీత నిచ్చుటకు సంసిద్ధముగానున్నాడట; జనకుని సంబంధము మన కనుకూలమగుచో మిథిలాపయనమున కాజ్ఞయొసంగుడనివశిష్ఠాదుల యాజ్ఞగొని, మంత్రిసత్తములనుశీఘ్రముగ పయనముగండని యాజ్ఞాపించెను. మంత్రిపురోహితులు మఱుసటి దినమున ప్రయాణము నిశ్చయించిరి. ఆమనోహరమగు రాత్రిగడచెను. మఱునాడుదయమున వశిష్ఠాది మహర్షుల రథములు ముందునడువ నానావిధ ధననివహములతో చతురంగబలముతో దశరథ మహారాజు మిథిలకు పయనమయ్యెను. నాల్గవనాటి మధ్యాహ్నమునకు విదేహనగరమును జేరిరి. జనకమహారాజు సంతుష్టాంతరంగుడై వశిష్ఠాది మహర్షులను దశరథుని అర్ఘ్యపాద్యాదులొసంగి పూజించెను. దశరథునిజూచి "రఘుకుల తిలకా! ధర్మస్వరూపులును, శౌర్యోదయులునగు మీ బాంధవ్యమున మావంశము పావనమాయెను. వశిష్ఠాదిమహర్షుల సందర్శించు విశేషసంపద నాకు లభించెను.

"శ్వః ప్రభాతే నరేన్ద్రేదం నివర్తయితు మర్హసి
యజ్ఞస్యాన్తే నరశ్రేష్ఠ వివాహమృషిసమ్మతం."

రేపటికి యజ్ఞముపూర్తికాగలదు. అనంతరమున ఆర్షమగు వివాహమును నెరవేర్తుపుగాక" అని దశరథుడు జనకుని జూచి మందహాసముతో రాజా! "ప్రతి గ్రహోదాతృవశః" ప్రతిగ్రహము దాతవశమనిగదా? పెద్దలు చెప్పుదురు. గాన, నీవు చెప్పిన చొప్పున ఆచరించుటె మాకర్తవ్యము. అట్లువారు సరస సల్లాపములతోడను, విందులతోడను, ఆరాత్రిగడిపిరి.

మరునాడు ప్రాతఃకాలముననే లేచి జనకమహారాజు సంధ్యాది కృత్యములనెల్ల దీర్చి తన పురోహితుడగు శతానందుని అనుజ్ఞచే తన సోదరుడగు కుశధ్వజుని రావించెను. ఆతనితో ధనుర్భంగ వృత్తాంతమంతయుచెప్పి ఆతనియాలోచనము చొప్పున మంత్రిసత్తముడగు సుదాముని పిల్చి దశరథుని తోడి తెమ్మనెను. దశరథుడు మంత్రి బాంధవ పురోహితులతో జనకసభ నలంకరించి, జనకసపర్యల గైకొని, "విశ్వామిత్రాది మహామును లనుమతింతురేని మావంశవిధమెల్లను మాకుల దైవతమగు వశిష్ఠమహాముని చెప్పును" అని యూరకుండెను. అంతవశిష్ఠుడు సూర్యవంశము నిట్లు చెప్పదొడగెను.

అవ్యక్త సంభవుడగు చతుర్ముఖ బ్రహ్మకు మరీచి జన్మించెను. ఆతనికి కశ్యపుడు; ఆతనికి వివస్వంతుడు; వివస్వంతునకు మనువు, మనువునకు ఇక్ష్వాకువు. ఇట్లుమనువంశము సుప్రసిద్ధులగు పురుషులతో క్రమమున వృద్ధిపొంద అజ

మహారాజునకు దశరథుడుపుట్టెను. ఈతని పుత్రులే రామలక్ష్మణులు. వీరి బలపరాక్రమముల నేవర్ణింపజనిలేదు గదా! రాజా! మూలపురుషునిదగ్గరనుండికూడ పరిశుద్ధవంశ్యులగు నీ రామలక్ష్మణులకు సదృశవంశజాతయగు సీతనిచ్చి ధన్యుడవుకమ్మని యూరకుండెను. ఆవాక్యములవిని జనకుడు మునీంద్రా! కన్యాదాతవంశముకూడ తెలియదగినది గదా! మావంశమున మూలపురుషుడు నిమి ఈతనికి మిథియనువాడు జన్మించి మిథిలయను పత్తనమును నిర్మించెను. ఈతడే మొదటి జనకుడు. క్రమముగా మా వంశమునకు జనకవంశమని పేరుగలిగెను. ఇట్లుక్రమముగా రాగా నాతండ్రిహ్రస్వరోముడు. అందునేను పెద్దవాడను. నాతండ్రి తపమునకు బోవుచు నాతమ్ముడగు కుశధ్వజుని నాకప్పగించెను. కొంతకాలమునకునాతండ్రి స్వర్గస్థుడాయెను. ఒక సాంకాశ్యాధిపతియగు సుధన్వుడు సీతను శివచాపమునుగూడ నాకిమ్మని దూతనుబంపెను. నే దాని నంగీకరింపని కారణముచే సుధన్వుడు మాపైకి దాడివెడలెను. నేను వాని వధించి సాంకాశ్యపట్టణమునకు నాతమ్ముని ప్రభువుగా జేసితిని. ఇదినావంశ వృత్తాంతము.

రామలక్ష్మణుల కిద్దరకును నాకుమార్తెల సీతాఊర్మిళల నిచ్చెద. విల్లు విరిచినది శ్రీరాముడేయైనను లక్ష్మణుడు కూడ రామునితో సమానమగు బలపరాక్రమసంపన్నుడే కాన, ఊర్మిళను వీర్యశుల్కగానే భావించి మీ యాజ్ఞప్రకారము వివాహముచేసెదను. అని దశరథుని చూచి రాజా! నీ కుమారులకు గోదానవ్రతము - నాందీశ్రాద్ధము—కూడ చేయింపుము.

నేడు మఖా నక్షత్రము. ఎల్లుండి యుత్తరఫల్గుని నక్షత్రము. ఆనాడె రామలక్ష్మణులకు వివాహము. అని జనకమహారాజు పలుకగా విశ్వామిత్రముని మీ ఉభయవంశములును సమాన ధర్మము కలవగుటచే కొనియాడదగినవి. "సదృశో ధర్మసంబంధ స్సదృశో రూపసంపదా" కాని రాజా! నీ తమ్ముడగుకుశధ్వజుని కుమార్తెల నిద్దరను భరత శత్రుఘ్నులకిచ్చి వివాహము చేయుమన అచ్చటి సభాసదులు తమ సంతసములకూడ తెలిపిరి.

"జనకానాం రఘూణాంచ సంబంధః కస్యనప్రియః
యత్రదాతాగ్రహీతాచ స్వయంకుశిక నందనః."

— ఉత్తరరామచరిత్ర.

తా॥ జనక వంశస్థులును రఘువంశస్థులును వియ్యమొందుట ఎవ్వరకు సంతోషముగూర్పదు? కావుననే ఈ సంబంధమున కన్యాదాతలు ప్రతిగ్రహీతలు మహా తపస్సంపన్నులగు విశ్వామిత్రులై యుండిరి. జనక చక్రవర్తియు విశ్వామిత్రు నాజ్ఞను శిరసావహించి మాండలీ శృతకీర్తులను భరతశత్రుఘ్నులకు నిశ్చయించెను.

## —♦ సీతాకళ్యాణము ♦—

మరునాడు ప్రాతఃకాలమున దశరథుడు నలుగురు కుమారులకు శాస్త్రోక్తముగా నాంది పూర్తిచేసి కుమారుల తేజోభివృద్ధికై గోదానవ్రతమును చేసెను.

ఆ దినముననే కేకయ కుమారుడగు యుధాజిత్తు తండ్రి పంపున తన మేనల్లుడగు భరతునిచూచుటకు అయోధ్యకువచ్చి

యచట దశరథాదుల గాంచి విచారించి మిథిలా నగరమునకు విచ్చేసెను. దశరథుడు సత్కారములనలిపి యుధాజిత్తు రాక కానందించెను.

మరునాడు ప్రభాతమున దశరథమహారాజును నిత్య కర్మల నిర్వర్తించి పుత్రుల వివాహోత్సవమునకై పయన మయ్యెను. వశిష్ఠాదిమహర్షులు స్వస్తివాచనములతో ముందు నడుచుచుండిరి. మంగళవాద్యమంజులధ్వనులు వీనుల కింపు గూర్చుచుండెను. అట్లి సుముహూర్తమున దశరథుడు నల్వురు పుత్రులతో జనక యజ్ఞవాటమును ప్రవేశించెను.

వశిష్ఠుడు విశ్వామిత్ర శతానందులు తనకు తోడుకాగా మంటపమధ్యమున వివాహ వేదికను సువర్ణ పాలికలతోడను, సుగంధ ద్రవ్యములతోడను హరితాక్షతలతోడను, స్రుక్-స్రువ ములతోడను, దర్భలతోడను అలంకరింప జేసెను.

అనంతరము వేదియందు శాస్త్రోక్తముగా మంత్రపూత మగు అగ్నినుంచి హోమమునకుపూనుకొనెను. అంత జనకచక్ర వర్తి సీతను రాముని కభిముఖముగానుంచి-రామచంద్రునితో-

శ్లో॥ *ఇయంసీతా మమసుతా సహధర్మచరీతవ
ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణింగృహ్ణీష్వపాణినా॥
పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా
ఇత్యుక్త్వాప్రాక్షిపద్రాజా మంత్రపూతంజలంతదా॥"

---

* ఎదుటనున్న సీతనుగూర్చి "ఇయంసీతా" ఈసీత అనుటకు కారణమేమ నగా। సీతయొక్క సౌందర్యమును- సౌకుమార్యమును- లావణ్యమును- ప్రత్యక్ష ముగా రామునకు చూపుచు "ఈసీత" అని నిర్దేశించెను. లేక రామా। సౌందర్యాది సుగుణములందు నేనే శ్రేష్ఠుడనని భావింపకుము. ఈసీతకూడ నీకు సమానురాలే

తా॥ రామచంద్రా ! ఈసీత నాపుత్రిక. నీకు సహధర్మచారిణియై ప్రవర్తించునుగాన, ఈమెను పాణిగ్రహణ మొనర్చుము. ఇందువలన నీకు మంగళముచేకూరగలదు. ఈమె కడు పతివ్రతయై చెట్టును నీడ అనుసరించినట్లు నిన్ననుసరించును. అని మంత్రపూతమగు జలమును రాముని దోసిలియందుంచెను. దేవతలు పుష్పవర్షముల గురిపించిరి. దేవదుందుభులుమ్రోగెను. దేవఋషులు ఆనందసాగర తరంగముల నోలలాడిరి.

ఇక విధి విధానమున లక్ష్మణున కూర్మిళను, భరతునకు మాండవిని, శత్రుఘ్నునకు శ్రుతకీర్తినిచ్చి పాణిగ్రహణ మొనర్చెను. అట్లు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు పాణిగ్రహణ మొనర్చి అగ్నికి ప్రదక్షిణ నమస్కారములు గావించి విధిపూర్వకముగ వివాహమాడిరి. మరునాడు విశ్వామిత్ర మహర్షి నూత్న వధూవరుల దీవించి దశరథుని సమ్మతిగొని

---

ననుభావముతో ''ఈసీత'' అనెను. లేక సీత తనుకాంతి మెరుపుతీగవలె మెరయుటచే రాముని నేత్రభ్రమను పోగొట్టుటకై ''ఈసీత'' అనెను. లేదా: ఆరత్నమంటపమునందుండు ప్రతిరత్నకంబమునందును సీత ప్రతిబింబించుటచే ప్రతిబింబముల జూచి రాముడు భ్రమపడునేమోయని ''ఈసీత'' అనెను.

పాఠకులారా ! ఇక సీతాఅను మొదలగుపదముల భావముల కనుగొందము.

సీతా=అనుటచే నాగలిచాలున బుట్టినది సామాన్యజీవులవలెగాక అయోనిజ, మమసుతా=జన్మస్థాన మెంతపవిత్రమైనదో ఈమె పెరిగిన వంశముగూడ నంత పవిత్రమైనదని భావము. సహధర్మచరీతవ=ఈమె నీకు కేవలము కామము ననుభవించుటకేగాక నీతోగూడ ధర్మమునకు తోడ్పడి ధర్మారాధన చేయునని భావము. మన ఆర్యమతము ననుసరించి వివాహముయొక్క ముఖ్యోద్దేశమిదియే.

ఛాయేవానుగతా సదా=చెట్టును విడిచి నీడ యెట్లుండదో ఈమెయు నిన్ను విడిచి యుండదు. ఛాయను బట్టియెగదా బాటసారి చెట్టుక్రిందకు బోవును. అట్లె అతిథులు గృహస్థునే ఆశ్రయింతురు. గాన కవి "ఛాయా"శబ్దమును వాడియున్నాడు.

హిమశైలమునకు తపమాచరింపబోయెను. వివాహానంతరము దశరథుడును జనకుననుజ్ఞగొని అయోధ్యకు ప్రయాణమాయెను. జనకమహారాజు తనముద్దుకుమార్తెల కెన్నెన్నియో ఆభరణములను దాసదాసీజనములను కానుకల నిచ్చి సాగనంపెను.

మన దేశమునందు అనేకవిధములగు మతములు కలవు. కొన్ని మనదేశమున బుట్టినవి. మరికొన్ని మనదేశమునబుట్టి నానా దేశముల వ్యాపించినవి. కొన్ని యితరదేశములనుండి మన దేశమునకు వచ్చినవి. కాని యేమతములు ఎట్టివైనను మానవుల దృష్టి పథములు, సంఘవ్యవస్థలు, ఎట్టులున్నను నేటివరకు స్త్రీ పురుష సంబంధ విషయమునను, భార్యాభర్తల బాధ్యతా విషయమునను, అట్టి స్త్రీ పురుష సంబంధమునకు ప్రధాన హేతువు వివాహము. ఆ వివాహము ఏకరూపముగాక జాతులనుబట్టి నాగరికతనుబట్టి నానారూపములుగా విభజింపబడినది. ఐనను నాగరికులమని తలంచువారి ప్రక్రియ ఏకరూపముగానే యున్నదని చెప్పవచ్చును. అట్టి ప్రక్రియకు ప్రధానహేతువగు ఆర్ష సాంప్రదాయమును యీ క్రింద నిరూపించుచున్నాను. వివాహమును రెండుభాగములుగ విభజింపవచ్చును. మొదటిదికన్యావరులయోగ్యతాయోగ్యతలవిచారము రెండవది భార్యాభర్తల సంసారనిబంధనలు. ఒకటవదగు కన్యావరుల యోగ్యత ప్రథమమున గమనింతము ఋషులు ఎట్టివరునకు ఎట్టికన్య అర్హురాలను విషయమును, ప్రజల ఆరోగ్యమును కోరియు సంఘమును సరియైన స్థితిలో నుంచదలచియు విమర్శక దృష్టితో నిరూపించిరి.

అందలికొన్ని విషయములను యీక్రిందనిచ్చుచున్నాను.

శ్లో॥ శీలం వృత్తంచ విజ్ఞాయవృత్తిం యోనించ కర్మచ
సద్భిరేవం ప్రదాతవ్యాకన్యా గుణవతేవరే.

తా॥ శీలమును, వృత్తిని, విద్యను, తల్లి దండ్రులను, ఆచారములను, పరిశీలించి గుణవంతుడగు వరునకు కన్యనీయదగును.

పై విషయమునుబట్టి వరుని వంశము మొదలగువానిని విచారించి కన్య నీయవలెనని తేలుచున్నది. కావుననే జనక దశరధులు వంశముల దెలుపుకొనిరి.

అంతేగాక ఏజాతివారు ఆజాతికన్యను వివాహము జేసుకొనవలెను. ఇందువలన వృత్తిలో సౌకర్యముకలుగుటయు వృత్తి సాంకర్యము లేకపోవుటయును, దేశవ్యవస్థయును, స్థిరపడును. ఇది మన ప్రాచీనుల ముఖ్యోద్దేశము. ఇట్టి జాతిమాత్ర సంబంధమున్నను కన్యావరులు వివాహయోగ్యులు కారు. ఏలయన కొన్నివ్యాధులు వంశపరంపరగా వచ్చుచుండును.

కొన్ని అలవాటులు కొన్నిగుణములు తల్లిదండ్రుల వలన కన్యావరులకు సంక్రమించును. ఈ విషయము రామాయణమున కైక వృత్తాంతమునందు కొంతవరకు చెప్పబడి ఉన్నది. కావుననే మనుస్మృతి.

శ్లో॥ మహాంత్యపి సమృద్ధాని గోజావిధనధాన్యతః
స్త్రీ సంబంధె దశైతాని కులాని పరివర్జయెత్.

తా॥ ఎంత పశుసమృద్ధి కలిగినను ధనధాన్యములున్నను క్రిందచెప్పబోవు దోషములుగల స్త్రీ పురుషవంశములు వివాహమునకు పనికిరావు.

"హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసం
క్షయ్యామయా వ్యపస్మారి శ్విత్రి కుష్ఠ కులానిచ."

తా॥ సంస్కారములేనివియు, పురుషసంతతిలేనివియు, విద్యావిహీనమైనవియు, శరీరమంతయు వెంట్రుకలచే నిండినవారును, అర్శరోగము (మూలవ్యాధి), క్షయవ్యాధి, మూర్ఛ, బొల్లి, కుష్ఠు, మొదలగు వ్యాధులుగల వంశములు వివాహమునకు పనికిరావు.

వివాహములు 8 విధములుగా నిరూపింపబడినవి

1. బ్రాహ్మము
2. దైవము
3. ఆర్షము
4. ప్రాజాపత్యము
5. ఆసురము
6. గాంధర్వము
7. రాక్షసము
8. పైశాచము

1. విద్యావంతుడగువరుని స్వయముగాపిలచి తగుపూజలొనర్చి కన్యదానముచేయుట బ్రాహ్మవివాహము.

2. యజ్ఞమొనర్చు వాడు యజ్ఞసమయమున తన కన్యను ఋత్విక్కునకొసంగుట దైవవివాహము.

3. వరునివలన గోమిధునమును తీసుకొని కన్యనొసంగుట ఆర్షవివాహము. (కన్యాశుల్కమనిభావము)

4. కన్యనొసంగునపుడు మీరిద్దరుకలసి ధర్మమునాచరింపుడని వరుని బోధించి కన్యనొసగుట ప్రాజాపత్య వివాహము.

5. కన్యాదాతకు కొంతద్రవ్యము నొసంగి కన్యను గ్రహించుట ఆసురము.

6. స్త్రీ పురుషుల పరస్పరానురాగముచే ఒకరినొకరు ప్రేమించుకొనుట గాంధర్వ వివాహము.

7. బలాత్కారముగ కన్యనుగొనిపోయి వివాహముజేసుకొనుట రాక్షస వివాహము.

8. నిద్రపోవుచుండగాగాని ఒడలెరుంగని సమయమందుగాని దొంగతనముగా గాని నెత్తుకొనిపోవుట పైశాచము.

కాని, ఆ వివాహము లన్నియు అన్నిజాతులవారికిని సంబంధించినవికావు. జాతినిబట్టి ఆచారమునుబట్టి ధర్మాసక్తిని బట్టి వ్యవస్థచేయుటలో మన ఋషులు బ్రాహ్మణాది నాగరిక జాతులకు బ్రాహ్మ ప్రాజాపత్య దైవ ఆర్షాది వివాహములను ముఖ్యముగానిరూపించిరి. అందు స్త్రీ పురుషులకు ఒకవిధమైన స్థిరసంబంధమును కల్పించిరి. దీనిచే స్త్రీని పురుషుడుగాని, పురుషుడు స్త్రీనిగాని ఒకరినొకరు అతిక్రమించి యేకార్యమును చేయక పార్వతీ పరమేశ్వరులవలె శరీరభేదమునుకూడ గమనింపక సమానస్వాతంత్ర్య గౌరవములతో సుఖముగా జీవింపగలరు. ఈవిషయమును తెలుపుటకై వివాహమునందు వరుడు వధువునుగూర్చి పఠింపబడుచున్న మంత్రమును ప్రదర్శించుచున్నాను.

"సఖాస ప్తపదాభవ సఖాయౌస ప్త పదాబభూవ సఖ్యంతే గమేయగ్ం సఖ్యాత్తే మాయోషగ్ం సఖ్యాన్మేమాయోష్ఠాస్సమయావ సంకల్పావహై, సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ, ఇషమూర్జమభిసంవసానౌ సంనౌమనాగ్ంసిసంవ్రతా సముచిత్తాన్యాకరం సాత్వమస్యమూహమమూహమస్మి సాత్వం ద్యౌరహం పృథివీత్వగ్ం రేతోహగ్ంరేతోభృత్వం మనోహమస్మివాక్త్వగ్ం సామాహమస్మ్యృక్త్వగ్ం సామామనువ్రతా

భవ, పుగ్ంసెపుత్రాయవేత్తవె శ్రియైపుత్రాయవేత్తవ ఏహి సూనృతె,"

వివాహ మంత్రము. సప్తపది.

సఖా సప్తపదా భవ= యేడడుగులను దాటియున్న నీవు (నాకు)స్నేహితురాలవగుము (సఖాయౌ సప్తపదాబభూవ)నీవు నేను ఏడడుగులు వేయుటచే మనమిద్దరము స్నేహితులమగు చున్నాము. సఖ్యం తెగమెయం = నేను నీయొక్క సఖ్యమును పొందుచున్నాను. సఖ్యాత్తెమాయోషం = నేను నీయొక్క స్నేహమును వదలించుకొనను సఖ్యాన్మెమాయోష్ఠా = నీవునా యొక్క స్నేహమును వదలకుము. సమయావ=స్నేహముతో నుండుము. సంకల్పావహై = చేయవలసినకార్యముల మన మిద్దరము విచారించి నిశ్చయించుకొందము. సంప్రియౌ=పర స్పరము ప్రీతి గలవారమై, రోచిష్ణూ = పరస్పరాశ్రయముచే ప్రకాశించువారమై, సుమనస్యమానౌ = మంచిమనస్సుతో కూడిన వారలమై, ఇషం = అన్నమును, ఊర్జం = బలమును, అభిసంవసానౌ కలసియనుభవింతము, భోగములను నేను ఒక్కడనే అనుభవింపను. సమానహక్కులు కలిగి సమానముగ అనుభవింతమని భావము సంనౌమనాగ్ంసి:—మనయిద్దరి మన స్సును ఏకముచేయుచున్నాను. సంవ్రతాసముచిత్తాన్యాకరం నేచేయు ప్రతిధర్మము, వ్రతములు ఈ వధువుతోకూడా చేయు చున్నాను. సాత్వమస్య మూహామమూహామస్మి=ఓ స్త్రీ! నేను సామవేదస్థానమందున్నాను. నీవు ఋగ్వేదస్థానమందున్నావు. (ఋగ్వేదసామవేదములకు స్వరభేదముతప్ప విషయభేదములు

లేవు.) సాత్వందాయరహం పృధివీత్వం = నేను ఆకాశమును—నీవు భూమివి. (భూమియొక్క ఛాయయె ఆకాశము) రేతో హంరేతో భృత్వం = నేను రేతస్సును. నీవు నా రేతస్సును భరించుదానవు.అనగా నాచేనుంచబడు రేతస్సునుభరించుదానవనిభావము.) మనోహమస్మివాక్త్వంనేనుమనస్సు-నీవు వాక్కు—మనస్సుచింతించిన కార్యము నే వాక్కు—చేయును. అట్లు మన మిద్దరము పరస్పరమై ప్రీతితో మెలగుదమని భావము. సామా మనువ్రతాభవ = అటువంటి నన్ను అనుసరించి యుండుము. ఎందుకనగా! పుగ్ంసేపుత్రావె త్తవే శ్రియైపుత్రాయవే త్తవ ఏహిసూనృతె ఓ మృదువచనములు గలవధూ! పుత్రసంతతిని పొందుటకును, ధనసంపత్తిని పొందుటకున్ను.

ఏమి! భారతీయుల వైవాహికధర్మము ! దీనిని కోల్పోవుటకంటె భారతీయులకు దురదృష్ట మింకొకటిలేదు.

పై మంత్రవిషయమునుపట్టి మన భారతీయుల స్త్రీ, పురుష సంబంధమెట్టిదో మనకు స్ఫుటముగా తెలిసి యున్నది. వివాహ విషయమున మరియొక విషయముకూడ గమనింపవలసి యున్నది. వివాహము కేవలము విషయసుఖములకుమాత్రమే గాదు. మానవుడు మూడుఋణములతో జన్మించును.

(1) ఋషిఋణము. ఈఋణము గుర్వనుగ్రహముచే విద్యాభ్యాసమున తీర్చవలయును.

(2) దేవఋణము — దీనిని యజ్ఞములద్వారా తీర్చవలెను.

(3) పితృఋణము—దీనిని సంతానవంతుడై తీర్చవలెను.

పై 2. 3. ఋణములు తీర్చుటకు పత్ని కావలెను. (పై చెప్పినప్రకారము మంత్రపూతముగ పరిగ్రహించిన స్త్రీ ధర్మ పత్ని యనబడును. గాని-కామపూర్వముగ తన యిచ్చవచ్చిన స్త్రీని జాతిభేధములు లేక పరిగ్రహించినచో, (ఉంపుడుకత్తె అనిపించుకొనును.)

అట్లు దేవతలు తమఋణమును తీర్చుకొనుటకై కన్యను పవిత్రవంతురాలిగా నొనర్చి మనకు యిచ్చుచున్నారు.

"సోమోదదద్గంధర్వాయగంధర్వోదదదగ్నయె దయించ పుత్రాగ్శ్చాదాదగ్నిర్మహ్యామధోఇమాం"(వివాహమంత్రము) సోముడు గంధర్వునకును, గంధర్వుడు అగ్నికిని, యివ్వగా అగ్ని ధనమును పుత్రులును కలుగునట్లు అనుగ్రహించి ఈమెను మనుష్యునకు యిచ్చెను. ఇట్లు యిచ్చిన దేవతల మరచి కామ భోగముల ననుభవించువారిని గీతాకారుడిట్లువచించియున్నాడు

శ్లో॥ ఇష్టాన్ భోగాన్హివో దేవాదాస్యంతె యజ్ఞభావితాః
తైర్దత్తానప్రదాయైభ్యో యోభుంక్తే స్తేనఏవసః.

మీరు చేయు యజ్ఞములచే సంతోషించి దేవతలు మీకు వలయుపదార్థము లిచ్చెదరు. మీరు మరల వారి కర్పించక అనుభవించుచో దొంగలగుదురు.

పాఠకులారా! సీతారాముల వయోనిర్ణయమును కూడ గమనింతము. సీతారాముల వయస్సును వాల్మీకి ఒక్కచో కంఠోక్తిగా చెప్పకపోయినను అచ్చటచ్చట చెప్పియున్నాడు. దశరధుడు విశ్వామిత్రునితో చెప్పునప్పుడు

శ్లో॥ "ఊనషోడశ వర్షోమె రామో రాజీవలోచనః"

అనుటచే రామునకు పదునారు వత్సరములకు తక్కువవయస్సని తెలుచున్నది. ఇంకను అరణ్యకాండమున మారీచుడు రావణునితో రాముని చరిత్ర చెప్పుచు "దశరధుడు విశ్వామిత్రునితో చెప్పిన విషయము నిట్లు చెప్పెను.

శ్లో॥ "ప్రత్యువాచ మహాభాగం విశ్వామిత్రం మహామునిం,
బాలో ద్వాదశ వర్షోయ మకృతాస్త్రశ్చ రాఘవః.

నారామునకు పండ్రెండు సంవత్సరములు.అస్త్రసంపత్తి తెలియదు. అని చెప్పినట్లు వర్ణించబడినది. కాన,

బాలకాండయందు చెప్పబడిన "ఊన" అనుశబ్దమునకు-పాదోనము - (4వవంతు) అని అర్ధముచెప్పినచో రామునకు పడ్రెండు వత్సరములు అని తేలును. అరణ్యకాండమున సీత రావణునితో సంభాషించు నప్పుడుకూడ"మమభర్తా మహాతేజావయసా పంచవింశకః" అనుటచే అరణ్యమునకు వచ్చునప్పటికి రామునకు యిరువది అయిదు సంవత్సరములని చెప్పినటుల తేలుచున్నది.

ఇక సీత తనుగురించి "అష్టాదశహివర్షాణి మమజన్మనిగణ్యతే" అరణ్యమునకు వచ్చునప్పటికి నాకు పదునెనిమిది వత్సరము లని చెప్పినది,

కావున సీతారాములకు వారి వివాహముల కాలము నాటికిరామునకు పండ్రెండు సంవత్సరములు సీతకు ఆరు సంవత్సరములు వయస్సుండెనని తేలుచున్నది.

## — పరశురామ గర్వభంగము —

దశరథుడు పుత్రులతో మిథిలానగరముదాటి కొంత దూరమరుగ పరుషధ్వనులతో పక్షులు కూయసాగెను. అప్పుడే యడవి మృగములు ప్రదక్షిణముగా పరుగిడుచుండెను. దశరథుడు భయకంపితుడై ఆ శకునములగూర్చి వశిష్ఠుని ప్రశ్నించెను. వశిష్ఠుడు రాజేంద్రా! భయపడకుము. పక్షికూతలచే స్వల్పభయము సంప్రాప్తమగును కాని మృగములు ప్రదక్షిణముగా పోవుచున్నందున జయము కలుగునని యోదార్చుచుండెను. అంతలో చూపరుల గుండెలు జల్లుమన సుడిగాలి రివ్వున వీయదొడగెను. ధూళి వ్యాపించి భూనభోంతరాళములకప్పెను. ఆ కటికి చీకటియందు మిగుల భయంకరాకారుడై క్రోధమున ప్రళయాగ్నిరుద్రుడై కోదండమును కేల గ్రహించి మూపున గండ్రగొడ్డలి ప్రకాశించుచుండ దుర్నిరీక్షుడై జమదగ్నిసూనుడగు పరశురాముడు వేగిరపాటుతో వచ్చుచుండెను. ఆతని దూరమునుండియే చూచి మునీశ్వరులు గుంపులుగూడి ఈతడు ఇరువదియొక్కమారు క్షత్రియుల వధించినపిమ్మట నీకార్యము మానివై చెను. మరల నీతడు క్షత్రియవధకు పూనుకొనెనా ఏమి? అని చెప్పుకొనుచుండగా పరశురాముడు రెండవదండధరునివలె దశరథాదుల సమీపించెను. మునీశ్వరులందరు నాతని కర్ఘ్యపాద్యాదులొసంగి తియ్యనిమాటల సంభాషింపజొచ్చిరి. కాని పరశురాముడు మునిసమూహముల దాటి శ్రీరాముని సమీపించుచుండెను. అంతలో దశరథుడు పరశురామునిచూచి భయమున శరీరము వణక పరశురామా!

దయామయా నీవు బ్రాహ్మణుడవు. క్షత్రియునివలె రోష మును వహింపదగునా! బాలురగు నా పుత్రుల కభయ మిచ్చి రక్షింపుము తొల్లి క్షత్రవధానంతరము అస్త్రశస్త్ర ముల ముట్టనని దేవేంద్రునితో ప్రతిజ్ఞ యొనర్చితివిగదా! భూమినంతయు జయించి కాశ్యపునకు దానమొసంగిన దాతవు మునీంద్రా! నా కుటుంబ హాని కల్పింప నే తెంచితివా! రాము నకు హాని కలిగిన నాకును నా కుటుంబమునకును తప్పక హాని వాటిల్లును. అని పలుకు దశరథుని దీనాలాపముల త్రోసిపుచ్చి శ్రీరామచంద్రున కభిముఖుడై దశరథరామా! శైవచాపమును ఛేదించితివి గాని యీ నా చేతనున్నది వైష్ణవ చాపము, దీని నెక్కు బెట్టితివేని పిమ్మట నీతో ద్వంద్వయుద్ధము సలిపెద. రామచంద్రు డాపరశురాముని బీరముల నాలించి పరశురామా! నీ వీరత్వము నేనెరుంగుదు. గాని గురువృద్ధుల యెదుట గౌర వముగా నూరకొంటిని. అమోఘమగు నాబలపరాక్రమము నిక చూపెద చూడుము. అని క్రోధావేశ పూరితుడై దివ్యమానవ విగ్రహుడై అశేష తేజోబల ప్రభావమును ప్రదర్శించుచు భార్గవుని హస్తమునుండి చాపమును గ్రహించెను. పిమ్మట నారి మ్రోగించి శరమును సంధించి క్రోధమున భార్గవా! "బ్రాహ్మణోసీతిపూజ్యోమె * విశ్వామిత్రకృతేనచ," బ్రాహ్మణుడవగుటచే నిన్నింత దనుక పూజించితిని. అందును నా గురువగు విశ్వామిత్రునకు సంబంధీకుడవగుటచే నీ వవధ్యు డవై తివి. ఇక క్షత్రధర్మము ననుసరించి నిన్ను సహింపనోప.

---

* విశ్వామిత్రుని చెల్లెలు సత్యవతి ఆమెకు ఋచీకునివలన జమదగ్ని. జమ దగ్ని పుత్రుడు పరశురాముడు.

కాన ఈ శరముచే నీ పాదముల ఛేదింపుమనెదవా లేక నీ తపోబల సమార్జితములగు నీపుణ్యసోపానములను భ్రంశమొనర్ప మనెదవా ! అన పరశురాముడు దశరధ రాముని జగన్నాథు డని తలచి "అక్షయం మధుహంతారం జానామిత్వాంసురేశ్వర" నిన్ను అవ్యయునిగాను నాశనరహితునిగాను తెలిసికొంటిని. రామా నీవే జయించితివి.

కాని, నేనీ భూమిని తొల్లి కశ్యపునకు దానమొసంగితి. అందుచే నీభూమి యందొక్క రాత్రికూడ నుండతగదు. కాన మనోజవముచే హిమవత్పర్వతమునకుబోయి తపమాచరించెద. లోకాంతరముల కేగు నాతపఃఫల సోపానముల ఛేదింపుము. జాగుచేయవలదు. అన శ్రీరామచంద్రుడు అమోఘమగు నా బాణమును వదలెను. ఆశరము పరశురాముని తపోబలసమార్జితములగు పుణ్యలోకముల దహించివైచెను. దేవతలు మేలు మేలని పొగడిరి. పరశురాముడును తపమాచరింప హిమవంతమునకు జనెను. రాముడాచాపమును వరుణునకిచ్చివైచెను. పిమ్మట రాముని అప్రతిహత శక్తికి ఋషులు మొదలగు వారందరును ఆనందించిరి. దశరథుడు పుత్రులు పునర్జీవితులైరని సంతసించెను.

ఆవల చతురంగిణీసేన అయోధ్యాభిముఖమై ముందు నడచెను. రాకుమారులు తమ నూత్నవధువులతో గృహప్రవేశమైరి. కొంతకాలము గడచెను. దశరధుడు భరతుని మేనమామయగు యుధాజిత్తుతో కేకయ రాజ్యమునకు వెళ్లుట

కాజ్ఞ యొసంగెను. భరతుడును మాతాపితరుల కభివాదన మొనర్చి రామునాజ్ఞగొని యుధాజిత్తుతో పయనమయ్యెను.

శత్రుఘ్నుడును ఆతనిననుసరించి వెళ్లెను.

పాఠకులారా! పరశురాము గర్వభంగమను కథను పఠించియుంటిమి. ఇక అందలి విశేషమును గమనింతము;

నిష్కల్మషమగు తన నిజస్వరూపమును తెలుసుకొన దలచిన ముముక్షువునకు పాపకర్మ లెట్లు ప్రతిబంధకములో పుణ్యకర్మలుకూడ నట్లె ప్రతిబంధకములు. ప్రతిబంధకములగు ఆకర్మబంధముల ద్రెంచుకొనిననేగాని తన నిజస్వరూపమును గుర్తెరుగజాలడు. ఆకర్మబాధముల త్రెంచవలెనన్న ఆకర్మ ఫలముల త్యాగము చేయవలెను. అనగా తాను చేయు కర్మ లకు కలుగు ఫలములను పరమేశ్వరున కర్పింపవలెను. అట్లు కానిచో ఆ పుణ్యఫలమువలన లోకాంతరముల కేగి అందుండు భోగముల ననుభవించి తిరిగి కర్మల చేయుచు భోగముల ననుభవించుచు దుఃఖమునె పొందును. కావున పరుశురాముని యందుగల అనుగ్రహముచే శ్రీరాముడు స్వర్గాదిలోకములకు సోపానములుగా నున్న పుణ్యఫలముల నశింపచేసి ఆతని కర్మ బంధముల త్రెంచి మోక్షమొసంగెను. ఎట్లన సోహం అనుదానిలోని హల్లులను తీసివేసినయడల ప్రణవముఅగును.

"శ్లో॥ సకారంచ లోపయిత్వావినిర్ధిశేత్,
సంధిర్వై పూర్వరూపాఖ్యం తతోసౌ ప్రణవోమతః"
(ఆప్రణవమే ధనస్సు ప్రణవోధనుః

ఆ ధనస్సును పరశురాముడు రామున కిచ్చెను, అనగా సోహం భావముచే పరమేశ్వరుని సమీపించెను. శ్రీరాముడు ఆతని కర్మబంధమును శరముచే భేదించెను. అనగా దాని ఫలము లేకుండునట్లు చేసెను. అందువలన పరశురాముడు ముక్తిని పొందెనని మనము తెలుసుకొనవచ్చును. పరశురాము డొనర్చిన పుణ్యము మాతాపితరుల ఆజ్ఞాపాలనము – ఇట్టిపుణ్య ముండుటచేతనే శ్రీరాముడు ఆతని కర్మబంధములను త్రెంచి ముక్తునిగా జేసెను. కావున పాఠకులు ధర్మారాధనవల్లగాని మోక్షము సిద్ధించదని జ్ఞప్తియందుంచు కొందురుగాక !

బాలకాండము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ.

# ఆర్షవిజ్ఞాన గ్రంథమాల—బెజవాడ

## ఆ శ య ము లు.

---

1 ఆర్యమత రహస్యముల సవిమర్శముగా ప్రచురించుట

2 ఆదర్శపురుషుల జీవితములందలి పవిత్రవిషయములను ఆచరణలో పెట్టుటకు అనుకూలించు రీతిని గ్రంథములను ప్రచురించుట.

3 ఆర్యమతోద్ధారకుల జీవితచరిత్రముల ప్రకటించుట.

వివరములు.

ఒకేసారి రు. 200-0-0 విరాళమిచ్చువారు మహారాజపోషకులు

| | |
|---|---|
| 116-0-0 | రాజపోషకులు |
| 58 0-0 | పోషకులు |
| 25-0-0 | సహాయకులు |

మహారాజ, రాజపోషకుల పేర్లు గ్రంథమాలచే ప్రకటింపబడు ప్రతి గ్రంథమందును ప్రచురింపబడును. వారికి అట్టి పవిత్రగ్రంథము ఒక ప్రతి ఉచితముగా పంపబడును. సహాయకులపేర్లు "శ్రీరామప్రభ" ఏడువాల్యూములలో మాత్రమే ప్రకటించబడును. ఆయేడు వాల్యములు మాత్రమే వారికి ఉచితముగా పంపబడును. మహారాజపోషకుల ఫొటోను వారు చేరిన తదుపరి ప్రకటించు మొదటిపుస్తకములో ప్రచురింపబడును.

రు 0-8-0 లు ప్రవేశరుసుము చెల్లించువారు చందాదారు లగుదురు. వారికి గ్రంథమాలచే ప్రకటింపబడు ప్రతిపుస్తకము రూపాయికి పావలాతగ్గించి వి. పి. గా పంపబడును ప్రతి వి; పి. ని చందాదారులు తప్పక తీసుకొనుచుండవలెను. లేనియెడల సభ్యత్వము తొలగిపోవును. పోస్టుఖర్చులు ప్రత్యేకము. ఉదారాశయు లగు ఆంధ్రసోదర సోదరీమణులు మాయీయుద్యమమునకు సర్వవిధముల తోడ్పడ ప్రార్థితులు.

సంపాదకుడు.

సత్యనారాయణపురం - బెజవాడ.

# మా వద్ద దొరకు గ్రంథములు

ఆర్ష విజ్ఞాన గ్రంథమాల ప్రచురణములు: —

| | | |
|---|---|---|
| వేద వచనములు | ... | రు 0-2-0 |
| శ్రీరామప్రభ (బాలకాండ) | ... | 2-0-0 |

గీతా ప్రచురణాలయంవారి: —

| | | |
|---|---|---|
| గీతా బైబిల్ ఖురాన్ 3వ ముద్రణ | ... | 8-0-0 |
| అష్టోత్తర శతశ్లోకీ భగవద్గీత | ... | 2-0-0 |
| గోవిందనామాల భగవద్గీత | ... | 0-12-0 |
| శ్రీరామకృష్ణ వివేకానంద (నాటకం) | ... | 1-8-0 |
| సహస్రోపనిషత్సారం 1 భాగం | ... | 3-0-0 |
| భక్తిసోపానము | ... | 3-0-0 |
| నూతన సంవత్సరాది కానుక | ... | 0-2-0 |

ఆధ్యాత్మిక గ్రంథమండలివారి: —

| | | |
|---|---|---|
| జపయోగం | ... | 1-0-0 |
| ప్రాణాయామం | ... | 1-4-0 |
| యోగాసనములు (సచిత్రము) | ... | 2-0-0 |

పోస్టేజీ ప్రత్యేకం. వ్యాపారస్థులకు మంచి కమీషన్ యివ్వబడును.

వలయువారు: —

నండూరు సుబ్రహ్మణ్యశర్మ

ఆర్షవిజ్ఞాన గ్రంథమాల

సత్యనారాయణ పురం, — బెజవాడ.